

ఇందులో:

* 1948లో ప్రజాతంత్ర శక్తుల పురోగమనం
* భారతదేశంలో పెట్టుబడిదారీ ప్రభుత్వం
* సోవియట్ స్వాధీనంలోఉన్న జర్మనీలో వ్యవసాయ సంస్కరణ
* ప్రజాస్వామిక విధానంపై కామ్రేడ్ లెనిన్
* బర్మా బానిసత్వానికి లేబరుసామ్రాజ్యవాదుల వ్యూహం
* వ్యవసాయ సమస్యపై కామ్రేడ్ లెనిన్

10

1-3-49



# పెట్టుబడిదారీ ప్రభుత్వానికి కార్మికులు చెప్పే జవాబు

"లక్షోపలక్షలుగా ఉన్న మేము మా రెక్కలు విరుచుకొని కష్టించింది చాలు. ధనికులకోసం చాలాకాలం పనిచేశాం. —ఇక చాలు. దీర్ఘకాలం దారిద్ర్యాన్ని అనుభవించాం. ఈ అనుభవించిన దారిద్ర్యం చాలు. మా కష్టాన్ని చాలాకాలం దోచుకోనిచ్చాం ఇప్పుడు మేమంతా సంఘాలు పెట్టుకొని ఒక పెద్దపార్టీని నిర్మించి దానిలో కార్మికులనందరినీ ఐక్యపరుస్తాం, ఇంతకంటె మంచి జీవితపరిస్థితులను కల్పించుకుంటాం. ఇంతకంటె మంచి సమాజంకొరకు పాటుపడతాం. ఆ నూతన సమాజంలో ధనికులూ, దరిద్రులూ అనే భేదం ఉండదు. అందరూ పనిచేయవలసిందే. ఎవరో కొద్దిమంది ధనికులు మొత్తం ప్రజాసామాన్యంయొక్క శ్రమనంతా దోచుకోడానికి వీలుండదు. కష్టించేవారందరూ కలిసి ఫలితాన్ని అనుభవిస్తారు. యంత్రాలూ, శాస్త్రీయ పరిశోధనలూ ఎవరో కొద్దిమంది లాభాలకొరకై ఉపయోగించబడవు. నూతన సమాజంలో ప్రజలందరి కష్టాలను తగ్గించడానికై ఈ యంత్రాలూ పరిశోధనలూ ఉపయోగపడతాయి. ఈనాటి సమాజంకంటె అభివృద్ధికరమైన ఆ నూతన సమాజాన్నే సోషలిస్టు సమాజం అంటారు… …"

"మీ నిర్బంధాలూ, జైళ్ళు, శిక్షలు ప్రవాస శిక్షలూ, చివరకు మృత్యువుకూడా మమ్ములను భయపెట్టలేవు. మేము న్యాయంకోసం పోరాడుతున్నాం. కష్టజీవులందరియొక్క స్వేచ్ఛాసౌఖ్యాలకోసం పోరాడుతున్నాం. నేడు అసంఖ్యాక ప్రజానీకం అనుభవిస్తోన్న దౌర్జన్యాన్నీ, హింసనూ, దోపిడీనీ, దారిద్ర్యాన్నీ అంతరింపచేయడానికి పోరాడుతున్నాం. కార్మికుల్లో రోజురోజుకూ వర్గచైతన్యం అభివృద్ధి అవుతోంది.…ఎన్ని నిర్బంధ చర్యలనైనా ఎదుర్కొని విజయాన్ని సాధిస్తాం."

"ప్రభుత్వానికి కార్మికులు చెప్పే జవాబు ఇదే."

లెనిన్

("పల్లెటూరి పేదలకు" అనే పుస్తకంనుండి, పేజి 1-3)



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక


| సంచిక 10 | * 1-3-1949 * | వెల: ఎనిమిదణాలు |
|---|---|---|


## 1948 లో

# ప్రజాతంత్ర శక్తుల : పురోగమనం :

1948 గడచిపోయింది. ప్రజాస్వామికంకోసం, సోషలిజంకోసం ఈ సంవత్సరంలో ప్రపంచ శ్రామికవర్గం అనేక పోరాటాలు సాగించింది. సామ్రాజ్యవాద శక్తులపై ప్రజాస్వామిక శక్తులు యీ సంవత్సరంలో అనేక నూతనవిజయాలు సాధించాయి.

నూతన ప్రజాస్వామిక దేశాల్లోనూ, పెట్టుబడిదారీ దేశాల్లోనూ, గత సంవత్సరం కార్మికులూ, కష్టజీవులూ సాగించిన పోరాటంలో 1947 సెప్టెంబరు నెలలో పోలండులో జరిగిన వివిధ కమ్యూనిస్టుపార్టీల సమావేశంచేసిన ప్రకటనా, యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ పరిస్థితిపై ఇన్‌ఫర్మేషన్ బ్యూరో చేసిన తీర్మానమూ, ఈరెండు ప్రధాన డాక్యుమెంట్లూ మార్గదర్శకంగా పనిచేశాయి.

జాతీయతత్వాన్ని ప్రకోపింపజేసే భావాలకు వ్యతిరేకంగా పోరాడడం ద్వారా కమ్యూనిస్టుపార్టీలు శ్రామికవర్గ అంతర్జాతీయతను ఇంకా ముందుకు గొనిపోయాయి. సిద్ధాంతరంగంలో, నిర్మాణరంగంలో కూడా కమ్యూనిస్టుపార్టీలు ఇతోధికంగా బలపడ్డాయి. రెండునాలుకలతో వ్యవహరిస్తూ ట్రాట్స్కీయుతా అడుగుజాడలనే అనుసరించి సోషలిస్టు సంఘటనను విచ్ఛిన్నం చేయబూనుకున్న విద్రోహ పూరిత టిటో ముఠాను ప్రజాస్వామిక శిబిర మంతా ఏకగ్రీవంగా ఖండించింది.

గత సంవత్సరం సోషలిస్టు, ప్రజాస్వామిక శక్తులు అపరిమితంగా అభివృద్ధి చెందాయి. సోషలిస్టుభూమి అయిన సోవియట్ యూనియన్‌లో గత సంవత్సరం ఆర్థికరంగంలో, రాజకీయ రంగంలో, ప్రజలు సుఖప్రదమైన జీవితాన్ని అనుభవించడంలో, ఒక నూతనాభివృద్ధి – ఒక నూతనోత్సాహం – కలిగింది. సోవియట్ యూనియన్‌లో ఈనాడు జరిగే పారిశ్రామికోత్పత్తి యుద్ధానికి పూర్వం 1940 ఉత్పత్తికంటె, నూటికి 17 శాతం పెరిగింది. సోవియట్ ప్రజలు సాధించిన విజయాలనుబట్టి చూస్తే యుద్ధానంతర స్టాలిన్ పంచవర్ష ప్రణాళిక గడువు కంటె ముందే పూర్తి అవుతుంది అని ధైర్యంగా చెప్పవచ్చు.

# పోరాటంలో సోవియటు యూనియన్ నాయకత్వం

ప్రపంచమంతటా చిరస్థాయిగా వెలుగొందే ప్రజాస్వామిక శాంతికోసం వివిధ జాతులమధ్య సుహృద్భావపూరిత సహకారం ఏర్పడడంకోసం, పెట్టుబడిదారీ అనాగరికతనుంచి నాగరికతను కాపాడడంకోసం సాగించే పోరాటానికి ప్రతిభావంతుడైన మహానాయకుడు స్టాలిన్ ఆధ్వర్యాన సోవియట్ యూనియన్ నాయకత్వం వహిస్తూ ఉంది.

○ నూతన ప్రజాస్వామిక దేశాల్లోని కష్టజీవులైన ప్రజలు 1948లో అనేక విజయాలను సాధించారు. ఆ దేశాల్లో రాజకీయంగా అనేక మార్పులు జరిగాయి. భారీ పరిశ్రమలను జాతీయం చేయడం, వ్యవసాయ సంస్కరణల నమలు జరపడం, భూస్వామి, ధనిక రైతువర్గాల అధికారాన్ని తొలగించడం, వ్యవసాయ సహకారక్షేత్రాల నిర్మించడానికి అవసరమైన ప్రాథమిక చర్యలు తీసుకోడం, కార్మికవర్గ శక్తులన్నిటినీ ఐక్యం చేయడం, కార్మిక ప్రజల చొరవను పెంపొందింపజేయడం– వీటన్నిటి ఫలితంగా నూతన ప్రజా

స్వామిక దేశాల పురోభివృద్ధికి సుస్థిరమైన పునాది ఏర్పడింది. ప్రజాస్వామిక ప్రజాతంత్ర పరిపాలనపై ఆధారపడి ఈ దేశాలు కేపిటలిజంనుంచి సోషలిజానికి మారుతున్నాయి. శ్రామికవర్గ నియంతృత్వం కొనసాగించే కార్యక్రమాన్ని ప్రస్తుత చారిత్రక పరిస్థితిలో ఈ నూతన ప్రజాస్వామిక దేశాలు జయప్రదంగా నిర్వహిస్తున్నాయి.

నూతన ప్రజాస్వామిక దేశాల్లో కార్మికవర్గ నాయకత్వాన కార్మికప్రజల ప్రభుత్వాలు సమర్థంగా పనిచేస్తూ వున్నాయి. శక్తిమంతమైన సోవియట్ యూనియన్ సహకారంతో యీ దేశాలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. రోజురోజుకూ బలపడుతున్నాయి.

హంగేరీయొక్క వర్షత్రయ ప్రణాళిక గడువుకు ముందే పూర్తి అవుతుంది. జెకోస్లోవేకియా తన ద్వివర్ష ప్రణాళికను గడువుకుముందే పూర్తి చేసింది. బల్గేరియా, పోలండు ప్రణాళికలు జయప్రదంగా కొనసాగించబడుతున్నాయి.

## కార్మిక పార్టీల సమైక్యత

నూతన ప్రజాస్వామిక దేశాల్లోని కార్మికవర్గం గత సంవత్సరం ఒక మహత్తర విజయాన్ని సాధించింది. రుమేనియా, హంగరీ, జెకోస్లోవేకియా, పోలండు దేశాల కార్మికపార్టీల్లో సమైక్యత సాధించబడింది. మార్క్సిజం-లెనినిజంయొక్క ప్రాతిపదికపై బల్గేరియా సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టు పార్టీతో సమ్మిళితమైంది. ఇందువల్ల ఈ దేశాలయొక్క కార్మికోద్యమంలోని చీలికలు అంతరించిపోవడం, ప్రజాస్వామిక సోషలిస్టుశక్తులు ఇతోధికంగా బలపడడం జరుగుతూవుంది.

గత సంవత్సరం పెట్టుబడిదారీ దేశాల్లో ప్రజాసామాన్యం తన హక్కులకోసం సాగించే పోరాటం తీవ్రతరం అయింది. కార్మికప్రజల అగ్రగామి దళమైన కార్మికవర్గంయొక్క, ఆ వర్గపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ యొక్క నాయకపాత్ర, బలమూ, పలుకుబడీ చాలా అభివృద్ధి చెందాయి. ఇది గడచిపోయిన సంవత్సరంలో మనకు కనిపించే మరో విశేషత.

గత సంవత్సరం ఫ్రెంచి ప్రజల్లో ప్రబ్రహ్మాండమైన ఉద్యమం బయలు దేరింది. కార్మికప్రజలు సాగించిన పోరాటఫలితంగా అమెరికా సామ్రాజ్య

వాదుల చేతుల్లో కీలుబొమ్మలైన ఫ్రెంచి ప్రభుత్వాలు ఒక్కొక్కటే పతన మయ్యాయి. ఫ్రాన్సులో సమ్మెఉద్యమం బలపడింది.

ఫ్రెంచి మైనర్సు (గనుల్లో పనిచేసేవారు) రెండు మాసాలపాటు (అక్టోబరు – నవంబరు) సాగించిన సమ్మె ఫలితంగా ఫ్రెంచి లేబరు జనరల్ కాన్ఫెడరేషన్ ఇతోధికంగా బలపడింది కార్మికోద్యమ విచ్ఛిన్నకుల నిజ స్వరూపాన్ని బయల్పరచి వాళ్ళను కార్మిక ప్రజలనుంచి దూరంచేసింది.

అమెరికా సామ్రాజ్యవాదులూ వాళ్ళ తొత్తులైన ఫ్రెంచి పెట్టు బడిదార్లూ విధించే అక్రమ పన్నుల ఫలితంగానూ, ఫ్రెంచి జాతీయ స్వాతంత్ర్యానికే ప్రమాదం కలిగించే పరిస్థితు లేర్పడిన ఫలితంగానూ, మధ్యతరగతి ప్రజలుకూడా చాలా వేగంగా శ్రామికవర్గ సంఘటనలోకి వస్తున్నారు. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి ఏవిధంగా నానాట అభి వృద్ధి చెందుతూ ఉందో ఇటీవల జరిగిన మ్యునిసిపల్ ఎన్నికలే రుజువు చేశాయి.

# నూతన యుద్ధప్రేరేపకులు

నూతన యుద్ధప్రేరేపకులకు వ్యతిరేకంగా సాగించే పోరాటంకూడా దినదిన ప్రవర్ధమానమవుతూ ఉంది. స్వాతంత్ర్యంకోసం దేశభక్తులు సాగించే పోరాటంలోనూ, శాంతి స్వాతంత్ర్యాలను కాపాడడంకోసం నవంబరు నెలాఖరునజరిగిన నేషనల్ కాంగ్రెసు (ఫ్రాన్సు) సమావేశం సాధించినవిజయం లోనూ ఈ అభివృద్ధి స్పష్టంగా గోచరమవుతూ ఉంది. "సోవియట్ యూని యన్‌కు వ్యతిరేకంగా ఫ్రెంచి ప్రజ ఎప్పటికీ పోరాడరు" అని కమ్యూనిస్టు పార్టీ చేసిన ప్రకటనను ఫ్రెంచి ప్రజాసామాన్యం హృదయపూర్వకంగా బలపరుస్తోంది.

ఇటలీ కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి అయిన కామ్రేడ్ టోగ్లియాటీపై జరిగిన హత్యాప్రయత్నాన్ని నిరసిస్తూ దేశమంతటా జరి గిన బ్రహ్మాండమైన సమ్మెకాలంలో ఇటలీ కార్మికవర్గ ఉద్యమం, ప్రజాస్వామి కోద్యమం విపరీతంగా బలపడ్డాయి.

మార్షల్ ప్లానుయొక్క ఆర్థిక విషపరిణామ ఫలితంగా ఇటలీలో 25 లక్షలమంది కార్మికులు నిరుద్యోగానికి బలి అయ్యారు. ఇటలీ పరిశ్రమలు రోజురోజుకు దెబ్బతిని పోతున్నాయి. ఇటలీ ప్రభుత్వం ద్రోహబుద్ధితో దురాక్రమణ పూరిత - ప్రజాస్వామిక వ్యతిరేక సంఘటన నిర్మాణాన్ని, అట్లాంటిక్ కూటమియొక్క నిర్మాణాన్నీ తీవ్రంగా బలపరుస్తూ తద్వారా ఇటలీ జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాడే సామ్రాజ్య వ్యతిరేక ప్రజాస్వామికశక్తు లన్నిటి మధ్య సన్నిహిత మైత్రి ఏర్పడడానికి కారణభూత మవుతూవుంది.

సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ఇటలీ ఫ్రాన్సుదేశాల ప్రజాసామాన్యాన్ని ఇంధనంగా - వంటచెరుకుగా - ఉపయోగించుకోగలమో, లేమో అనే సందేహంతో సామ్రాజ్యవాదులు తమ స్వాధీనంలోవున్న జర్మనీ ప్రదేశాలపైనా, ఫాసిస్టు స్పెయిన్‌పైనా ఆశలు పెట్టుకుంటున్నారు.

కాని పశ్చిమజర్మనీ విషయంలో సామ్రాజ్యవాద శిబిరంలోనే పరస్పరవైరుధ్యాలు పెరుగుతున్నాయి. ఇక స్పెయిన్‌విషయం చూద్దామా అంటే అక్కడకూడా సమ్మెపోరాటాలు తీవ్రంగా విజృంభిస్తున్నాయి. ఫ్రాంకో నిరంకుశాధికారాన్ని ఎదిరించి గెరిల్లాలు వీరోచితంగా సాయుధ పోరాటం సాగిస్తున్నారు.

సామ్రాజ్యవాదులు ఎక్కడ అడుగుపెట్టినా వాళ్ళకు చుక్కెదురే. అమెరికా సామ్రాజ్యవాదులముందు దాసోహం అనేందుకు ఏదేశప్రజలూ సిద్ధంగా లేరు. తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకునేందుకు సామ్రాజ్యవాదులను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు.

ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులకు అమ్ముడుబోయిన గ్రీసు ఫాసిస్టు రాచరికవాదుల నిరంకుశాధికారంనుంచి గ్రీకు ప్రజాసైన్యం అనేక విశాలప్రదేశాలను విముక్తిచేస్తూ వుంది.

దక్షిణ అమెరికా దేశాల్లోకూడా సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం రోజురోజుకూ బలపడుతూవుంది.

# చైనా ప్రజాసైన్యం సాధించే విజయాలు

ఆసియాలోవున్న సామ్రాజ్యవాదుల కోటలన్నీ ఒక్కొకటే కూలిపోతున్నాయి.

ప్రజాస్వామికశక్తిని బలవత్తరం చేయడంలో, సామ్రాజ్యవాద శిబిరంతో పోల్చి చూచినప్పుడు అంతకంటె ఎక్కువ శక్తులను ప్రజాస్వామిక శిబిరంలో చేర్చడంలో చైనా కార్మికప్రజలు సాగించే పోరాటం ఒక మహత్తర పాత్రను నిర్వహిస్తుంది. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన చైనా విముక్తిసైన్యం అనేక ఘనవిజయాలను సాధించింది.

వీత్‌నామ్, ఇండొనీషియా, బర్మా, మలయా ప్రజలుకూడా స్వాతంత్ర్యంకోసం వీరోచితంగా పోరాడుతున్నారు.

గత ప్రపంచ మహాయుద్ధంలో ఫాసిస్టు దురాక్రమణదారులు ఓడిపోయిన తర్వాత ప్రపంచ అభివృద్ధినిరోధకవర్గానికి ప్రధాన కేంద్రమయిన అమెరికాలోకూడా ఇటీవల జరిగిన ఎన్నికల్లో రిపబ్లిక్‌పార్టీ ప్రతినిధి అయిన డ్యూయీ ఓడిపోయాడు. సామ్రాజ్యవాదుల దురాక్రమణ కార్యక్రమాన్నీ గుత్తవ్యాపారుల నిరంకుశ, నగ్న, నియంతృత్వాన్నీ అమెరికాలోకూడా అధికసంఖ్యాక ప్రజలు నిరాకరిస్తున్నారని ఆ ఎన్నికలు తెలియజేస్తున్నాయి.

యుద్ధశక్తులకంటె శాంతిశక్తులూ, అభివృద్ధినిరోధక, సామ్రాజ్యవాద శక్తులకంటె ప్రజాస్వామిక, సోషలిస్టుశక్తులూ బలవత్తరంగా వున్నాయని కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన మాటలను 1948 వ సంవత్సరం ధ్రువపరిచింది.

ఇక ఈ 1949 వ సంవత్సరంలో ప్రజాస్వామిక శిబిరం మరింత విశ్వాసంతో తన దృక్కులను ముందుకు ప్రసరింపజేస్తూఉంది.

సామ్రాజ్యవాదులు ఎటువంటి పోరాటంలేకుండానే చేతులెత్తరనీ - తమ స్థానాలను ఖాళీ చేయరనీ - మనకు తెలుసు.

కాని మనం కామ్రేడ్ మాలటావ్ చెప్పినట్లు "అన్ని రాస్త్రాలూ కమ్యూనిజానికే చేరుతూవున్న దశలో వున్నాం." కార్మికవర్గ శక్తులూ ప్రజాస్వామిక శిబిరం యొక్క శక్తులూ దినదినాభివృద్ధి చెందుతాయి. సామ్రాజ్యవాద శక్తులు రోజు రోజుకూ క్షీణించిపోతాయి.

● గత సంవత్సరం సాధించిన విజయాలను గట్టిపరచుకొని వాటిని ఇంకా పురోగమింపజేయడంద్వారానూ, సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యా

పార్టీని ఇంకా బలిష్ఠంగా చేయుడంద్వారానూ, ప్రజాస్వామిక స్వాతంత్ర్య కాముకభావాలుగల ప్రజలందరినీ సమీకరించి సంఘటితపరచడంద్వారానూ కమ్యూనిస్టుపార్టీలూ, కార్మికపార్టీలూ తమ తమ మాతృదేశాల జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యలకోసం సాగించే పోరాటాన్ని ఇంకా తీవ్రతరం చేస్తాయి. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలకు పెడర్థాలులాగే వాళ్ళనూ బూర్జువా జాతీయవాదులనూ నిస్సంకోచంగా ఎదిరించి వాళ్ళ ఆటకట్టి స్తాయి. యావత్ ప్రపంచంలో ప్రజాస్వామిక, సోషలిస్టుశక్తుల విజయం కోసం శ్రామికవర్గ అంతర్జాతీయతనూ, కార్మికవర్గంయొక్క ఆ వర్గపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీయొక్క నాయకపాత్రనూ బలపరచడానికి తీవ్రంగా పోరాడతాయి.

— కోమిన్‌ఫారం సంపాదకీయం
(1—1—49)

> "గాఢాంధకార మయమైన ఉన్మత్త ప్రపంచంలో లెనిన్ వెలిగించిన ఆవిప్లవజ్యోతిని ప్రపంచంలోని మరేశక్తీ ఆర్పివేయలేదు."
>
> — మాక్సిమ్ గోర్కీ

౪

# భారతదేశంలో పెట్టుబడిదారీ ప్రభుత్వం

## 1

ఒక సంవత్సరానికి పూర్వం భారత జాతీయ కాంగ్రెసు నాయకులు ప్రకటించిన "పెద్ద పెద్ద జాతీయ సంస్కరణల కార్యక్రమం" ఈ నాడు పత్తాలేకుండా అదృశ్యమై పోయింది. భారతదేశానికి నిజమైన రాజకీయ స్వాతంత్ర్యం రాలేదు. దేశం మాత్రం రెండు ముక్కలైపోయింది. జాతివైషమ్యం పరస్పర వినాశకరమైన దీర్ఘ యుద్ధంగా పరిణమించే ప్రమాదం ఏర్పడింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులయొక్క వలసదేశ పరిపాలనకు మూల స్తంభాలుగా ఉన్న సంస్థానాధిపతుల అధికారం ఎప్పటిలాగే చెక్కుచెదరకుండా కొనసాగుతూ ఉంది.

సంస్థానాలను భారతయూనియన్‌లో విలీనం చేసేందుకు ప్రభుత్వం సాగించిన 'సంస్కరణ' ఫలితంగా అస్తవ్యస్తంగా ఉన్న సంస్థానాధిపతుల స్థితి నేడింకా సుస్థిరంగా నెలకొల్పబడింది. రాజులు రాజప్రముఖులుగా తయారయ్యారు. మరికొందరు రాజులూ మహారాజులూ రాష్ట్రాలకు గవర్నర్లుగా నియమించబడ్డారు. అర్ధాకలితో అలమటించే భారతరైతాంగం ఎంతకాలం నుంచో నిరీక్షిస్తోన్న వ్యవసాయ సంస్కరణలు అమలు జరుపబడలేదు. భూమి ఎప్పటిలాగే భూస్వాముల చేతుల్లోనే ఉండిపోయింది. పల్లె ప్రాంతాల్లో వడ్డీవ్యాపారులు ఎప్పటిలాగే తమ పెత్తనం కొనసాగిస్తూనే ఉన్నారు. పరిశ్రమలను జాతీయం చేస్తామని కాంగ్రెసు తాను ఎప్పటినుంచో చేస్తూన్న వాగ్దానానికి ఇప్పుడు గుండుసున్న చుట్టింది. తమ ప్రాథమిక హక్కులను కాపాడుకోవడం కోసం నిలబడే కార్మికులపై దారుణమైన నిర్బంధ విధానం అమలు జరుపబడుతూ ఉంది. జాతీయ దురహంకారపూరిత ఫాసిస్టుసంఘాలు విజృంభించి ప్రజాస్వామిక శక్తులపై రాక్షస కృత్యాలు సాగిస్తున్నాయి. జాతీయవిముక్తి పోరాటంలో ప్రధాన పాత్రనిర్వహించిన ట్రేడ్ యూనియన్లూ, రైతు సంఘాలూ వగైరా ప్రజాసంస్థలన్నీ క్రూర హింసాకాండకు గురి అవుతున్నాయి. బ్రిటిష్ పరిపాలనలో అతిఘోరంగా హింసాకాండ జరిగిన రోజుల్లో పరిస్థితులెలా ఉన్నాయో నేడు కూడా అంతే ఉన్నాయి. ఇదే సమయంలో ఇండియాలో మరొక వైఖరి — ధనికవర్గాల పలుకుబడి త్వరత్వరగా పెరుగుతూ ఉండడం — కూడా స్పష్టంగా గోచరిస్తుంది.

ఈ నూతన వైఖరిని శ్రద్ధగా పరిశీలించవలసి ఉంటుంది. ఎందుకంటే ఇటీవల కాంగ్రెసు

అవలంబించే వైఖరిని అవగాహన చేసుకోవడానికి ఇదెంతో అవసరం.

జపాన్‌లో పాలకవర్గ కుటుంబాలు (జైబాత్సు) ఆదశకు పరిణతిచెందడానికి వాటివెనక ఒక వందసంవత్సరాల చరిత్రఉంది. కాని ఇటీవల కొద్ది సంవత్సరాల్లోనే ఇండియాలోని కొన్నికుటుంబాలు పాలకవర్గ కుటుంబాలుగా తయారయ్యాయి. ఫ్యూడల్-సామ్రాజ్యవాద పరిపాలనతోపాటే జపానులో 'జైబాత్సు' అభివృద్ధికూడా జరిగింది. అందువల్ల జపాన్ పాలకవర్గ కుటుంబాలకు మొదటినుంచీ జాతీయ ముద్రపడేఉంది. కాని ఇండియా పాలకవర్గ కుటుంబాలు బ్రిటిష్ వలసదేశ పరిపాలన ఫలితంగా ఉత్పన్నమయ్యాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలం వరకూ ఈపాలకవర్గ కుటుంబాల ప్రధాన ప్రతినిధులంతా బ్రిటిష్ పెట్టుబడిదారుల క్రింద ఏజెంట్లుగా ఉన్నవారే.

యూరోప్ యుద్ధఫలితంగా కొద్ది సంవత్సరాల్లోనే భారత పెట్టుబడిదారులు కుప్పతిప్పలుగా లాభాలను కూడబెట్టుకలిగారు. ఇండియా మార్కెట్టులో ఎక్కువ భాగాన్ని తమ స్వాధీనంలో అట్టిపెట్టుకున్నారు. బ్రిటిష్ దిగుమతులు దాదాపు పూర్తిగాఆగిపోయాయి.

యుద్ధ కంట్రాక్టుల్లో నూటికి 90 వంతులను వైస్రాయి ప్రభుత్వం ఇండియా పరిశ్రమలకే ఇవ్వవలసి వచ్చింది. ప్రభుత్వం ఇచ్చిన కంట్రాక్టుల ద్వారానూ బ్లాకుమార్కెట్ ద్వారానూ కలకత్తా బొంబాయి షాహుకార్లు విపరీతమైన లాభాలు గుంజారు.

ప్రజాఉద్యమ ఫలితంగా ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వం ఛిన్నాభిన్నమైపోయే దశలో ఈ పెట్టుబడిదారులు పెద్దపెద్ద రాజకీయ వ్యవహారాలను పూనుకున్నారు. భారత జాతీయకాంగ్రెసునాయకులతో ఇదివరకే తమకున్న సన్నిహిత సంబంధాలను పురస్కరించుకొని ఈ పెట్టుబడిదారులు కాంగ్రెసు రాజకీయాల్లో ప్రధానపాత్ర నిర్వహించసాగారు. ఈ పెట్టుబడిదారుల పలుకుబడే నేడు అన్ని జాతీయరంగాల్లో ప్రతిబింబిస్తూ ఉంది.

## 2

## బిర్లా

ఘనశ్యామదాస్ బిర్లా (బెంగాలు) అనే అతను ఈ పెట్టుబడిదారీ వర్గానికి ప్రధాన సూత్రధారి. ఈ బిర్లా సోదరులకు కలకత్తాలో పెద్దపెద్ద పరిశ్రమలున్నాయి. బిర్లాకూడా ఒక పెద్ద పెట్టుబడిదారే అయినప్పటికీ ఇండియాలోని తదితర పెట్టుబడిదారులతో పోల్చిచూస్తే అతను సామాన్యుడే. కాని గాంధీగారితో అతనికి చాలా దగ్గర స్నేహితం ఉండడంవల్ల విదేశాల్లో అతనికే ఎక్కువ పేరుండేది. భారత ప్రభుత్వంలో నేడు ఇతనికున్నంత అధికారం మరెవ్వరికీ లేదు. అందువల్లనే నేడు భారతదేశంలో ఉన్న ప్రభుత్వాన్ని కొందరు 'బిర్లా కంపెనీ ప్రభుత్వం' అని పిలుస్తున్నారు. అలా పిలవడంలో కూడా అర్థంలేకపోలేదు. రోజు రోజుకూ పెరిగిపోతూ ఉండే కలకత్తా కోటీశ్వరుల ధనరాసులను చూస్తే ఢిల్లీలో ప్రస్తుత రాజకీయ పరిపాలనయొక్క ఆంతర్యం బోధపడుతుంది.

బిర్లా అనేక భారీపరిశ్రమలకు యజమాని. పెద్దషాహుకారు. బ్యాంకరు. భూస్వామి. పత్రికా చక్రవర్తి. అతని చేతుల్లో నేడు అనేక

దినపత్రికలున్నాయి. దాదాపు 70 పరిశ్రమలు అతని స్వాధీనంలో ఉన్నాయి. జనపనార పరిశ్రమలూ, చక్కెర పరిశ్రమలూ, తేయాకు తోటలూ, బొగ్గుగనులూ, రసాయన పరిశ్రమలూ, కాగితం మిల్లులూ, విమానమార్గాలూ, మోటారు పరిశ్రమలూ, సైకిళ్ల ఫ్యాక్టరీలు, రవాణా కంపెనీలు, భీమా కంపెనీలు, పెద్దపెద్ద భూఖండాలు వగైరా జాతీయార్థిక జీవితానికి సంబంధించిన అనేక శాఖలు బిర్లా చేతుల్లో ఉన్నాయి. ఇటీవలి సంవత్సరాల్లో బిర్లా వ్యాపారం శరవేగంతో పెరిగిపోతూఉంది. యుద్ధకాలంలో కలకత్తాలో అతను స్థాపించిన యునైటెడ్ కమర్షియల్ బ్యాంకు భారత పారిశ్రామిక జీవితంలోనే అత్యంత ప్రముఖ పాత్ర వహిస్తూఉంది. ఈ బ్యాంకు చలామణి (రిసోర్సెస్) 30 కోట్ల రూపాయలకు పైగా ఉంటుంది. ఈ బ్యాంకు డైరెక్టర్లు తదితర 94 జాయింటు స్టాక్ కంపెనీల బోర్డుల్లో సభ్యులుగా ఉన్నారు. చాలాకాలంనుంచి కాంగ్రెసులోని మితవాద నాయకులతో బిర్లాకు చాలా సన్నిహిత సంబంధంఉంది. వారి పరిపాలక యంత్రానికికూడా ఇతను పూర్తిగా ధన సహాయం చేశాడని ప్రతీతి. కాంగ్రెసును బలపరచే అత్యధిక ప్రచారంగల అనేక జాతీయ పత్రికలు – హిందూస్థాన్ టైమ్స్, హిందూస్థాన్ (ఢిల్లీ), బొంబే క్రానికల్, భారత్, నాగపూర్ టైమ్స్, ఈస్టర్న్ ఎకానమిస్ట్, లీడర్, న్యూ ఇండియా, సెర్చిలైట్ వగైరాలు – బిర్లా చేతిలో ఉన్నాయి. ఢిల్లీలోని బిర్లాపత్రికకు దేవదాస్ గాంధి (గాంధీగారి కొడుకు) సంపాదకుడు. భారతదేశంలో నేడు ప్రజాభిప్రాయాన్ని పోతబోసే పత్రికాయంత్రం ప్రధానంగా బిర్లాచేతుల్లోనే ఉంది. ఇదేవిధంగా మరో ఇద్దరు కోటీశ్వరుల చేతుల్లో ఇంకా కొన్ని పత్రికలున్నాయి. నెహ్రూ ప్రభుత్వంలో దేశీయ శాఖామంత్రి, నెహ్రూ ప్రభుత్వ చక్రాన్ని తిప్పే అసలు సూత్రధారుడూ, కాంగ్రెసులో మితవాద పక్షానికి నాయకుడూ అయిన సర్దార్ పటేలుకూ, బిర్లాకూ ఉన్న సన్నిహితమైత్రి ప్రజలందరకు తెలిసిన విషయమే. సర్దార్ పటేల్ కొడుకైన దయాభాయ్ పటేల్ బిర్లా మిత్రబృందానికి చెందిన ఒక కంపెనీకి డైరెక్టరు. బిర్లాగారూ, అతని పత్రికలూ సర్దార్ పటేలును 'దేశోద్ధారకుడు' అని పొగుడుతూ ఆయనకు పూర్తిగా హారతి పడుతూ ఉంటాయి.

అనేక సంవత్సరాలనుంచి పటేల్ కాంగ్రెసుకు కోశాధిపతిగా, కాంగ్రెసు నిర్మాణ యంత్రానికి ప్రధాన సూత్రధారుడుగా ఉంటున్నాడు. ఈనాటి కాంగ్రెసు నాయకుల్లో అనేకమంది ఆయన శిష్యులే. ఆయన ఆశ్రయం మీదనే ఆధారపడి ఉంటారు. కాంగ్రెసును పచ్చి ఫాసిస్టు పంథావైపు నెట్టుకుపోతూన్న మత దురహంకార పూరితమైన హిందూమహాసభలాంటి అభివృద్ధి నిరోధక మితవాద సంస్థకు పటేల్ ప్రోత్సాహం ఉన్నదని భావించబడుతోంది.

హిందూమహాసభకు ఫాసిస్టు సైనిక సంస్థ అయిన రాష్ట్రీయ స్వయంసేవక సంఘమే అనేక ప్రాంతాల్లో ముస్లింలను హత్యచేసింది.

చివరకు గాంధీజీ హత్యకుకూడా కారణభూతమయింది.

భారతదేశానికి భావి నియంతగా అనేక మందిచే భావించబడే పటేలు, సర్వాధికారాలను చలాయించగల దేశీయ శాఖామంత్రి అయిన పటేలు బిర్లాసోదరులకెప్పుడూ సర్వసహాయం అందజేస్తూనేఉంటాడు.

## తాతా

భారతకుబేరుల్లో బిర్లాతర్వాత ఇక రెండవవాడు తాతా. ఈ తాతాకుటుంబం దాదాపు భారత భారీ పరిశ్రమనంతా గుత్త తీసుకుంది. జమ్షెడ్ పూర్ లో ఉన్న ఉక్కుపరిశ్రమ ఈ కుటుంబానికి చెందినదే. ఈ ఉక్కుపరిశ్రమలో 45 వేలమంది కార్మికులు పనిచేస్తూ ఉంటారు. ఎలెక్ట్రిసిటీ, ఇంజినీరింగ్, కెమికల్ ఫ్యాక్టరీలూ, నేత పరిశ్రమలూ, రంగు వేసే పరిశ్రమలూ మొత్తం 26 కంపెనీలు వీళ్ల స్వాధీనంలో ఉన్నాయి. 1948 ఏప్రిల్ నెలలలో "ఎయిర్ - ఇండియా ఇంటర్నేషనల్ లిమిటెడ్' అనే పేరుతో వీళ్ల యాజమాన్యాన ఒక విమాన సర్వీసుకూడా నెలకొల్పబడింది. ఒక పెద్దమోటారు పరిశ్రమను నిర్మించడానికి కూడా 'తాతా'లు ప్లాను వేస్తున్నారు. ప్రైవేటు బ్యాంకుల్లో అన్నిటికంటె పెద్దదైన ఇండియా సెంట్రల్ బ్యాంకు కూడా వీళ్ల యాజమాన్యంలోనే ఉంది. ఈ బ్యాంకియొక్క చలామణి (రిసోర్సెస్) మొత్తం 125 కోట్ల రూపాయలు.

భారత జాతీయ కాంగ్రెసుకు తాతా కుటుంబం మరొక మూలస్తంభం లాంటిది. ఒకవైపు కాంగ్రెసుకు మూలస్తంభంగా ఉంటూనే ఈ కుటుంబం బ్రిటిష్ వలసపరిపాలనతో పూర్తిగా సహకరిస్తూఉంటుంది. తాతా ముఠాలో కొందరు బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన బిరుదులనుకూడా స్వీకరించారు. తాతా సన్సు లిమిటెడ్ లో ఒక డైరెక్టరు అయిన జాన్ మత్తాయి యుద్ధానికి పూర్వం వైస్రాయి ప్రభుత్వంలో ఒక ప్రధాన పదవిలో ఉండేవాడు. ఇప్పుడు నెహ్రూ మంత్రివర్గంలో రవాణా, రైల్వే శాఖామంత్రిగా ఉన్నాడు. తాతా కంపెనీలో డైరెక్టర్లుగా ఉన్న అర్దేషిర్ దలాల్, సర్ గురునాథ్ వి. బెవూర్ లు బ్రిటిష్ వలస పరిపాలనలో ఫీల్డ్ మార్షల్ వేవెల్ క్రింద మంత్రులుగా ఉండేవారు. ఇప్పుడు వీరే 'జాతీయ' ఆర్థికవిధానంలో ప్రధానపాత్ర నిర్వహిస్తున్నారు. తాతాబ్యాంకిలో డైరెక్టరుగా ఉన్న సి. హెచ్. భాభాకు కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన వెంటనే వాణిజ్యశాఖా మంత్రిపదవి ఇవ్వబడింది.

## దాల్మియా

ఈ పాలకవర్గ కుటుంబాల్లో ఇక మూడవది దాల్మియాది. బొగ్గు, విద్యుచ్ఛక్తి, ఇనుము, ఉక్కు కెమికల్స్, చక్కెర, కాగితం సిమెంటు వగైరా 30 ప్రధాన పరిశ్రమలు ఈ దాల్మియా కుటుంబం చేతుల్లోఉన్నాయి. ఇన్సూరెన్సు సొసైటీలమీద, ఇండియన్ నేషనల్ ఎయిర్ వేస్ మీద వీళ్లదే యాజమాన్యం. భారతబ్యాంకి ఈ గ్రూపుకు సంబంధించినదే. బిర్లాలాగే దాల్మియాకూడా ఒక పత్రికా చక్రవర్తి. టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ న్యూస్ క్రానికల్, సివిల్ అండ్ మిలటరీ గెజట్, నేషనల్ కాల్ వగైరా పత్రికలు దాల్మియాల చేతుల్లో ఉన్నాయి. ఈ పత్రికలుకూడా కాంగ్రెసును బలపరుస్తూనే ఉంటాయి బిర్లాలాగే దాల్మియాలుకూడా హిందూమత దురహంకారసంస్థ అయిన మిలిటరీ-ఫాసిస్టు రాష్ట్రీయ స్వయం సేవకసంఘానికి ధనసహాయం చేస్తూంటారు.

## గోయెంకా

సర్దార్ పటేలుకు సన్నిహితమిత్రులలో మరొకరైన సర్ బదరీదాస్ గోయెంకా ఒక పెద్ద షావుకారు, బ్యాంకరు, పరిశ్రమల యజమాని, భూస్వామి. పత్రికా చక్రవర్తుల్లో గోయెంకా కుటుంబం మూడవది. (ఆంధ్ర ప్రభ ఈ కుటుంబంవారిదే – అనువాదకుడు.) ర్యాలీ బ్రదర్స్ లిమిటెడ్ యొక్క లండన్ బ్యాంకింగుకంపెనీకి ప్రతినిధి. బ్రిటిష్ యాజమాన్యంలో ఉన్న ఇండియా ఇంపీరియల్ బ్యాంకికి ప్రధానడైరెక్టరు. దేశంలో ఉన్న మొత్తం బ్యాంకు డిపాజిట్లలో మూడవవంతు ఈ ఒక్క బ్యాంకులోనే ఉన్నాయి.

## సింఘానియా

సింఘానియా కుటుంబానికి యు. పి. లో ముఖ్యమైన హిందూస్తాన్ కమర్షియల్ బ్యాంకితోనూ, జయపూర్ బ్యాంకుతోనూ సంబంధం ఉంది. దూది మిల్లులనుంచి ఉక్కు పరిశ్రమలవరకు మొత్తం 43 పరిశ్రమలు వీళ్ల స్వాధీనంలో ఉన్నాయి. భారతదేశంలో ఉన్న అల్యూమినం పరిశ్రమలపై సింఘానియాలదే గుత్తాధికారం. సింఘానియా కుటుంబానికి పెద్దయైన లాలా పదంపత్ సింఘానియా భారత రాజ్యాంగ నిర్మాణసభలో సభ్యుడు. ఫాసిస్టు రాష్ట్రీయ సేవకసంఘాన్ని పోషించే వాళ్లలో ఇతనొకడు.

## హీరాచంద్ వాల్చంద్

హీరాచంద్ వాల్చంద్ బొంబాయిలో ఒక పెద్ద కంట్రాక్టరు. గృహ, నౌకా నిర్మాణ పరిశ్రమల్లో ముఖ్యుడు. బరోడా బ్యాంకికి యజమాని. ఇండియా, బర్మా, సింహళద్వీపాల్లో మొత్తం ఇతని చేతుల్లో 30 పరిశ్రమలున్నాయి.

## జయపూరియా

జయపూరియా అనే పెద్ద పెట్టుబడిదారుకు అభివృద్ధినిరోధకసంస్థ అయిన హిందూమహాసభతో చాలా దగ్గర సంబంధాలున్నాయి. హిందూస్తాన్ కమర్షియల్ బ్యాంకిద్వారా అతనికి 81 జాయింటుస్టాక్ కంపెనీలతో సంబంధం ఉంది.

## ఇస్పహానీ

ఇస్పహానీ కలకత్తాలో ఒక పెద్ద షావుకారు. కాంగ్రెసు పెట్టుబడిదారీవర్గంలో ఇతను ముస్లిం పెట్టుబడియొక్క ప్రయోజనాలకు ప్రాతినిధ్యంవహిస్తూ ఉంటాడు. 1943 లో లక్షలమంది ప్రజలను పొట్టబెట్టుకున్న బెంగాల్ కరువుసందర్భంలో బియ్యపుజట్టీబేరాలద్వారా ఇస్పహానీలు విపరీత లాభాలు గడించారు. ప్రభుత్వం నియమించిన బియ్యం కంట్రోలు బోర్డులో వీరు సభ్యులు. భారత ప్రజలకు ప్రధాన ఆహారధాన్యమైనబియ్యాన్ని ఈ ఇస్పహానీలు తమ గోదాముల్లో విపరీతంగా నిలవ చేసి బియ్యంధరలు పెరిగేటట్లు చేశారు.

పైన చెప్పిన 5 కుటుంబాలు-బిర్లా, టాటా, దాల్మియా, సింఘానియా, వాల్చంద్ కుటుంబాలు – మొత్తం 185 జాయింటు స్టాక్ కంపెనీలను పూర్తిగా తమ చేతుల్లో పెట్టుకున్నాయి. ఈ 5 కుటుంబాలు తమ బ్యాంకులద్వారా ఇంకా అనేక జాయింటు స్టాక్ కంపెనీలపై యాజమాన్యం వహిస్తున్నాయి. యునైటెడ్ కమర్షియల్ బ్యాంకులో గోయెంకాకూ, ఇస్పహాని పరిశ్రమల్లో బిర్లాకూ భాగాలున్నాయి. ఇదేవిధంగా టాటా కెమికల్ ఫ్యాక్టరీలో

వాళ్ళకుకూడా వాటా లున్నాయి. ఈ విధంగా ఈ కుటుంబాల పరస్పర ప్రయోజనాలు ఒక దానితో ఒకటి కలిసి ముడిబడి పోయాయి - పోతున్నాయి. ఈ కుటుంబాల యాజమాన్యంక్రింద ఉన్న ఆరు బ్యాంకుల్లోని - (ఇండియా సెంట్రల్ బ్యాంకి, యునైటెడ్ కమర్షియల్ బ్యాంకి, భారత్ బ్యాంకి, హిందూస్తాన్ కమర్షియల్ బ్యాంకి, జయపూరుబ్యాంకి, బరోడా బ్యాంకి) మొత్తం డబ్బు రెండు మూడు శతకోట్ల రూపాయలవరకూ ఉంటుంది.

# సంస్థానాధిపతులతో ఆర్థిక సంబంధాలు

పై జెప్పిన పాలకవర్గ కుటుంబాలు సంస్థానాధీశులతో సన్నిహిత ఆర్థికసంబంధాలేర్పరచుకున్నాయి. సంస్థానాధీశులచేతుల్లో కొన్ని రాష్ట్రాలకు రాష్ట్రాలే ఉన్నాయి. బ్రిటిషుపరిపాలన రోజుల్లో ఈ సంస్థానాధిపతులు విపరీతంగా డబ్బు కూడబెట్టారు. ఉదాహరణకు జయపూర్ మహారాజానే తీసుకోండి. సింఘానియా యాజమాన్యంలో ఉన్న జయపూర్ బ్యాంకులో ఈ మహారాజు ఒక పెద్ద వాటాదారు. వాల్చంద్ స్వాధీనంలోఉన్న బరోడా బ్యాంకులో బరోడా మహారాజుకు వాటాలున్నాయి.

టాటా స్టీల్ వర్క్సులో అందరికంటె పెద్ద వాటాదారు గ్వాలియర్ మహారాజు. పాటియాలా మహారాజా, బికనీర్ మహారాజాలాంటి పెద్దపెద్ద సంస్థానాధిపతులకు సర్దారు పటేలు చాలా సన్నిహిత మిత్రుడు. ఇటీవల పటేలు సాగించిన 'సంస్థానాల సంస్కరణ' గుత్త పెట్టుబడిదారులతో సంస్థానాధిపతులు మిళితమై పోవడానికి బాగా తోడ్పడుతుంది.

ఈ శక్తులే నెహ్రూ ప్రభుత్వంపై తమ పలుకుబడిని చలాయిస్తున్నాయి. ఈ పెట్టుబడిదారీ ఏజంట్లే కాంగ్రెసు ఆర్థిక విధానాన్ని నడుపుతున్నారు. పరిశ్రమల్లోని వివిధ శాఖలపై యాజమాన్యం వహించే ప్రభుత్వ బోర్డులలో సభ్యులను నియమించింది సర్ అర్దేషిర్ దలాల్—ఇతడు బ్రిటిష్ వలస పరిపాలనలో ప్రధాన ప్రభుత్వోద్యోగి. టాటా కంపెనీ డైరెక్టరు. నూతన జాతీయ ఆర్థిక ప్రణాళికను తయారు చేయడానికి నెహ్రూ నియమించిన అడ్వైజరీబోర్డు మొత్తం సభ్యులు 14 మందిలో తొమ్మండుగురు పెట్టుబడిదారీ వర్గ ప్రతినిధులు.

ఈ పెట్టుబడిదారులకు లాభాలను కట్టిపెట్టడానికే నెహ్రూ ప్రభుత్వం ధరలపై కంట్రోలు లేకుండాచేసింది. తత్ఫలింగా జీవిత ప్రమాణం పెరిగిపోవడం, కష్టజీవులైన ప్రజలు నిరుపేదలుగా మారిపోతూఉండడం తటస్థించింది. బిర్లా అధిపత్యాన నడుస్తోన్న 'చక్కెర పరిశ్రముల యజమానుల సంఘం' (షుగర్ రిఫైనర్స్ అసోసియేషన్) ప్రత్యక్షంగా ఒత్తిడిచేసిన ఫలితంగానే చక్కెర పరిశ్రమపై కంట్రోలు ఎత్తివేయాలని ప్రభుత్వం ఇటీవల నిర్ణయించింది.

ఈ పెట్టుబడారుల యొక్క, వీళ్ళ ఏజెంట్లయొక్క చేతుల్లో కీలుబొమ్మల్లాగా ఆర్థికమంత్రులు వ్యవహరిస్తున్నారు. ఇటీవలనే తన పదవికి రాజీనామా చేసిన వాణిజ్యశాఖామంత్రి సి. హెచ్. భాభా బిర్లాకు ఏజెంటుగా పనిజేస్తున్నాడని బహిరంగంగా అతనిపై నేరం ఆరోపించబడింది. ప్రభుత్వ బొక్కసాన్నే ఈ మంత్రి

పుంగవుడు బిర్లాపరం చేశాడు. ప్రభుత్వం ఇచ్చే లైసెన్సుల్లో, ప్రభుత్వం కలిగించే తదితర వ్యాపార సౌకర్యాల్లో ఎక్కువభాగం బిర్లా కుటుంబానికే ముట్టాయి. నెహ్రూ ప్రభుత్వంలో అర్థికశాఖామంత్రిగా పనిచేసిన సర్ షణ్ముఖంచెట్టికూడా పెట్టుబడిదారీవర్గానికి ప్రత్యక్ష ప్రతినిధి.

'జాతీయ పద్ధతులపై' ఇండియా పరిశ్రమలనూ, ఆర్థిక విధానాన్నీ పునర్నిర్మించడం కోసం కాంగ్రెసు నాయకులు ప్రకటించిన ప్రణాళిక పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలతో పూర్తిగా ఏకీభవిస్తూఉంది. పరిశ్రమలను జాతీయం చేస్తాం అని ఇదివరకు నెహ్రూ అనేకసార్లువాగ్దానంచేశాడు. కాని ఆయనే ఇప్పుడు పరిశ్రమలు పది సంవత్సరాల దాకా జాతీయం చేయుడం జరగదనీ, ఈ పది సంవత్సరాలు గడచిన తర్వాత దాన్నిగురించి 'ఆలోచిస్తాం' అనీ ప్రకటించాడు. నూతన పరిశ్రమలను నిర్మించే అధికారాన్ని మాత్రం ప్రభుత్వం తన చేతుల్లో పెట్టుకుంది. ఆయుధాల్ని తయారుచేసే ఫ్యాక్టరీలూ, రైల్వేలూ ఇదివరకే ప్రభుత్వయాజమాన్యంలో ఉన్నాయి. ఇక ప్రభుత్వం నూతనంగానిర్మించబోయే పరిశ్రమల్లో పెట్టుబడిదారుల వ్యక్తిగత పెట్టుబడితోపాటు ప్రభుత్వంకూడా కొంత పెట్టుబడి పెడుతుంది.

ఇందుకు భారత పెట్టుబడిదారీవర్గంకూడా అమితంగాహర్షిస్తుంది. ఇందుకోసమే పెట్టుబడిదారులు ఎంతకాలంనుంచో నిరీక్షిస్తున్నారు. తమ గుత్తవ్యాపారాన్నీ, పరిశ్రమలనూ అభివృద్ధి చేసుకొడానికి పెట్టుబడిదారులకు ఇక ప్రభుత్వ ధనసహాయంకూడా లభిస్తుంది. పరిశ్రమలను జాతీయం చేయడానికి భారత పెట్టుబడిదారీవర్గం ఏమాత్రం అంగీకరించదు. రానున్న అయిదు సంవత్సరాల్లో 1220 కోట్ల రూపాయలను పరిశ్రమల్లో పెట్టుబడి పెట్టడం కోసమై వాళ్లు ప్లానులు వేస్తున్నారు. ఈ మొత్తం పెట్టుబడిలో నూటికి 38 వంతులు తాము పెట్టుబడిపెట్టి మిగతా 62 వంతుల పెట్టుబడిని ప్రభుత్వ బొక్కసంనుండి రాబట్టాలని చూస్తున్నారు.

ఈ విధంగా పెట్టుబడిపెట్టి నిర్మించిన పరిశ్రమలు గుత్తవ్యాపారుల చేతుల్లో ఉంటాయి.

ఇదే కాంగ్రెసు ప్రభుత్వం అవలంబిస్తోన్న పంథా. 1948 ఏప్రిల్‌లో బొంబాయిలో స్థాపించిన 'ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ లిమిటెడ్' ఇందుకొక చక్కని నిదర్శనం. ఈ 'లిమిటెడ్' కు నష్టాలేమాత్రం రాకుండా ప్రభుత్వం ముందే హామీ ఇచ్చింది. ఈ పరిశ్రమకు కావలసిన సౌకర్యాలన్నిటినీ ప్రభుత్వమే కలగజేస్తోంది. అయినప్పటికి ఈ 'లిమిటెడ్' లో ప్రభుత్వానికున్న వాటాలు సగానికంటె తక్కువే. బొంబాయి కోటీశ్వరుడైన తాతాకు ఇందులో ఎక్కువవాటాలున్నాయి. ఈ 'లిమిటెడ్' కు తాతానే అధ్యక్షుడుగా ప్రభుత్వం నియమించింది. దీనిపై సర్వాధికారాలు తాతా కుటుంబానివే. బెంగుళూరులో ప్రభుత్వం స్థాపించిన విమాన పరిశ్రమలో ఉన్న మొత్తం ముగ్గురు డైరెక్టర్లలో తాతానుకూడా ఒక డైరెక్టరుగా ప్రభుత్వం నియమించింది.

మొదట ప్రభుత్వ పరిశ్రమగా ప్రారంభమైన ఇంజిన్ (లోకోమోటీవ్) నిర్మాణ పరిశ్రమను ప్రభుత్వం తాతా కంపెనీకి ఇచ్చివేసింది. 10 కోట్ల రూపాయల పెట్టుబడితో ప్రారంభమైన నౌకానిర్మాణ పరిశ్రమలో

ప్రభుత్వానికే ఎక్కువ వాటాలున్నాయి. అయినప్పటికీ దాన్ని హీరాచంద్ వాల్చంద్ గారి వ్యక్తిగత యాజమాన్యంలో ఉంచింది. ఈ హీరాచంద్ వాల్చంద్ సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీకి యజమాని. భారతదేశంలోని పది పాలకవర్గ కుటుంబాల్లో ఇతనొకడు.

# 3

# బ్రిటిష్ అమెరికా గుత్తవ్యాపారులతో ఇండియా పెట్టుబడిదారుల సంబంధాలు

బ్రిటిష్ వలస పరిపాలనరోజుల్లో విపరీతంగా డబ్బు కూడబెట్టిన భారత పెట్టుబడిదారీవర్గం కాంగ్రెసు ప్రభుత్వహయాంలో ఆ డబ్బును ఇంకా కుప్పతిప్పలుగా పెంచివేయాలని చూస్తోంది. కాని అందుకు కావలసిన టెక్నికల్, ఆర్థిక రాజకీయ అవకాశాలు వాళ్ళకు చాలా స్వల్పమాత్రంగానే వున్నాయి. వాళ్ళ వెనక తెరచాటున పనిచేసే అసలు శక్తులు వేరే వున్నాయి. అనేక తరాలనుంచి దేశంపై పెత్తనం చేస్తోన్న బ్రిటిష్ వలసదేశ పెట్టుబడితోనూ, ఇప్పుడు అమెరికా గుత్త వ్యాపారుల ముఠాతోనూ భారత పెట్టుబడిదారులు పొత్తు కలుపుతున్నారు. అందువల్ల కాంగ్రెసు ప్రభుత్వంలోకి రావడంతో పెద్ద పెద్ద గుత్తవ్యాపార కంపెనీలు ఏర్పడుతున్నాయి.

వెనకటిలాగే భారతదేశంపై బ్రిటిష్ పెట్టుబడి ఇంకా అధికారం చలాయిస్తూనే వుంది. భారతదేశంలోని ప్రతి ఆర్థిక శాఖలోకి బ్రిటిష్ పెట్టుబడి చొచ్చుకుపోతూనే వుంది. యుద్ధానికిపూర్వం భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడి ఒక శతకోటి పౌన్ల స్టెర్లింగు వుంటుందని అంచనా వేయబడింది. బ్రిటిష్ పెట్టుబడిదార్లు తాము విదేశాల్లోపెట్టిన మొత్తం పెట్టిబడిలో ద్వితీయ ప్రపంచయుద్ధకాలంలో సగానికి సగం కోల్పోయారు. అయినప్పటికి ఇండియాలో వున్న వాళ్ళ పెట్టుబడిలో మాత్రం ఇంతవరకెట్టి తగ్గుదలా లేదు. లండన్ 'ఫైనాన్షియల్ టైమ్సు' ప్రకారం బ్రిటిష్ వాణిజ్య పెట్టుబడిలో 13కోట్ల 80 లక్షల పౌన్ల స్టెర్లింగు మాత్రం తగ్గింది. ఆతగ్గుదలను కూడా గత కొద్ది సంవత్సరాల్లో ఇండియాలో శీఘ్రంగా విస్తరించిన బ్రిటిష్ కంపెనీల వివిధశాఖల్లో కొత్తగాపెట్టిన పెట్టుబడి భర్తీచేసే వుంటుంది. లండన్ పెట్టుబడిదార్లు అనేకచోట్ల తమ స్థానాలను కోల్పోయియుండవచ్చు; కాని ఇండియాలో వున్న స్థానాలను మాత్రం కోల్పోవడమంటూ జరగలేదు. బ్రిటన్ స్వయంగా చావుదెబ్బకు గురి అయినప్పుడు కూడా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ప్రధాన దుర్గం అయిన ఇండియాను మాత్రం వాళ్ళు వదిలిపెట్టలేదు.

**యుద్ధానంతరంకూడా ఇండియాలో లండన్ పెట్టుబడిదారులు అవలంబించే విధానంలో – 40 కోట్ల భారతప్రజలనుదోపిడిచేసేవిధానంలో – ఎట్టిమార్పూ రాలేదు కాని వారి ఎత్తుగడలుమాత్రం మారాయి. బ్రిటిషు పెట్టుబడిదారులు తమ పేరుమీదనే ప్రత్యక్షంగా దోపిడిచేసే**

రోజులు గతించిపోయాయి. వలస దేశాలను దోపిడిచేయడంలో పరోక్ష పద్ధతులను – బైటికి నగ్నంగా కనపడని పద్ధతులను – అవలంబించవలసి వచ్చింది. లేబరు సామ్రాజ్యవాదు లవలంబించే 'నూతన వలసదేశ విధానం'లో ఉన్న అసలు రహస్యం ఇదే. భారత పెట్టుబడిదారులనుకూడా తమలో కొద్దిపాటి (జూనియరు) భాగస్వాములుగా చేర్చుకొని, లేక నామమాత్రంగా వారినే ప్రధాన (సీనియర్) భాగస్వాములుగా అంగీకరించి బ్రిటిషు పెట్టుబడిదారుల సైన్‌బోర్డులను ఇండియనైజ్ చేయడం, అంటే బ్రిటిషు పేర్లకు బదులుగా ఇండియా పేర్లు తగిలించడం చాలా సులువైన పద్ధతి. పెట్టుబడిలో పెద్దమొత్తాన్ని, వలసదేశాలను దోపిడిచేయడానికి అవసరమైన టెక్నికల్ సామగ్రినీ, యంత్రసామగ్రినీ అందజేసేది బ్రిటిషు గుత్తపెట్టుబడిదారులే. లాభాలకోసం కళ్ళు లొట్టలువేసుకుంటూ ఎదురుజూస్తూండే ఇండియా పెట్టుబడిదారులు ఎంత నీచానికైనా ఒడిగట్టి ఇండియాలో తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోడానికి పైజెప్పిన విధంగా తయారైన బ్రిటిష్ పరిశ్రమలకే జాతీయముద్రవేసివాటిని 'స్వదేశీ'గా చలామణీ చేస్తారు. కాంగ్రెసు ప్రభుత్వంకూడా వాటికి కావలసిన రాజకీయ సహాయాన్నంతా అందజేస్తారు.

ఇండియా పరిశ్రమలు బ్రిటిష్ గుత్తపెట్టుబడితో నిండిపోతున్నాయి. గడచిన ఒక్క సంవత్సరంలోనే బ్రిటిష్ కంపెనీల్లో లేక ఇండియాలో ఉన్న వాటిశాఖల్లో వాటాలు కొనడానికి ఇండియా పెట్టుబడిదారులు ఒక శతకోటి రూపాయలు ఖర్చుబెట్టారు.

కొద్ది సంవత్సరాలక్రితంవరకూ భారత జాతీయోద్యమాన్ని అతి క్రూరంగా అణచివేసిన ఆ బ్రిటిష్ పెట్టుబడిదారులతోనే నేడు ఇండియా పెట్టుబడిదారులు పొత్తు కలుస్తున్నారు. ఈస్టిండియా కంపెనీకి వారసులైన మొత్తం నాలుగు పెద్ద బ్రిటిష్ కంపెనీల్లో మూడు కంపెనీలయొక్క – గిలాండర్సు, అర్బుత్నాట్ అండ్‌కో, బర్డ్ అండ్‌కో, మార్టిన్ అండ్ బర్న్స్ అండ్‌కోలయొక్క – ప్రత్యక్ష యాజమాన్యంక్రింద భారతదేశంలో ఇదివరకే 200 కంపెనీలు ఉన్నాయి.

ఈ కంపెనీలు తమలో భాగస్వాములైన ఇండియా పెట్టుబడిదార్లకుకూడా కొన్ని వాటాలిచ్చాయి. కాని ఎక్కువ వాటాలు మాత్రం తమ చేతుల్లోనే అట్టిపెట్టుకున్నాయి. ఇదేవిధంగా బ్రిటన్‌లో వున్న గుత్తపెట్టుబడిదారులతో ఇండియా పెట్టుబడిదారులు సన్నిహిత సంబంధాలేర్పరచుకుంటున్నారు. అంటే బ్రిటిష్ పెట్టుబడిదారులకు ఇండియా పెట్టుబడిదారులు ఏజెంట్లుగా తయారవుతున్నారన్నమాట. ఇండియాలో మోటారు పరిశ్రమ నిర్మాణానికి 'బ్రిటిష్ ఫోర్డ్' అయిన లార్డ్

నఫ్ఫీల్డ్ కంపెనీలో ఇండియా పెట్టుబడిదారైన బిర్లా చేరాడు. బ్రిటిష్ పెట్టుబడిదారులందరికంటె లార్డ్ నఫ్ఫీల్డ్ పెద్ద పెట్టుబడిదారు. కరుడుగట్టిన సామ్రాజ్యవాద భావాలకు ఇతను పట్టుగొమ్మ. ఇతనితోనే ఇప్పుడు బిర్లా చేతులు కలిపాడు. ఈ బిర్లా-నఫ్ఫీల్డ్-ట్రస్టు ఇండియాలో మోటారు పరిశ్రమను స్థాపించదు. మోటార్లకు కావలసిన భాగాలన్నీ ఇంగ్లాండులోనే తయారై ఇండియాకు దిగుమతి అవుతాయి. అలా దిగుమతి అయిన భాగాలను ఇండియాలో అతికి వాటిని 'స్వదేశీ' కార్లుగా చలామణీచేస్తారు. ఈ పరిశ్రమలో వచ్చేలాభాల్లో అత్యధిక భాగం బ్రిటిష్ భాగస్వాములకే చెందుతుంది. భారత ప్రభుత్వ సహాయంతో భారత ప్రజలను దోచుకోడానికి మధ్య ఒక దళారీగామాత్రం బిర్లా పనిచేస్తాడు.

ఇదేవిధంగా బ్రిటిష్ గుత్తపెట్టుబడి పరిశ్రమల్లో ముఖ్యమైన ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్‌తో టాటాముఠా దగ్గిరసంబంధాలు పెట్టుకుంటూ ఉంది.

జాతీయ కాంగ్రెసు యొక్క తెరచాటున పనిజేసే ఇండియా గుత్తపెట్టుబడి ప్రధానంగా ఆంగ్లో-ఇండియన్ పెట్టుబడే. బ్రిటిష్ పెట్టుబడిదారులకంటె కూడా అంతర్జాతీయ రంగంలో ఇంకా ఎక్కువబలంగా ఉన్న అమెరికా గుత్తపెట్టుబడిదారులతో సంబంధాలు పెట్టుకోడానికి ఇండియా పెట్టుబడిదారులు తహతహలాడుతున్నారు. అమెరికా పెట్టుబడి ఇండియాను ఇప్పుడిప్పుడే ముట్టడిస్తూ ఉంది. అమెరికా గుత్తపెట్టుబడిదారులు ఆసియా ఖండానికి కూడా ఇదివరకే ఒక మార్షల్ ప్లానును ప్రకటించారు. జపాన్ చైనా దేశాల్లాగే ఇండియాను కూడా తమ పలుకుబడి క్రిందకు రాబట్టుకోడానికి అమెరికా గుత్తపెట్టుబడిదారులు ప్రయత్నిస్తున్నారని ఆ ప్లానుద్వారా స్పష్టంగాబోధపడుతుంది. ఇండియా పెట్టుబడిదారులకు పెద్ద పెద్ద ఆశలు చూపించి ఇండియాలో విరివిగా తమపెట్టుబడిని పెట్టడానికి అమెరికా గుత్తపెట్టుబడిదారుల ప్రతినిధులు ఇండియా అంతటా సంచారం చేస్తున్నారు.

అమెరికా పెట్టుబడిదారులతో అనేకమంది భారతపెట్టుబడిదారులు ఇదివరకే ఒడంబడికలు చేసుకున్నారు. న్యూయార్కులోని నేషనల్ సిటీబ్యాంకుతో బిర్లా బ్యాంకుకు ప్రత్యక్షసంబంధాలున్నాయి. 'టాటా' గారి కొత్తవిమాన పరిశ్రమకు ఈ న్యూయార్కు బ్యాంకు ఆర్థిక ఏజెంటుగా పనిచేస్తూ ఉంది. 'అమెరికా సహాయానికి' బిర్లా, దాల్మియా వగైరా పెట్టుబడిదారుల పత్రికలన్నీ బ్రహ్మాండంగా స్వాగతం ఇస్తున్నాయి. ఇండియా ఆర్థికవిధానాన్ని పునర్నిర్మించడం కోసం నూటికి 42 వంతులకు తగ్గకుండా విదేశ పెట్టుబడిని, ముఖ్యంగా అమెరికా పెట్టుబడిని ఆహ్వానించాలని బిర్లా ప్రతిపాదిస్తున్నాడు. ఈ పునర్నిర్మాణ కార్యక్రమానికి 500 కోట్ల రూపాయలు కావాలని బిర్లాసూచిస్తున్నాడు.

ఇండియా పెట్టుబడిదారులకూ, అమెరికా పెట్టుబడిదారులకూ మధ్య ఒడంబడికలన్నీ దాదాపు పూర్తి అయినట్లే. భారతదేశంలోని అపరిమిత సహజసంపదా, చౌకకూలీ, బ్రహ్మాండమైన పెద్దమార్కెట్టూ, భారతదేశం అమెరికా యుద్ధతంత్రరీత్యా కీలకస్థానంలో ఉండడం - ఇవన్నీ ఇండియాపై అమెరికా దృష్టిని విపరీతంగా ఆకర్షించాయి. భారతదేశ రాజకీయాల్లో, వర్తక వ్యాపారాల్లో అమెరికా ఒత్తిడి రోజు రోజుకూ ఎక్కువ అవుతూ ఉంది. అమెరికానుంచి అరువుగా డాలర్లూ, వస్తుసామగ్రీ విరివిగా ఇండియాకు దిగుమతి కావడంవల్ల తమ వ్యాపారాన్ని ఇంకా విస్తరింప చేసుకోవచ్చుననీ, తమ అధికారాన్ని

ఇంకా విపరీతంగా బలపరచుకోవచ్చుననీ, ఇండియా పెట్టుబడిదారులు ఆశిస్తున్నారు. ఇంతేకాదు ఇండియా పెట్టుబడిదారులకు ఇంకా చాలా గొంతెమ్మకోరికలున్నాయి. పటేల్ నెహ్రూల అండతో వారి చూపు ఇంకా పైకిపోతూ ఉంది. ఆసియా ఖండాన్ని, ముఖ్యంగా ఇండియాకు దగ్గరగా ఉన్న ఇండొనీషియా మలయా, వీత్నాం, బర్మా, సయాం, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, మధ్యప్రాచ్యంలో వున్న అరబ్‌దేశాలూ. ఈజిప్టుతోసహా ఈ దేశాలన్నిటినీ దోపిడి చేయడంలో బ్రిటిష్ పెట్టుబడిదారులకు - అంతకంటె ముఖ్యంగా అమెరికా పెట్టుబడిదారులకు తాము ప్రధాన ఏజెంట్లుగా ఉండాలని కలలు గంటున్నారు.

నెహ్రూ ప్రభుత్వంలో ఉన్న కలకత్తా బొంబాయి పెట్టుబడిదారుల ప్రతినిధులు ఈపంథానే భారతవాణిజ్య విధానానికి ప్రాతిపదికగా చేయాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం జపాన్ ఖాళీచేసిన ప్రదేశాలను భారత పెట్టుబడిదారులు తమ పలుకుబడిక్రిందకు తెచ్చుకోవాలనీ, ఆగ్నేయ ఆసియానూ, మధ్య ఆసియానూ, మధ్యప్రాచ్యదేశాలనూ ఈజిప్టునుకూడా ఇండియా పెట్టుబడిదారులు తమ పెట్టుబడితో ముట్టించి వేయాలని నెహ్రూ ప్రభుత్వములో వాణిజ్యశాఖామంత్రిగా ఉన్న సి. హెచ్. భాభా 1947 నవంబరు 9వ తేదీన ఢిల్లీలో ఉపన్యసించాడు.

ఇండియాను జపానుకువారసురాలుగాతయారు చేయాలనీ, జపాన్ స్థానాన్ని ఇండియా ఆక్రమించాలనీ, భారత పెట్టుబడిదారుల ప్రయత్నిస్తున్నారు. నెహ్రూ ప్రభుత్వం అవలంభించే విదేశాంగ విధానంలో కూడా ఇదే ధోరణి గోచరిస్తూంది 'నెహ్రూప్లాను' లో ఉన్న అంతరార్థం కూడా ఇదే. ఇండియా, పాకిస్థాన్, బర్మా, మలయా, ఇండొనీషియా, సయాం, వగైరా దేశాలన్నిటిని కలిపి ఆర్థికంగా, రాజకీయంగా, సైనికంగా నెహ్రూ అధ్యక్షాన ఒక కూటమిగా తయారు చేయడంకోసం ప్రయత్నాలు జరుగుతున్నాయి

అమెరికా తరఫున ఇండియాలో రాయబారిగావున్న హెన్రీగ్రేడీ 'నెహ్రూప్లాను'ను అధికారపూర్వకంగా అంగీకరిస్తూ 1948 మే 23వ తేదీన హఠాత్తుగా ఒక ప్రకటన చేశాడు.

ఆసియాకు వర్తించే మార్షల్ ప్లానుతో నెహ్రూప్లాన్ పూర్తిగా ఏకీభవిస్తుందని ఆ ప్రకటనలో తెలియచేశాడు. ఆసియాకూ, దూరప్రాచ్యానికీ యునైటెడ్ నేషన్సు యొక్క ఆర్థిక కమిటీకి అధ్యక్షుని ఎన్నికోవడంలో గ్రేడీ ప్రకటన ఫలితాలు వెంటనే కనిపించాయి. బొంబాయిలోని తాతా కంపెనీకి డైరెక్టరూ, నెహ్రూమంత్రివర్గంలో రవాణాశాఖామంత్రిగావున్న డాక్టరు జాన్‌మత్తాయి ఆకమిటీకి అధ్యక్షుడుగానూ, బిర్లా కంపెనీలో ఉద్యోగిగా పనిజేసిన పి. యస్. లోకనాధన్ ప్రధాన కార్యదర్శిగానూ ఎన్నుకోబడ్డారు. ఆసియాఖండంలోని వేర్వేరు దేశాలకు సంబంధించిన 'ఆర్థిక ప్రణాళిక'ను తయారు చేసేందుకు యునైటెడ్ నేషన్స్ యొక్క ఆర్థిక కమిటీకి సంబంధించిన ఒక ఏజెన్సీని ఏర్పరచాలని జాన్‌మత్తాయి తన మొట్టమొదటి ప్రకటనలోనే తెలియపరచాడు. 'అంతటి సహాయాన్ని అందజేయగల ఏజెన్సీల' సల

హాలతో ఏ దేశానికెటువంటి ఆర్థికసహాయం చేయవలసి ఉంటుందో యునైటెడ్ నేషన్సు ఆర్థికకమిటీయే నిర్ణయిస్తుంది. ఏజెన్సీలంటే ఏమిటో వివరిస్తూ బిర్లాకంపెనీ ప్రతినిధీ, పైకమిటీ ప్రధాన కార్యదర్శీ అయిన లోకనాథన్ ఇలా చెప్పాడు.

"విదేశాలనుంచి వెంటనే సహాయము లభించడంద్వారానే ఆసియా దేశాలు అభివృద్ధి చెందుతాయనడం నిర్వివాదాంశం. ప్రస్తుత పరిస్థితుల్లో విదేశీ సహాయం అంటే ముఖ్యంగా అమెరికా సహాయం అని మాత్రమే నా అభిప్రాయం."

ఆసియాలో మరొక మార్షల్ ప్లానును అమలు జరుపబోతూ ఉన్న నెహ్రూ ప్రభుత్వంతో భారత గుత్త పెట్టుబడిదారుల ముఠా ఈ విధంగా మిళితమైపోయింది. పై ప్రణాళికనమలు జరిపడంలో ప్రధానస్థానం తమకు లభించాలనే ఉద్దేశంతో బిర్లాలూ, టాటాలూ వాళ్ల రాజకీయ మిత్రులూ అమెరికా సామ్రాజ్యవాదానికి ఆసియా ప్రజలను బానిసలుగా తయారుచేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు.

కాని అమెరికామాత్రం ఇండియాకు ఆసియా నాయకత్వం కట్టిపెట్టడానికి ఇంతవరకట్టి ఆసక్తిచూపడంలేదు. జపాన్ పెట్టుబడినీ, జపాన్ మిలిటరిజాన్నీ అమెరికా పునరుద్ధరిస్తూ ఉంది. అయినప్పటికి ఇండియా పెట్టుబడిదారులకు కూడా అమెరికా ఆశాభంగాన్ని కలిగించడంలేదు. అమెరికా చాకచక్యంగా ఇండియాకు జపాన్‌ను ఒక పోటీగా తయారుచేస్తూ ఉంది. అందువల్ల అమెరికా మెహర్బానీ సంపాదించడంకోసం ఇండియా దళారీ పెట్టుబడిదారులు (కాంప్రడోర్సు) అమెరికాను ఇంకా నమ్మిన బంటులుగా ప్రవర్తిస్తున్నారు. ఇండియాను కొల్లగొట్టే దేశాలను దోచుకోడంకోసం కొన్ని ప్రత్యేక కంపెనీలను స్థాపించాలని కలకత్తా బొంబాయి వర్తక కేంద్రాల్లో ఆలోచనలు జరుగుతున్నాయి. ఇండోనీషియాను "పారిశ్రామికం" చేయడానికి బటేవియాలో 20 కోట్ల రూపాయల మూలధనంతో ఒక సిండికేటు ఏర్పడింది. ఇండియా పెట్టుబడిదారులకు ఈ సిండికేటులో నూటికి 49 వంతుల వాటాలున్నాయి. 'ట్రూమాన్ప్లాన్' పేరుతో అమెరికా గుత్త పెట్టుబడి దారులను ఆసియాదేశాలను కొల్ల పెట్టడం, అందులో ఇండియా దళారీ పెట్టుబడిదారులకు కూడా కొన్ని వాటాలు ముట్టేటట్టు చూడడం డాక్టరు మత్తాయి లక్ష్యం.

*        *        *        *

ఇండియాలోని కొత్త 'జాతీయ' పెట్టుబడిదారులూ, వారిని బలపరిచే ఇండియా నాయకులూ అవలంబిస్తోన్న విధానం ఇదే. ఈ విధానం మళ్ళీ భారతదేశాన్ని విదేశీ పెట్టుబడిదారులకు బానిసగా తయారు చేస్తుంది. పెట్టుబడిదారులూ వాళ్ళ చెప్పుచేతల్లో మెలగే కాంగ్రెస్ నాయకులూ జాతీయ విముక్తి ఉద్యమాన్నీ, దాని ఆశయాలనూ సమూలంగా నాశనం చేయాలని ప్రయత్నిస్తున్నారు. ఇండియాలో కలోనియల్–ఫ్యూడల్ – కేపిటలిస్టు పరిపాలనను సుస్థిరంగా నెలకొల్పాలని వాళ్ళు కృషి చేస్తున్నారు. భారత జాతీయ

ఆర్థిక విధానాన్ని భారత పెట్టుబడిదారీ బంధనాలతోనూ, విదేశీ గుత్త పెట్టుబడిదారీ బంధనాలతోనూ బంధించివేయాలని చూస్తున్నారు. భారత ఉత్పత్తిశక్తుల స్వేచ్ఛాభివృద్ధికి వాళ్ళు ప్రతిబంధకంగా ఉన్నారు సంస్థానాధిపతులతోనూ, జమీందారులతోనూ, భూస్వాములతోనూ చేతులు కలిపిన ఇండియా పెట్టుబడిదారీవర్గం భారత రైతాంగాన్ని చిరకాల బానిసబంధనాలతో బంధించివేయ చూస్తూ ఉంది.

సామ్రాజ్యవాద ఆశయాలతో కల్పించిన 'నెహ్రూ ప్లాను' సూత్రాలు భారతదేశ భవిష్యత్తును యుద్ధోన్మాదుల విధానంతో ముడివేస్తున్నాయి. భారత ప్రజలను స్వాతంత్ర్య కాముక ప్రజలైన వారి సహజ మిత్రులనుంచి దూరం చేస్తున్నాయి. ఆసియాఖండంలో మళ్లీ పరస్పర జాతిద్వేషాలకు బీజాలు నాటుతున్నాయి.

దేశంలో దినదినాభివృద్ధి చెందుతూన్న అభ్యుదయశక్తులను చూచి సహించలేక జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించిన కార్మికవర్గాన్నీ, కార్మిక సంఘాలనూ దారుణ నిర్బంధ విధానంతో అణచివేయ ప్రయత్నిస్తున్నాయి సమ్మెలన్నిటినీ పూర్తిగా నిషేధించి వేయాలనీ, అమెరికా ప్రభుత్వపద్ధతి ననుసరించి ఇండియా ప్రభుత్వం కార్మిక వ్యతిరేకచట్టాలను ప్రవేశపెట్టాలనీ బిర్లా పత్రికలు తీవ్రముగా ప్రచారం చేస్తున్నాయి.

కాని కాంగ్రెసు పెట్టుబడిదారీ వర్గం అవలంబించే ఈ అభివృద్ధినిరోధక వర్గాన్ని భారత ప్రజాసామాన్యం అతి తీవ్రంగా ప్రతిఘటిస్తుంది. నిజమైన జాతీయ స్వాతంత్ర్యంకోసం భారత ప్రజలు సాగిస్తున్న పోరాటం వారి జీవితావసరాలకోసం పెట్టుబడిదారీ దోపిడీవర్గానికి వ్యతిరేకంగా సాగించే పోరాటంతో రోజురోజుకూ పెనవేసుకుపోతూ ఉంది.

— 'న్యూటైమ్స్' (4-8-48)
డైకోవ్ వ్రాసిన వ్యాసం

"ఆర్థికరంగంలో అధికారాన్ని చలాయించే వర్గంచేతుల్లోనే ప్రభుత్వాధికారం కూడా ఉంటుంది, ఆర్థికరంగంలో తనకున్న బలాన్ని పురస్కరించుకొని రాజకీయ రంగంలోకూడా ఆవర్గం తన అధికారాన్ని నెలకొల్పుకుంటుంది. ఆ విధంగా ఆవర్గం పీడిత ప్రజాసామాన్యాన్ని అణచివేయడానికీ, దోపిడీచేయడానికీ అవసరమైన నూతన సాధనాలను చేజిక్కించుకుంటుంది."

— ఎంగిల్స్

## సోవియట్ స్వాధీనంలో ఉన్న జర్మనీ ప్రాంతంలో

# వ్యవసాయ సంస్కరణ

—జి. ఖరఖష్యాన్

సోవియట్ స్వాధీనంలో ఉన్న జర్మనీ ప్రాంతంలో ఈ మూడు సంవత్సరాల నుంచి ప్రజాతంత్ర సంస్కరణలు కొనసాగించబడుతున్నాయి. పోట్స్‌డాం, యాల్టా ఒడంబడికల్లోని ప్రధాన సూత్రాల కనుగుణంగా సాగించబడే ఈ వ్యవసాయ సంస్కరణల ఫలితంగా సోవియట్ ఆక్రమిత జర్మనీ భూభాగంలో ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా గొప్పమార్పులు జరిగాయి.

సోవియట్ ప్రభుత్వం ప్రప్రథమంగా జర్మనీలో ప్రారంభించిన సంస్కరణ భూమి సంస్కరణే. హిట్లర్ ఓడిపోయిన వెంటనే నాలుగైదు మాసాల్లోనే ఈ సంస్కరణ ప్రారంభమయింది.

మొత్తం జర్మనీ దేశంలో మూడోవంతు భూభాగంలో ఈ భూమి సంస్కరణ జరుగుతూవుంది. ఈ భూమి సంస్కరణ జర్మనీ చరిత్రలో ఒక అత్యంత ప్రధానఘట్టం. 1818 విప్లవమూ, 1918 నవంబరు విప్లవమూ పరిష్కరించలేని సమస్యను ఈ భూమి సంస్కరణ పరిష్కరించ గలిగింది. తూర్పు జర్మనీలో 'జంకర్' భూస్వాముల ఆర్థికాధికారాన్ని తుడిచిపెట్టి వేసింది. ఫ్యూడల్ సంబంధావశేషాలను మట్టుబెట్టింది. వ్యవసాయంలో ప్రష్యన్ పద్ధతిపై కొనసాగించే పెట్టుబడిదారీ అభివృద్ధిని శాశ్వతంగా అంతరింప జేసింది. అభ్యుదయకరమైన ప్రజాస్వామిక వ్యవసాయ సంబంధాలు అభివృద్ధి చెందడానికి బలమైన పునాదులు వేసింది.

ఎల్బనదీ తీరానికి తూర్పుగా ఉన్న జర్మనీ పల్లెప్రాంతంలో రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ఈ వ్యవసాయ సంస్కరణలవల్ల వచ్చిన మార్పు లేమిటి? వ్యవసాయ సంస్కరణల ఫలితంగా సోవియట్ జోన్‌లో వ్యవసాయోత్పత్తిలోనూ, ఆహార సరఫరాలోనూ ఎట్టిమార్పులు కలిగాయి? ఈ క్రింద నుదహరించిన వివరాలే పై ప్రశ్నలకు సరియైన సమాధానా లిస్తాయి.

* * *

వంద హెక్టార్లు (హెక్టారు అనగా దాదాపు రెండున్నర ఎకరాలు) గానీ, అంతకంటె ఎక్కువ గానీ ఉన్న జంకర్ భూస్వాముల భూములనూ యుద్ధాపరాధులకూ నాజీనాయకులకూ చెందిన చిన్న, పెద్ద భూఖండా లన్నింటినీ, హిట్లర్ స్టేటుకు సంబంధించిన భూములనూ, 'వెహర్మష్' వగైరా నాజీ సంఘాల స్వాధీనంలో ఉన్న భూములనూ, ఎట్టి నష్టపరిహారం

చెల్లించకుండా ప్రభుత్వం స్వాధీనపరచుకుంది. ప్రధానమైన భూమి సంస్కరణలు పూర్తి అయిన 1947 జూలై 1వ తేదీ నాటికి ఈవిధంగా స్వాధీనపరచుకున్న భూములు మొత్తం 3041000 హెక్టార్లు.

ఈభూమి ఏవిధంగా రైతులకు పంచిపెట్ట బడిందో చూడండి.

భూమిబొత్తిగాలేని 119650 రైతు, వ్యవసాయకూలీ కుటుంబాలకు సగటున ఒక్కొక కుటుంబానికి 6.8 హెక్టార్లు వచ్చింది.

కొత్తగా నివాసమేర్పరుచుకున్న 83,802 కుటుంబాలకు ఒక్కొక్క కుటుంబానికి 8.4 హెక్టార్ల భూమి ఇవ్వబడిండి.

113 324 పేదరైతు కుటుంబాలకు ఒక్కొక కుటుంబానికి సగటున 2 7 హెక్టార్లు వచ్చింది.

వ్యవసాయంతో సంబంధం లేని (నాన్ ఫార్మింగ్) 130 881 కుటుంబాలకూ 49138 చిన్న కౌలుదార్ల కుటుంబాలకూ 0.5 నుంచి 1.1 హెక్టార్లవరకూ వచ్చింది.

వ్యవసాయ సంస్కరణ ఫలితంగా మొత్తం 496795 కుటుంబాల స్థితి బాగుపడింది.

కష్టజీవులైన రైతులకు భూమితోపాటు భూస్వాములనుంచి స్వాధీనపరచుకోబడిన ఇతర ఆస్తికూడా ఇవ్వబడింది. ఈవిధంగా ఇచ్చిన ఆస్తిలో 4 లక్షల 40 వేల ఇండ్లూ, 47 వేల 600 గుర్రాలూ, ఒకలక్ష 34 వేల 400 ఆవులూ, 6004 ట్రాక్టర్లూ, 2 లక్షల 70 వేల వ్యవసాయ యంత్రాలూ పరికరాలూ ఉన్నాయి. వ్యవసాయాని కవసరమైన పని ముట్లను కొనుక్కోనేందుకుగాను దీర్ఘకాల వ్యవధిపై తీర్చేకొనేటట్లు రైతులకు అప్పు లివ్వబడ్డాయి. ఈ విధంగా అప్పులరూపంలో ఇచ్చిన డబ్బు మొత్తం 31 కోట్ల 67 లక్షల 'మార్కు' (జర్మనీ నాణెం) ఉంటుంది.

భూమి సంస్కరణల ఫలితంగా సోవియట్ జోన్‌లో వ్యవసాయార్థిక స్వరూపమే పూర్తిగా మారిపోయింది.

ఈ మార్పునుగురించి స్పష్టమైన ఒక అభిప్రాయం ఏర్పడాలంటే సంస్కరణలు ప్రారంభించిన తర్వాత సంవత్సరమైన 1947 యొక్క లెక్కలను 1939 సంవత్సరపు లెక్కలతో పోల్చిచూడవలసిఉంటుంది. 1939 లో 5 నుంచి 10 హెక్టార్ల భూమిగల సాధారణ రైతుకుటుంబాలు నూటికి 15.4 వంతు ఉండేవి. కాని ఈ కుటుంబాలు సాగుజేసే భూమి నూటికి 6.8 వంతులు మాత్రమే ఉండేది. కాని వ్యవసాయ సంస్కరణలు అమలు జరిపిన తర్వాత ఈ కుటుంబాలు నూటికి 44.6 వరకూ అభివృద్ధి అయ్యాయి. వీరు సాగుజేసేభూమికూడా నూటికి 37.8 వంతుల వరకు పెరిగింది. 10 నుంచి 20 హెక్టార్లుగల ధనిక రైతుకుటుంబాలూ, 20 నుంచి 100 ఎకరాలవరకూగల కులక్ పెట్టుబడిదారీ కుటుంబాలూ బాగాతగ్గిపొయ్యాయి. వందహెక్టార్లుగానీ లేక అంతకుమించిగానీ భూమి గలిగిన పెద్దపెద్ద భూస్వామి కుటుంబాలు 1939 లో సగానికి సగంభూమిని ఆక్రమించుకొనిఉండేవి. కాని నేడు సోవియట్ స్వాధీనంలో ఉన్న జర్మనీ ప్రాంతంలో భూస్వాములంటూ లేనేలేరు.

సోవియట్ జోన్‌లో నేడు వ్యవసాయార్థిక విధానానికి పునాది కష్టజీవులైన రైతాంగమే; కాని జంకరుభూస్వాములూ, పెట్టుబడిదారీ రైతులూకాదు. ఆర్థికవిధానంలో వచ్చిన ఈ మార్పులఫలితంగా సాంఘిక విధానంలోకూడా చాలా గొప్ప మార్పులు వచ్చాయి. వ్యవసాయ సంస్కరణ ఫ్యూడల్ సంబంధావశేషాలను తుడిచిపెట్టింది. పెట్టుబడిదారీ దోపిడికి అవకాశాలు లేకుండా చేసింది. ఇప్పుడు సోవియట్ జోన్‌గా ఉన్న జర్మనీ ప్రాంతంలో

1939 జనాభా లెక్కల ప్రకారం వ్యవసాయం లోనూ, అటవీకృషి (ఫారెస్ట్రీ) లోనూ పనిచేసే 14 సంవత్సరాల వయస్సుగల పిల్లలూ, వృద్ధులూ మొత్తం 786,2[illegible]0 మంది ఉండే వారు. ఈ సంఖ్యలో మూడోవంతు మంది జంకరు భూస్వాముల క్రింద పనిచేస్తూండే వారు. జంకరు భూస్వాముల పెద్ద పెద్ద భూఖండాలను స్వాధీనం చేసుకోడంవల్ల 260,000 మంది వ్యవసాయ కూలీలు దుర్భర దారిద్ర్యంనుంచీ, దోపిడీనుంచీ విముక్తి చెందారు. వీరేగాక నాజీ ఉద్యోగుల భూముల్లో చాకిరిచేసే ఇంకా అనేకమంది కష్టజీవులకుకూడా విముక్తి లభించింది. నాజీ ఉద్యోగుల భూములనూ, యుద్ధాపరాధుల భూములనూ ప్రభుత్వమే స్వాధీనంచేసుకొని వ్యవసాయకూలీలకూ, బీదరైతులకూ పంచి వేసింది. రైతుల పరస్పర సహాయక కమిటీల ద్వారా మధ్యతరగతి రైతులు నేడు తమ పని గడుపుకుంటున్నారు. మధ్యతరగతి రైతులు తమ భూముల్లో కూలీలను పెట్టి పనిచేయించు కోడం ఇప్పుడు చాలావరకు తగ్గిపోయింది.

వీటన్నిటి ఫలితంగా సోవియట్ జోన్‌లో గ్రామీణ జీవితం ఎలా మారిపోయిందో ఈ క్రింది ఉదాహరణలు తెలియజేస్తాయి.

క్లోయెట్జ్ అనే ఎస్టేటుయొక్క సరిహద్దుల్లో ఉన్న ఒక శివారు గ్రామంలో వ్యవసాయ సంస్కరణలకు పూర్వం స్వతంత్రంగా బ్రతికే రైతుకుటుంబాలు 6 మాత్రమే వుండేవి. ఆ గ్రామానికి ఆజుబాజుల్లో ఉన్న భూమిఅంతా షుమారు [illegible]00 హెక్టార్లు ఒకే భూస్వామి స్వాధీనంలో ఉండేది. ఆ గ్రామములో పండిన ధాన్యం అంతా అతని గాదెల్లోకే పోయేది. క్లోయెట్జ్‌కు చెందిన వ్యవసాయ యంత్రాలన్నీ అతని చేతుల్లోనే వుండేవి. ఆ భూస్వామి పొలాల్లో పనిచేసే 10 కుటుంబాలు వుంటానికి వేరేవేరే ఇండ్లు లేక ఒకచోట [illegible] జాగాల్లో [illegible] ఎటూ నానావస్థపడుతూవుంటే భూస్వామి మాత్రం 14 గదులు గల ఒక విశాలభవనాన్ని ఆక్రమించుకొని నివసించేవాడు. నేడు ఆ శివారు గ్రామంలోనే స్వతంత్రంగా జీవించే కుటుంబాలు 22 వున్నాయి.

తురింజియా ప్రాంతంలో గ్రాస్ ఫుర్రా అనే గ్రామంలో వాన్ వుర్మ్ అనే భూస్వామి స్వాధీనంలో 500 హెక్టార్ల సాగుభూమీ, 9[illegible]5 హెక్టార్ల అడవిభూమీవుండేది. చారెడు చారెడు భూమితో ఆ గ్రామంలో వున్న వందలకొలది రైతులు ఏదో ఒక విధంగా పొట్ట గడుపుకుంటూ వుండేవారు. వ్యవసాయ సంస్కరణల ఫలితంగా ఈ గ్రామంలో 190 కుటుంబాలకు భూములు లభించాయి. ఈ కుటుంబాల్లో వ్యవసాయకూలీలూ, కొత్తగా నివాస మేర్పరచుకున్నవారి కుటుంబాలూ మొత్తం 36 వుంటాయి. ఈ 36 కుటుంబాలకు వ్యవసాయ సంస్కరణల ఫలితంగా [illegible]0 హెక్టార్ల సాగుభూమీ, 103 హెక్టార్ల [illegible] భూమి లభించింది. ఇదివరకే కొద్దిగా భూము లున్న రైతులకు 1.4 నుంచి 2 హెక్టార్లవరకూ ఇంకా అదనంగా భూమి ఇవ్వబడింది. ఆ గ్రామముయొక్క పరిసరాల్లో వున్న పొటాసియం గనుల్లో పనిచేసే కార్మికులకు కొద్ది కొద్దిగా తోటభూము లివ్వబడ్డాయి.

జర్మనీదేశంలో జర్మన్ ప్రజలందరికి సరిపడ జీవనాధారం లేదనీ జర్మన్ ప్రజలూ కార్మికులూ జీవించాలంటే ఇతర దేశాల భూముల నాక్రమించుకొనక తప్పదనీ, అందుకోసం యుద్ధం చేయవలసి వుంటుందనీ ఒక ఫాసిస్టులూ జంకరు భూస్వాములూ చేసిన ప్రచారమంతా కట్టి బూటకం అని వ్యవసాయ సంస్కరణలు రుజువుచేశాయి. జర్మనీప్రాంతాలలో బాగా వెనకబడివున్న ప్రజలుకూడా ఫాసిస్టులు చెప్పిన మాటలు ఎంత బూటకమో

నేను స్వానుభవంద్వారా స్పష్టంగా తెలుసుకో గలుగుతున్నారు. దురాక్రమణ యుద్ధాలవల్ల జర్మన్ రైతుకేట్టి లాభం చేకూరదనీ, తాము సుఖప్రదంగా జీవించడానికి జర్మనీలోనే తగినన్ని అవకాశాలున్నాయనీ, యూరోపులోని ఇతర ప్రాంతాలనుంచి వచ్చి జర్మనీలో క్రొత్తగా నివాసమేర్పరుచుకొనే జర్మనులకుకూడా తగినంత భూమి జర్మనీలోనే వుందనీ నేడు జర్మనీ రైతులు స్పష్టముగా గ్రహించగలుగుతున్నారు.

* * *

వ్యవసాయ సంస్కరణలంటే కేవలం పెద్ద పెద్ద భూస్వాముల స్వాధీనంలో వున్న భూఖండాలను చిన్నచిన్న రైతులకూ, వ్యవసాయకూలీలకూ పంచి ఇవ్వడమే కాదు. రైతులకు భూమి పంచిఇవ్వడంతోనే వ్యవసాయ సంస్కరణల కార్యక్రమం పూర్తికాదు. ఈ భూమి సంస్కరణ కష్టజీవులైన రైతాంగం మధ్య పరస్పర ఆర్థిక సహకారానికి అవసరమైన పునాదులనుకూడా ఏర్పరచింది. అనగా ఒక క్రొత్తరకమైన ఉత్పత్తిదారుల సహకార సంఘాలనూ, రైతుల పరస్పర సహాయ కమిటీలనూ, నెలకొల్పింది. అయిదులక్షల సభ్యత్వంతో ఈ సహకారసంఘాలు ఒక పెద్ద ప్రజాపుద్యమంగా అభివృద్ధి చెందాయి. ఈ పరస్పర సహాయక కమిటీలకు తగినంత వస్తు సామాగ్రి, టెక్నికల్ అవకాశాలూ వున్నాయి. ఈ అవకాశాలద్వారా తోటి రైతాంగానికి తోడ్పడుతూ ఉంటారు. ఆయా రైతులకు కావలసిన సహాయం అందజేస్తూ ఉంటారు. దీనితోపాటు రైతులకు కావలసిన యంత్ర పరికరాలూ, కృత్రిమ ఎరువులూ, నీటి సౌకర్యాలూ, వగైరాలన్నీ లక్షలకొలది రైతులకు పూర్తిగా ఎప్పటికప్పుడు అందుబాటులో ఉంటాయి. ఇలాంటి సౌకర్యాలు ఇదివరకు ఒక్క భూస్వాములకు మాత్రమే అందు బాటులో వుండేవి.

ఈ పరస్పర సహాయక కమిటీలే రైతాంగానికి శిక్షణకేంద్రాలుగా కూడా చక్కగా వుపయోగపడుతున్నాయి. వ్యవసాయంలో నూతనసంబంధాలను ఏవిధంగా నిర్మించాలో వీటిద్వారా రైతులు ప్రత్యక్షంగా నేర్చుకుంటున్నారు. వీటిఫలితంగా రైతుల పరిస్థితి నేడు చాలా అభివృద్ధి చెందింది.

1947 మార్చి 31 వ తేదీన విదేశీమంత్రుల కౌన్సిల్లో ఉపన్యసిస్తూ కామ్రేడ్ మాలటావ్ జర్మనీ దేశమంతటా వ్యవసాయ సంస్కరణను ప్రవేశపెట్టాలనీ, జంకరు భూస్వాముల భూఖండాలన్నిటినీ రైతులకు ఇచ్చివేయడం వల్ల వ్యవసాయం బాగా అభివృద్ధి చెందడానికి అవకాశం కలుగుతుందనీ చెప్పాడు. జర్మన్ రైతులు సహజంగా చాలా కష్టపడి పనిచేస్తూ ఉంటారనీ, జంకరు భూస్వాముల భూములను రైతుల స్వాధీనంచేస్తే వారు జర్మనీ వ్యవసాయోత్పత్తినీ ఆహారోత్పత్తినీ ఎక్కువచేస్తారని కూడా కామ్రేడ్ మాలటావ్ ఆ కౌన్సిల్లో స్పష్టంగా ఉద్ఘాటించాడు.

సోవియట్ స్వాధీనంలో వున్న జర్మనీ ప్రాంతంలో అమలుపరచిన వ్యవసాయ సంస్కరణానుభవమే కామ్రేడ్ మాలటావ్ చెప్పిన మాటలు యథార్థములని రుజావుచేసింది. వ్యవసాయ పద్ధతులను ఇతోధికంగా అభివృద్ధి చేయడానికి రైతుల్లో ఒక నూతనోత్సాహాన్ని కలిగించింది. సోవియట్ ప్రభుత్వమూ, జర్మన్ ప్రజాస్వామిక సంఘాలూ, ముఖ్యంగా రైతాంగ పరస్పర సహాయక కమిటీలూ, వ్యవసాయోత్పత్తిని ఒక ప్లానుప్రకారం కొనసాగించేందుకు ఏర్పడిన నూతనావకాశాలూ - ఇవన్నీ పంటభూమి విస్తీర్ణాన్ని పెంచడానికీ, సాగుజేసే పద్ధతుల్లో నూతనాభివృద్ధి సాధించడానికి బాగా తోడ్పడ్డాయి.

హిట్లరు పరిపాలనలో రైతుల పరిస్థితి పూర్తిగా అధ్వాన్నమైపోయింది. ఆనాడు చితికిపోయిన కుటుంబాలన్నింటినీ మళ్ళీ నిలబెట్టడానికి, వాటి పరిస్థితిని బాగుచేయడానికి సోవియట్ ప్రభుత్వం ఎన్నో ఇబ్బందుల నెదుర్కోవలసి వచ్చింది. అయినప్పటికి 1936 సంవత్సరంతో పోల్చిచూస్తే 1947 సంవత్సరంలో ఆహారపైరులు వేసిన భూమియొక్క విస్తీర్ణం నూటికి 95 వంతులవరకూ ఉంది. 1948 లో పంటభూమి విస్తీర్ణం ఇంకా ఎక్కువయింది. ముఖ్యంగా బంగాళాదుంపలపంట చాలా అభివృద్ధి చెందింది. 1947 కంటె 1948లో 93,100 హెక్టార్లలో అధికంగా బంగాళాదుంప వేయబడింది.

నిన్న మొన్నటివరకూ పేదరైతులుగానూ, వ్యవసాయ కూలీలుగానూ ఉన్న అసంఖ్యాక ప్రజానీకంలో నేడొక నూతనజీవితం తొణికిసలాడుతూ ఉంది. బీదరైతులకూ, వ్యవసాయ కూలీలకూ సాగుచేసుకోడానికి నేడు భూమి లభించింది. వారిని పీడించి దోపిడిచేసే భూస్వామివర్గం అంతరించిపోయింది.

‘గ్రాస్ బ్రీసెన్’ గ్రామస్థుడైన తేసర్ అనే ఒక వ్యవసాయకూలీ ఇలా అన్నాడు:

“భూస్వాముల గాదెలు నింపడానికి నేనిప్పటికి 45 సంవత్సరాలనుంచి రేయింబవలూ రెక్కలు విరుచుకుంటూ కష్టపడ్డాను. నాకష్టార్జితం మీద ఒక కొండెడకు సరిపోయే భూమిని కొనుక్కోవాలని ఎన్నో కలలుగన్నాను. కాని అప్పుడు నాకలలన్నీ కల్లలయ్యాయి. నాజీ కిరాతులు పతనం అయినతర్వాత ప్రజాస్వామిక పార్టీల సహాయంతోనూ, ‘రైతాంగ సహాయక పరస్పర కమిటీ’ చేసిన సహకారం ద్వారానూ, నాకిప్పుడు భూమి లభించింది. నాకాళ్ళ మీద నేను నుంచోగలుగుతున్నాను. ఈరోజు నాకు స్వంతంగా ఒక ఇల్లూ, ఒక గుర్రమూ, ఒక ఆవూ ఉన్నాయి. నాజీవితంలో నేను స్వతంత్రంగా బతకడం మొదలుబెట్టి ఇప్పటికి ఒక సంవత్సరమయింది. ఇప్పుడు మళ్ళీ రెండో సంవత్సరం గడుస్తూఉంది. రెండోపంట ఇంటికి రాబోతూఉంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రం అంటే ఏమిటో నేను నా కండ్లారా చూడగలుగుతున్నాను.”

తురంజియా ప్రాంతానికి చెందిన మరో రైతు కార్ల్ జాక్ ఇలా అన్నాడు:

“వ్యవసాయ సంస్కరణలు ప్రారంభించక పూర్వం నాకు $1\frac{1}{4}$ హెక్టారు మాత్రమే ఉండేది. ఈ చారెడు ముక్కతోనే నేనూ నాకుటుంబం ఇప్పటికి 24 సంవత్సరాలనుంచి నానావస్థపడుతున్నాము. అనేకసార్లు అర్ధాకలితో పస్తులు పడుకోవలసి వచ్చేది. కాని ఇప్పుడు వ్యవసాయ సంస్కరణల ఫలితంగా నాకు 13 హెక్టార్లభూమి లభించింది. ఇక నాకూ, నా కుటుంబానికీ తిండికొరత ఉండదు.”

తన పొలాన్ని బలపరచుకోవాలనీ, అందులో సాధ్యమైనంత ఎక్కువ పంటపండించాలనీ కష్టపడిపనిచేసే ప్రతిరైతూ ప్రయత్నిస్తాడు. జర్మనీ రైతులు నేడు తమ భవిష్యత్తు చాలా ఆశాజనకంగా ఉందని భావిస్తున్నారు. కాబట్టే భూసారాన్ని బలపరిచే ఎరువులు ఇంకా తగినంతగా లభించకపోయినా, వ్యవ

సాయయంత్ర పరికరాలు పాతబడి, అరిగి పోయినవే అయినా, నీటి పారుదలకైనా ఇతరత సౌకర్యాలు చాలా తక్కువగానే ఉన్నా, పంటల్లో - ముఖ్యంగా రోగ్ లైరైతులు పండించే పంటల్లో - అభివృద్ధి కనిపిస్తూనే ఉంది. ఉదాహరణకు ఈ క్రిందిపట్టయాన్ని తీసుకోవచ్చు.

డార్న్‌హీం ఎస్టేటులో హెక్టారు 1కి పంట ఈక్రిందివిధంగా ఉంది.

| పంట | యుద్ధానికి పూర్వం (సెంట్‌నర్లు) | భూమిసంస్కరణ తర్వాత |
|---|---|---|
| గోధుమ | 16 | 24 |
| రై | 12 | 16 |
| బంగాళాదుంప | 160 | 180 |
| బీటుదుంప | 200 | 280 |

సోవియట్ స్వాధీనంలో ఉన్న జర్మనీ ప్రాంతంలో 1948 లో పంట ఇంకా ఎక్కువ అభివృద్ధి అయింది.

ఉత్పత్తి - కొనుగోలువిధానంకూడా రైతులకు ప్రోత్సాహకరంగా ఉండేటట్లు ఏర్పాట్లు జరిగాయి. భూస్వామి, పెట్టుబడిదారీ రైతు వర్గాల ఆట పూర్తిగా కట్టించబడింది. రైతులు విడుదల చేయవలసిన ధాన్యాన్ని గడువుకంటె నాలుగయిదు మాసాలముందు విడుదలచేయడమే రైతాంగమంతా సోవియట్ ప్రభుత్వ విధానాన్ని పూర్తిగా బలపరుస్తూఉంది అనడానికి ప్రత్యక్ష నిదర్శనం.

తమ అవసరాలకుపోను మిగతా ఉన్న ధాన్యాన్ని రైతులు తమ ఇష్టప్రకారం అమ్ముకొని ఆ డబ్బుతో వారికి కావలసినబట్టలూ, పనిముట్లూ వగైరాలను కొనుక్కోవచ్చు. పల్లె ప్రాంతాలకు కూడా కావలసిన సరుకులన్నీ అందజేయబడుతున్నాయి. ఈవిధంగా పల్లెటూళ్ళమధ్య, పట్టణాలమధ్య వస్తువినిమయం సక్రమంగా జరగడానికి ఉత్పత్తిదారుల సంఘాలూ, కొనుగోలుదారుల సంఘాలూ చక్కగా ఉపయోగపడుతున్నాయి.

భూమి సంస్కరణానంతరం జరిగిన వ్యవసాయాభివృద్ధి ఫలితంగా ఆహారపదార్థాల సప్లయిలో కూడా చాలా సత్ఫలితాలు కలిగాయి. పశ్చిమ జర్మనీలో (అమెరికా, బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాల స్వాధీనంలో ఉన్న ప్రాంతాల్లో) ఆహారసమస్య రోజు రోజుకూ క్లిష్టతరమవుతూ ఉంది. కాని సోవియట్ జోన్‌లో ప్రజలకిచ్చే రేషన్లు ఏటేటా పెరుగుతున్నాయి. సోవియట్ మిలిటరీ ప్రభుత్వాధికారి 1948 సెప్టెంబరు 8 వ తేదీన సోవియట్ జోన్ అంతటా రేషన్లు పెంచుతూ ఒక ఉత్తరవు జారీ చేశాడు.

ఈ ఉత్తరువు ప్రకారం 5 లక్షల మంది కష్టజీవులకు రోజుకు 615 కాలరీల ధాన్యం అదనంగా లభిస్తుంది. తదితర ప్రజాసామాన్యానికిచ్చే రేషన్ కూడా పెంచడం జరిగింది.

వ్యవసాయ సంస్కరణల ఫలితంగా వ్యవసాయోత్పత్తిని ఒక ప్లాను ప్రకారం కొనసాగించడం సాధ్యమయింది. జర్మనీ పల్లె ప్రాంతాల్లో ప్రజాస్వామిక భావాలు అభివృద్ధి చెందడానికీ, వ్యవసాయోత్పత్తి పెరగడానికీ ఒక ప్లాను ప్రకారం పని సాగించడం అత్యవసరం. పునరావాసానికీ, ఆర్థికాభివృద్ధికీ సోషలిస్ట్ యూనిటీపార్టీ (జర్మనీలో కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టుపార్టీ రెండూ కలిసి ఒకే పార్టీగా - సోషలిస్టు యూనిటీపార్టీగా-ఏర్పడ్డాయి. —అనువాదకుడు.) తయారు చేసిన ద్వివర్ష (1949-50) ప్రణాళికను జర్మనీ ఆర్థిక కమిటీ అంగీకరించింది. ఈ ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన సమస్యకూడా చాలా ప్రాముఖ్యత వహిస్తూఉంది.

ఈ ప్రణాళిక ప్రకారం మొత్తం సాగుబడి భూమియొక్క విస్తీర్ణం 2 లక్షల 25 వేల

ఉత్పాదనపరంగా పెరుగుతుంది. నూతన వ్యవసాయపద్ధతులను ప్రవేశపెట్టడంద్వారానూ, నీటి పారుదల సౌకర్యాల నెక్కువ చేయడం, కృత్రిమ ఎరువులను ఇతోధికంగా ఉపయోగించడంద్వారానూ ఎక్కువ పంట పండించడానికి పై ప్రణాళికలో ప్రధానస్థానం ఇవ్వబడింది. ఈ ప్రణాళికప్రకారం 1960 కి పంట నూటికి 23 వంతులూ, బీటుదుంప 49 వంతులూ, బంగాళాదుంప 38 వంతులూ అభివృద్ధి అవుతుంది.

ఈ ద్వివర్ష ప్రణాళికలో పశుసంపద నభివృద్ధి చేయడంకూడా ఒకముఖ్యమైనవిషయం. 1950కి గేదెలువగైరాలు నూటికి 25 వంతులూ, పందులు 66 వంతులూ, గొర్రెలు 60 వంతులూ గుర్రాలు 11 వంతులూ అభివృద్ధి చేయబడతాయి. వ్యవసాయ యంత్ర పరికరాల్లో కూడా తగినంత అభివృద్ధి కొనిరాబడుతుంది.

మార్షల్ ప్లానులాగా ఈ ద్వివర్ష ప్రణాళిక విదేశీప్రభుత్వాలు పెట్టే అప్పులపై ఆధారపడలేదు. దేశంలోఉన్న సహజసంపదలను సక్రమంగా వినియోగించుకోవడంపైనే ఈ ప్రణాళిక ఆధారపడుతూఉంది. విదేశాలతో వ్యాపారం చేయకూడదనే నిషేధమేమీ ఈ ప్రణాళికలో లేదు. అయితే ఆ వ్యాపారం కేవలం ఇచ్చిపుచ్చుకునేపద్ధతిమీద సమాన హోదాతో జరగాలి. ఆ వ్యాపారంద్వారా ఒకదేశానికి మరోదేశం బానిసగా తయారు కాకుండా చూడాలి. జర్మనీ ద్వివర్షప్రణాళికను కష్టజీవులైన ప్రజలంతా హృదయపూర్వకంగా బలపరుస్తున్నారు.

* * *

వ్యవసాయ సంస్కరణల యొక్క రాజకీయ ప్రాముఖ్యతనుకూడా మనం ముఖ్యంగా గమనించవలసి ఉంటుంది. ఈ సంస్కరణల ద్వారా భూస్వాముల యొక్క ఆర్థికాధికారమే కాకుండా రాజకీయాధికారంకూడా తుడిచిపెట్టి వేయబడింది. అయినప్పటికీ వ్యక్తిగత ఆస్తి రద్దుచేయబడలేదు. పొలాలూ, పశువులూ, పరికరాలూ ధనిక రైతులవద్ద ఇంకా జాస్తిగానే ఉన్నాయి.

వ్యవసాయ కూలీల శ్రమశక్తిని దోపిడి చేయటాలనీ, అధికలాభాలు సాధించాలనీ ఈ శక్తులు ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాయి. కాని ఈ ప్రయత్నాలను జర్మనీ రైతాంగమే ప్రతిఘటిస్తూఉంది. భూమిపై క్రయవిక్రయాలు నిషేధించడంవల్లనూ సోవియట్ జోన్లో ఉన్న తదితర ప్రజాస్వామిక చట్టాలవల్లనూ రైతుకూలీల హక్కులు సురక్షితంగా కాపాడబడుతున్నాయి.

ఈ వ్యవసాయ సంస్కరణలకు వ్యతిరేకంగా ధనికరైతులు తమ పోరాటాన్ని తీవ్రతరంచేస్తూఉండడంలో ఆశ్చర్యమేమీ లేదు. వర్గపోరాటాన్ని భూమిసంస్కరణ ఇంకా తీవ్రతరంచేసింది. కష్టజీవులైన రైతు ప్రజా సామాన్యాన్ని ప్రజాస్వామిక శిబిరంలోకి రాబట్టుకోడానికీ, కార్మికవర్గ నాయకత్వాన కార్మికప్రజలతో భుజంభుజం కలిపి పోరాడడానికీ, ప్రజాస్వామిక ఆశయాలను సాధించడానికీ, వ్యవసాయ సంస్కరణలతోపాటు రైతులను విద్యావంతులుగా చేయవలసి ఉంటుంది. ప్రజాసంఘాల్లో వారిని సంఘటిత పరచవలసి ఉంటుంది.

వ్యవసాయసంస్కరణల ఫలితంగా కష్టజీవులైన రైతులమధ్య, కార్మికవర్గంమధ్య పరస్పర సంపూర్ణ సహకారం నెలకొనడానికి అవకాశం ఏర్పడింది. వ్యవసాయ పనిముట్లనూ, యంత్రాలనూ, ఎరువులనూ వగైరా అందించడంలో రైతాంగానికి కార్మికులు పూర్తిగా తోడ్పడుతున్నారు. ఇందుకు బదులుగా రైతులు పట్టణాలకు కావలసిన ఆహారపదార్థాలను సకాలంలో సక్రమంగా అందచేస్తూ ఉన్నారు.

పట్టణ ప్రాంతానికీ, పల్లె ప్రాంతానికీమధ్య కుదిరిన రాజకీయ సంబంధా లేర్పడడానికి వ్యవసాయ సంస్కరణలు తగిన అవకాశాన్ని కల్గించాయి. సోవియట్ జోన్‌లో ఉన్న జర్మన్ ప్రజాజీవితంలో ఈవిషయంస్పష్టంగా ప్రతిబింబిస్తూఉంది.

సోవియట్ జోన్‌లో గత వేసంగిలో ఏర్పడిన 'ప్రజాస్వామిక రైతుపార్టీ'యే ఇందుకు ప్రబలనిదర్శనం. సోవియట్ జోన్‌లో సాగించిన వ్యవసాయ సంస్కరణలను జర్మనీ దేశమంతటా అమలుజరపాలని ఈపార్టీ కృషి చేస్తూఉంది. రైతు కార్మికులమధ్య సన్నిహిత సంబంధాలను నెలకొల్పాలని తీవ్రంగా ప్రయత్నిస్తూఉంది. కష్టజీవులైన రైతు ప్రజా సామాన్యంయొక్క రాజకీయార్థిక హక్కులు సురక్షితంగా ఉండాలంటే రైతు కార్మిక వర్గాల మధ్య సన్నిహిత సంబంధాలుండడం అత్యవసరమని ఈపార్టీ ప్రకటించింది.

యాల్టా, పోట్స్‌డమ్ ఒడంబడికలను తూచా తప్పకుండా సోవియట్ యూనియన్ ఎంతశ్రద్ధగా పాటిస్తూఉందో తెలుసుకోడానికి ఈ భూమి సంస్కరణే ఒక దృష్టాంతం. సోవియట్ ప్రభుత్వం అవలంబించిన విధానం ఫలితంగా నేడు సోవియట్ జోన్ ప్రజాస్వామికానికి ఒక పెట్టనికోటగా తయారయింది. ఐక్య ప్రజాస్వామిక జర్మనీకోసం జర్మనీ ప్రజలు సాగించే పోరాటంలో ఇది ఒక ప్రధానశక్తిగా పనిచేస్తూ ఉంది.

కాని పశ్చిమరాజ్యాలకు ఐక్య జర్మనీ ఏర్పడడం బొత్తిగా ఇష్టంలేదు, జర్మనీని విభజించి పశ్చిమ జర్మనీని అమెరికా ఆధ్వర్యాన తమ దురాక్రమణ దురుద్దేశాలను సాధించడానికి ఒక ప్రధాన సాధనంగా ఉపయోగించుకోవడమే ఆరాజ్యాల ఆశయం.

పశ్చిమ జర్మనీలో వ్యవసాయ సంస్కరణాలు సాగించక పోవడానికికూడా ఇదే కారణం. ఇందువల్ల పశ్చిమ జర్మనీలో వ్యవసాయం నానాటికి క్షీణించి పోతూఉంది. మూడు సంవత్సరాల పూర్వం ఆహారపరిస్థితి ఎలా ఉందో 1948 లో కూడా అంతేఉంది. "తిండిలేని జనం అంతా భోగవిలాసాలను మానుకోవాలి" అని పశ్చిమజర్మనీ ఆహార శాఖాడైరెక్టరు (ఇతడొక జంకరుభూస్వామి) ప్రజలకు ఒక నీతి సూత్రాన్ని బోధించాడు. ఈ ప్రబుద్ధుడే మరోసారి ప్రజలంతా ఆహార పదార్థాలను తక్కువగా వినియోగించుకోవాలనీ, "భగవంతుని పేరు మీద" ఒక విజ్ఞప్తి చేశాడు. కాని బిషప్పు (క్రిష్టియన్ మత గురువు) ఈప్రకటనను ఖండిస్తూ ఆహారక్లిష్టతకు కారణం ఆంగ్లో - అమెరికన్ల ప్రభుత్వ విధానమే అని సమాధానం ఇచ్చాడు.

పశ్చిమ జర్మనీలో ఆర్థికాధికారమంతా భూస్వాముల చేతుల్లోనేఉంది. ప్రజాస్వామిక శక్తుల నరికట్టడానికి వాళ్ళు తమ ఆర్థికాధికారాన్ని ఉపయోగించుకొని తీవ్రంగా కృషి చేస్తున్నారు. మళ్లీ ఫాసిస్టుసంఘాలను పునరుద్ధరిస్తున్నారు.

యూరప్‌లో అమెరికా సామ్రాజ్య విస్తరణకు పశ్చిమ జర్మనీని ఒక కీలకస్థానంగా చేసుకోవాలనే పశ్చిమ రాజ్యాలయొక్క దురుద్దేశమే పశ్చిమ జర్మనీలో ఇలాంటి పరిస్థితులు ఏర్పడడానికి దారితీసింది.

పశ్చిమరాజ్యాలవలంబించే విధానం ప్రజాతంత్రాశయాలకు పూర్తిగా విరుద్ధమైంది. శాంతినికాపాడడానికి ఆవిధానం తోడ్పడదు. ప్రజల మనోగత భావాలకు వ్యతిరేకంగా సాగించే ఈవిధానం ఎంతకాలమో కొనసాగదు.

కామ్రేడ్ మాలటోవ్ చెప్పినట్లుగా సర్వజాతులకూ క్షేమకరమైన కార్యక్రమాన్ని సోవియట్ యూనియనూ, ప్రజాస్వామిక ప్రజాదేశాలుమాత్రమే అమలురుపస్తున్నాయి. ఆ కార్యక్రమంమాత్రమే శాంతిని నెలకొల్పుతుంది. ప్రజాస్వామికాన్ని, సాషలిజాన్ని సాధిస్తుంది.

(న్యూటైమ్సు 12-1-1949)

"దారిద్ర్యం నిర్మూలింపబడనంత కాలం, భూములూ ఫ్యాక్టరీలూ మొదలైన ఉత్పత్తిసాధనాలు పెట్టుబడిదారీ వర్గం చేతిలో ఉన్నంతకాలం, ప్రపంచంలో అధికారం అంతా డబ్బుకే ఉన్నంతకాలం, సోషలిస్టు సమాజం స్థాపించబడనంత కాలం బానిసత్వం తప్పదు."

లెనిన్

("పల్లెటూరి పేదలకు" పేజి 50)

# ప్రజాస్వామిక విధానంపై కామ్రేడ్ లెనిన్

—వి. నెమిరోవ్‌స్కీ, యమ్. యస్‌సి.

బూర్జువా రాజకీయ నాయకులు తామే ప్రజాస్వామికవాదుల మనీ, కమ్యూనిస్టులు ప్రజాస్వామికానికి వ్యతిరేకులనీ పత్రికల్లో ప్రకటనవర్షం కురిపిస్తున్నారు. గొంతు చించుకుంటున్నారు. పెట్టుబడిదారీపత్రిక లన్నీ ప్రజల్లో ఇదే విధంగా ప్రతిరోజూ విషప్రచారం చేస్తున్నాయి. అసలు ప్రజాస్వామికం అంటే ఏమిటో, బూర్జువా ప్రజాస్వామికం ఎంత బూటకమో, సోషలిస్టు ప్రజాస్వామికం ఎంత మహోన్నతమైనదో తెలుసుకోడానికి ఈ వ్యాసం బాగా ఉపయోగిస్తుంది. మొత్తం ప్రపంచంలో ఆరోవంతు భూభాగంపై సోషలిజాన్ని స్థాపించి, దోపిడీ దారిద్ర్యంలేని నూతన సమాజాన్ని నిర్మించిన లెనిన్ మహాశయుడు ప్రజాస్వామికాన్నిగురించి వెల్లడించిన భావాలను తెలుసుకోడానికి ఈ చిన్నవ్యాసం చక్కగా ఉపకరిస్తుంది. కమ్యూనిస్టులు ప్రజాస్వామికానికి వ్యతిరేకులవునో కాదో తెలుసుకోవాలంటే ఈవ్యాసాన్ని ఒకసారి – మరోసారి తప్పకుండా చదవమని – అధ్యయనం చేయమని – కోరుతున్నాం. — సంపాదకుడు.

సోవియట్ ప్రభుత్వ సంస్థాపకుడైన కామ్రేడ్ లెనిన్ తాను వ్రాసిన అనేక గ్రంథాల్లో సోవియట్ ప్రభుత్వ విధానానికి సంబంధించిన అనేక శాస్త్రీయ సిద్ధాంతాలను చక్కగా విశదీకరించాడు. సోవియట్ ప్రభుత్వమంటే ఒక కొత్తరకపు ప్రభుత్వమనీ, ప్రజా

స్వామికంయొక్క అత్యున్నత స్వరూపం అనీ, బూర్జువా ప్రజాతంత్రానికి పూర్తిగా విభిన్నమైనదనీ కామ్రేడ్ లెనిన్ సూచించాడు.

నూతన యుద్ధప్రేరేపకులు ఈనాడు సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారు. సోవియట్ విధానం ప్రజాస్వామిక విధానం కాదనీ, ప్రజాస్వామికానికి తామే "సంరక్షకులం" అనీ పత్రికలనిండా ప్రకటించుకుంటున్నారు. కాని ఇది ఎప్పుడో తుప్పుబట్టిపోయిన పాత ఎత్తుగడే. ఇప్పటికి 30 సంవత్సరాల పూర్వం ఈ ఎత్తుగడనే ఉపయోగించి - బ్రిటిషు, ఫ్రెంచి, అమెరికా సామ్రాజ్యవాదులు సోవియట్ యూనియన్‌పై దాడిచేశారు. 'ప్రజాస్వామిక సంరక్షణ' అనే ముసుగుక్రింద తమ దురాక్రమణ విధానాన్ని కప్పిపుచ్చుకోజూచారు. బూర్జువా రాజకీయ నాయకులూ, బూర్జువా సిద్ధాంతకర్తలూ తాము కాపాడదలచుకున్న 'ప్రజాస్వామిక' విధానం ఎలాంటిదో ఎప్పుడూ నిర్వచించ లేదు. అలా నిర్వచించడానికి వాళ్ళంత తెలివితక్కువవాళ్ళుగారు. బూర్జువా ప్రజాస్వామికాన్ని ఒక నిర్గుణమైన, నిరాకారమైన ప్రజాస్వామికంగానూ, వర్గాతీతమైన, స్వచ్ఛమైన ప్రజాస్వామికంగానూ వాళ్ళు చిత్రించారు.

"స్వచ్ఛమైన ప్రజాస్వామికం" అనే పేరుతో చేసే ప్రచారమంతా వట్టి బూటకమే అనీ, ఈ చెత్తవాగుడు అంతా కార్మిక ప్రజలను మోసగించడానికే అనీ కామ్రేడ్ లెనిన్ అతి నిశితంగా ఇలా విమర్శించాడు:

"సమాజంలో విభిన్న వర్గాలు ఉన్నంతవరకు స్వచ్ఛమైన, వర్గాతీతమైన ప్రజాస్వామికం అంటూ ఉండనే ఉండదు. బూర్జువా రాజకీయ వాదులు మాట్లాడే ప్రజాస్వామికం వాళ్ళవర్గానికి సంబంధించిన ప్రజాస్వామికంమాత్రమే. 'స్వచ్ఛమైన ప్రజాస్వామికాన్ని' గురించి పెట్టుబడిదారులూ, పెట్టుబడిదారీవర్గ నాయకులూ మాట్లాడడం కేవలం హాస్యాస్పదం. కార్మికులను మోసగించడానికి ఈ "స్వచ్ఛమైన ప్రజాస్వామికం" అనే పదం ఒకపడికట్టు రాయి. - ఒక ముసుగు - మాత్రమే."

బూర్జువా రాజకీయ నాయకులూ, బూర్జువా సిద్ధాంతకర్తలూ తమ అధికారాన్ని సురక్షితంగా, సుస్థిరంగా కాపాడుకునేందుకు బూర్జువా ప్రజాస్వామికంయొక్క వర్గస్వభావాన్ని వెల్లడిచేయకుండా దాన్ని మరుగుపరిచి, అసలు ప్రధానసమస్యనే అయోమయంచేస్తున్నారు. స్వాతంత్ర్యాన్ని గురించీ, సమానత్వాన్ని గురించీ, ప్రజాస్వామికాన్ని గురించీ జనరల్‌గా మాట్లాడుతూ ప్రజలను మోసగించే దగాకోరులనూ, ఝూటాకోరులనూ, అజ్ఞానులనూ, అంధప్రాయులనూగురించి లెనిన్ ఘాటుగా, నిర్దాక్షిణ్యంగా ఇలా వ్రాశాడు:

"ఆ దగాకోరులు వేసుకున్న ముసుగును తొలగించి వాళ్ళ నిజస్వరూపాన్ని చూడవలసిందని కార్మికులనూ, రైతులనూ కోరుతున్నాను. కన్నుమూసుకుపోయిన

ఆ మోసగాండ్ల కండ్లు తెరిచి వాళ్లను ఈ క్రింది సూటిప్రశ్నలు వేయుండి! వాళ్ల బండారం కాస్తా బైటపడుతుంది.

1. "సమానత్వం అంటే ఏమిటి ?
ఎవరితో సమానత్వం ?"

2. "జాతి అంటే ఏమిటి ?
ఏజాతితో సమానత్వం ?"

3. "వర్గం అంటే ఏమిటి ?
ఏ వర్గంతో సమానత్వం ?"

4. "స్వాతంత్ర్యం ఎవరినుంచి ?
ఏ వర్గంయొక్క బానిసత్వం నుంచి విముక్తి ?"

5. "స్వాతంత్ర్యం ఎవరికి ?
ఏ వర్గానికి ?"

"ఈపై ప్రశ్నలకు ప్రాధాన్యతివ్వకుండా, వీటిని అయోమయంచేస్తూ రాజకీయాలనుగురించీ, ప్రజాస్వామికాన్నిగురించీ, స్వాతంత్ర్యాన్ని గురించీ, సమానత్వాన్నిగురించీ, సోషలిజాన్నిగురించీ మాట్లాడేవాళ్ళు మేకతోలుకప్పుకున్న పెద్దపులులు. కార్మికులకూ, రైతులకూ బద్ధశత్రువులు. భూస్వాములకూ పెట్టుబడిదారులకూ నమ్మిన బంట్లు."

పైనుదహరించిన కొద్దిప్రశ్నలే బూర్జువా ప్రజాస్వామికంయొక్క అసలు బండారాన్ని వెంటనే బైటపెడతాయి. లెనిన్ యొక్క ప్రతిభావికాసాన్నీ, లెనిన్ యొక్క శాస్త్రీయ పద్ధతినీ తెలుసుకోడానికి ఈప్రశ్నలేచాలు.

బూర్జువాప్రజాస్వామికం మాటల్లో మాత్రం ప్రజలందరికి సమానత్వాన్ని ప్రకటిస్తుంది. కాని సమాజంలోఉన్న విభిన్న వర్గాలను యథావిధంగా నిలబెట్టడానికే – ఈనాడున్న హెచ్చుతగ్గులను శాశ్వతంగా, పదిలంగా ఉంచడానికే – బూర్జువా ప్రజాస్వామికం పోరాడుతుంది. హెచ్చుతగ్గులకు కారణభూతమైన ఉత్పత్తిసాధనాలపై వ్యక్తిగత యాజమాన్యాన్నీ, పెట్టుబడిదారీ దోపిడినీ చెక్కుచెదరకుండా కాపాడడానికే పూనుకుంటుంది. విభిన్నవర్గాల్లోలాగే విభిన్న జాతుల్లో, స్త్రీపురుషుల్లో నేడున్న హెచ్చుతగ్గులనుకూడా ఇదేవిధంగా ఉంచడానికి తీవ్రంగా ప్రయత్నిస్తుంది. [కాంగ్రెసు పెట్టుబడిదారీ ప్రభుత్వ హయాంలో మన ఆంధ్ర జాతికి (రాష్ట్రానికి) పట్టినగతినే ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. అనువాదకుడు]

బూర్జువాదేశాల రాజ్యాంగనిర్మాణాన్ని గురించి కామ్రేడ్ స్టాలిన్ ఇలాచెప్పాడు:

"పెట్టుబడిదారీ విధానం ఇక ఎన్నటికీ మారదనీ, అది మార్పులకతీతమనీ బూర్జువా రాజ్యాంగ నిర్మాతలు భావిస్తున్నారు. ఈ భావనపై ఆధారపడే వాళ్లు బూర్జువా రాజ్యాంగ నిర్మాణ చట్టాలను తయారు చేస్తున్నారు. బూర్జువా రాజ్యాంగ నిర్మాణానికి పెట్టుబడిదారీ విధాన సిద్ధాంతాలే మూలాధారం. భూములూ, అడవులూ, ఫ్యాక్టరీలూ కర్మాగారాలూ, వగైరా ఉత్పత్తిసాధనాలపై వ్యక్తిగత యాజమాన్యం ఉండడం, ఒక మనిషిని మరో

మనిషి దోపిడి చేయడం, దోపిడి చేసే వాళ్లూ, దోపిడి చేయబడే వాళ్లూ అనే భేదా లుండడం, సమాజంలో అట్టడుగున పడిఉన్న కష్టజీవులైన బహుసంఖ్యాక ప్రజానీకం ఒకవైపు తిండికి లేకపస్తులు పండుకుంటూ ఉంటే మరోవైపు కొద్దిమంది ధనికులు ఏ మాత్రం కష్టపడకుండా సమస్త భోగవిలాసాలు అనుభవిస్తూ ఉండడం,- ఇవే వాళ్ళు నిర్మించే రాజ్యాంగానికి మూలస్తంభాలు. వీటినే వాళ్ళు ప్రతిబింబిస్తున్నారు. ఈ సిద్ధాంతాలకే వాళ్ళు చట్టస్వరూపం ఇస్తున్నారు.

వర్గాలలో ఆర్థిక అసమానత్వం ఉన్నంతవరకు, యజమానికీ కార్మికునకూ మధ్య, భూస్వామికీ రైతుకూ మధ్య నిజమైన సమానత్వం ఉండదు. యజమానులకు భూస్వాములకూ ధన ప్రాబల్యం ఉంటుంది. రాజకీయ ప్రాబల్యం ఉంటుంది. కార్మికులకూ రైతులకూ అలాంటి వేమీ ఉండవు. యజమానులూ భూస్వాములూ దోపిడి చేసేవాళ్ళు. కార్మికులూ రైతులూ దోపిడి చేయబడేవాళ్లు.

ప్రజలకుకూడా రాజకీయ హక్కులున్నాయని భ్రమలు కలిగేటట్లుగా బూర్జువా పార్లమెంటరీ రిపబ్లిక్కులయొక్క ప్రభుత్వ విధానం నిర్మించబడుతుంది. కాని అసలు వాస్తవానికి ప్రజలను దేశ పరిపాలనలో భాగస్వాములు కాకుండా అరికట్టడం పెట్టుబడిదారీవర్గంయొక్క ఏకచ్ఛత్రాధిపత్యాన్ని నిరాఘాటంగా చలాయించడం మాత్రమే ఆ ప్రభుత్వ విధానంయొక్క ఉద్దేశమని కామ్రేడ్ లెనిన్ స్పష్టంగా వివరించాడు. వోటింగు హక్కులోవుండే ఆస్తినియమాలూ, స్త్రీ పురుష భేదాలూ, నివాసయోగ్యతలూ, చదువుకు సంబంధించిన నియమాలతోపాటు ఎన్నికల సమయంలో జరిగే మోసాలూ, తప్పుడు ప్రచారాలూ, లంచాలూ, దౌర్జన్యాలూ ఇవన్నీ పై చెప్పిన విషయాన్నే ధ్రువపరుస్తాయి.

పార్లమెంటు అనే తెరమరుగున ఉండి దేశాన్ని పరిపాలించే బూర్జువా శాసనసభ (పార్లమెంటు) గుత్తపెట్టుబడిదారుల చేతుల్లో నిజంగా ఒక కీలుబొమ్మలాంటిది.

“పార్లమెంటు కార్యకలాపాల్లో కార్మిక ప్రజలు భాగస్వాములు కాకుండా అనేక అభ్యంతరాలు కల్పించబడతాయి. (బూర్జువా ప్రజాతంత్రానికి సంబంధించిన ఏ తీవ్ర సమస్యనూ ఈ శాసన సభలు (పార్లమెంటు) పరిష్కరించవు. వాటిని పరిష్కరించేవి బేంకులు, స్టాక్ ఎక్ఛేంజి మాత్రమే) బూర్జువా శాసనసభ తమ గొడవను ఆలకించదనీ, అది తమకు పరాయిసంస్థ అనీ, శ్రామిక వర్గాన్ని అణచి వేయడానికి పెట్టుబడిదారీ వర్గం చేతిలో

అవి ఒక ఆయుధమనీ, తమశత్రు వర్గానికి చెందిన కొద్దిమంది పెట్టుబడిదారుల సంస్థ అనీ కార్మిక ప్రజలు తమ స్వానుభవంద్వారా స్పష్టంగా తెలుసుకుంటున్నారు. తమ కండ్లారా చూస్తున్నారు."

—లెనిన్.

ప్రజల్లో పెట్టుబడిదారీ వర్గభావాలను వ్యాపింప చేయడానికి రాజకీయ ప్రచార సాధనాలైన పత్రికలూ, రేడియోలు, సినీమాలు వగైరాలన్నీ గుత్తపెట్టుబడిదారుల స్వాధీనంలో వుంటాయి. బూర్జువాదేశాల్లో "పత్రికా స్వాతంత్ర్యం" అనేది ఒక్క పెట్టుబడిదారులకు మాత్రమే వుంటుంది. పత్రికలకు లంచంపెట్టి తమవైపు తిప్పుకోడానికీ, పత్రికలను ప్రచురించడానికి తగిన అవకాశాలూ, సాధనాలూ బూర్జువాదేశాల్లో ఒక్క పెట్టుబడిదారీవర్గానికి మాత్రమే వుంటాయి.

పెట్టుబడి దారులున్న ప్రతి దేశంలోనూ పత్రికాస్వాతంత్ర్యం అంటే పత్రికలను కొనివేయడానికి స్వాతంత్ర్యం, రచయితలను కొని వేయడానికి స్వాతంత్ర్యం, లంచం పెట్టి తమ వైపు తిప్పుకోడానికి స్వాతంత్ర్యం, యథార్థ వార్తలను తారుమారు చేసి, కమ్మిని బమ్మిగా చేసి, బూర్జువా ప్రయోజనాలకనుగుణంగాఉండే టట్లు అబద్ధవార్తలను సృష్టించి ప్రచారం చేయడానికి స్వాతంత్ర్యం, — బూర్జువాదేశాల్లో ఉండే పత్రికా స్వాతంత్ర్యం ఇదే. ఈ నగ్నసత్యాన్ని ఎవరూ కాదనలేరు."

—లెనిన్

బూర్జువా రిపబ్లిక్ దేశాల్లో "స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు" అనేవి దోపిడీవర్గానికి చెందిన కొద్దిమంది పెట్టుబడిదారులకు మాత్రమే ఉంటాయి. పెట్టుబడిదారీ విధానము క్రింద బూర్జువా ప్రజాతంత్రము ఎప్పుడూ చాలా సంకుచితంగా, అసమగ్రంగా, బూటకంగా, మోసంగా, ధనికులకు స్వర్గతుల్యంగా, పీడితప్రజాసామాన్యానికి నరకతుల్యంగా, ఉరిత్రాడుగా ఉంటుంది. ఉండితీరుతుంది.

"కార్మిక ప్రజల చేతుల్లో, పీడిత ప్రజాసామాన్యముయొక్క చేతుల్లో ప్రభుత్వాధికారాన్ని కేంద్రీకరించడంలోనూ, బూర్జువా ప్రజాస్వామికంయొక్క బండారాన్ని, బూటకత్వాన్ని, మోసాన్ని బట్టబయలు చేయడంలోనూ భూములూ, మిల్లులూ, ఫ్యాక్టరీలు వగైరాలపై వ్యక్తిగత యాజమాన్యాన్ని రద్దుచేసి వేయడంలోనూ కమ్యూనిజము యొక్క సారం, కమ్యూనిజము యొక్క శక్తి ఉన్న"దని కామ్రేడ్ లెనిన్ ఉద్ఘాటించాడు.

మహత్తరమైన నవంబరు సోషలిస్టు విప్లవం ఉత్పత్తిసాధనాలపై వ్యక్తిగత యాజమాన్యాన్ని రద్దుచేసి, వాటిని ప్రజలస్వాధీనం చేసింది. మనిషిని మనిషి దోచుకునే దోపిడి విధానంయొక్క అసలు మూలాధారాన్ని తుడిచిపెట్టివేసింది. నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వ పరిపాలనలో ప్రజలందరూ పూర్తిగా భాగస్వాములుగా ఉండే ఒక నూతన రాజకీయ విధానాన్ని చరిత్రలో మొట్టమొదటి సారిగా సృష్టించింది.

నిజమైన పరిపాలన కమిటీలుగా సోవియట్లను కనిపెట్టింది కామ్రేడ్ లెనినే. సోవియట్లద్వారా ప్రభుత్వ పరిపాలనలో కష్టజీవులైన అసంఖ్యాక ప్రజానీకం భాగస్వాములవుతున్నారు. కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు సోవియట్లు ప్రజలతో ప్రత్యక్ష సంబంధం ఉన్న ప్రజాసంఘాలు - ఉత్తమోత్తమమైన ప్రజాతంత్ర విధానంపై నడిచేసంఘాలు, కాబట్టే అవి ప్రజలతరఫున నిజమైన అధికార కమిటీలు. సంఘంలోనూ పరిపాలన యంత్రంలోనూ ప్రజలందరూ పాల్గొని వారి విప్లవశక్తినీ, విప్లవోత్సాహాన్నీ, విప్లవదీక్షనూ చూపడానికి ఈ సోవియట్లు ప్రజలందరికీ సంపూర్ణావకాశాలు కలిగిస్తున్నాయి.

స్టాలిన్ రాజ్యాంగంలో సోవియట్ ప్రజాస్వామిక విధానం అత్యున్నత శిఖరాన్ని అందుకుంది. సోవియట్ ప్రజాస్వామిక విధానానికే సంపూర్ణశాసనాధికారం లభించింది. సోవియట్ యూనియన్‌లో ఉన్న ప్రభుత్వ కమిటీలన్నీ - సుప్రీం సోవియట్ నుంచి గ్రామసోవియట్ వరకు ఉన్న సోవియట్లన్నీ - ప్రజలందరిచే ఎన్నుకోబడతాయి. ఎన్నికల సమయంలో సోవియట్ యూనియన్ అంతటా ఒక బ్రహ్మాండమైన నూతన రాజకీయోత్సాహం వెల్లివిరుస్తుంది. బూర్జువా దేశాలు ఆ ఉత్సాహాన్ని, ఆ దృశ్యాన్ని ఊహిచనైనాలేవు. పరిపాలనలో ప్రజలు పాల్గొనడం అనేది ఎన్నికల సమయములో వోటు ఇవ్వడంతోనే పూర్తి కాదు. ఇదే సోవియట్ విధానం యొక్క విశిష్టత. ప్రతి ప్రతినిధీ తానుచేసే ప్రతిపనికీ తనను ఎన్నుకొన్న ప్రజలందరికీ ఎల్లప్పుడూ బాధ్యుడయ్యే వుంటాడు. ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిన ప్రతినిధిని ప్రజలు వెంటనే అతన్ని క్రిందికిదించివేస్తారు. సోవియట్ ప్రభుత్వ సంస్థలన్నీ ప్రజల నిత్య పర్యవేక్షణక్రింద విమర్శ - ఆత్మవిమర్శలతో కొనసాగించబడుతూ వుంటుంది. చురుకుగా పనిచేసే కార్మికులనూ, రైతులనూ, మేధావులనూ సోవియట్లు తమ సంఘాల్లోకి తీసుకుంటాయి.

సోవియట్ ప్రజాస్వామికాన్ని గురించి మాట్లాడుతూ లెనిన్ ఇలా అన్నాడు:

> "స్వాతంత్ర్యాన్ని నామమాత్రంగా గుర్తించి ప్రయోజనం లేదు (బూర్జువా శాసన సభల్లో ఇదేతంతు జరుగుతూ ఉంటుంది) స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకోడానికి కష్టజీవులైన ప్రజలందరకూ తగిన అనుకూల పరిస్థితులను కల్పించవలసి ఉంటుంది."

ఈ విశిష్టత స్టాలిన్ రాజ్యాంగంలో బాగా ద్యోతకమవుతుంది. ప్రజలందరికీ ప్రజాస్వామిక హక్కులను - పౌరస్వత్వాలను - ప్రకటించడంతోనే స్టాలిన్ రాజ్యాంగం ఆగిపోలేదు. ప్రజలంరకు పనిచేయడానికి హక్కు కల్పించింది. ఆర్థిక సంక్షోభాలనూ నిరుద్యోగ సమస్యనూ శాశ్వతంగాతొలగించి,

ఆ హక్కుకు తగిన హామీ నేర్పరచింది. చదువుకోడానికీ, విశ్రాంతి తీసికోడానికీ వృద్ధాప్యంలో అవసరమైన జీవన భృతి పొందడానికీ ప్రతి పౌరునికీ హక్కు ఇవ్వడమే గాక వాటి కవసరమైన స్కూళ్లూ, హైస్కూళ్లూ, ఆరోగ్య భవనాలూ, విశ్రాంతి భవనాలూ అనేకం నెలకొల్పింది. వృద్ధులకూ, పనిచేయలేని వారికీ పెన్షన్లు ఏర్పాటుచేసింది. వాక్ పత్రికా సభా స్వాతంత్ర్యాలు మాటల్లోనే గాక ముద్రణాలయాలూ, పేపరు నిల్వలూ వగైరా అవసరమైన పరికరాలనూ, ప్రజలందరికీ వుపయోగపడే భవనాలునిర్మించడానికి అవసరమైన పరికరాలనూ, కష్టజీవులైన ప్రజలందరికి అందుబాటులో వుంచింది. వీటన్నిటినిబట్టి సోవియట్ ప్రజాస్వామికం అంటే బూర్జువాదేశాల్లో వుండే నామమాత్ర ప్రజాస్వామికం కాదనీ, సోషలిస్టు ప్రజాస్వామికం అనీ స్పష్టంగా బోధపడుతుంది.

వివిధజాతులమధ్య ఆంతరంగిక సంబంధాలను ఏర్పరచుకోడంలో కూడా సోవియట్ ప్రజాస్వామికంయొక్క విశిష్టత కనిపిస్తుంది. వివిధ జాతులకు సమానత్వాన్ని ప్రకటించడంతోనే సోవియట్ ప్రజాస్వామికం ఆగిపోలేదు. వివిధ జాతులమధ్య హెచ్చుతగ్గులకు మూలకారణమైన ఆర్థిక వైజ్ఞానిక రంగాల్లో వుండే అసమానత్వాన్ని తొలగించివేసింది. జాతులపట్ల లెనిన్ స్టాలిన్‌లు అవలంబించిన మహోత్కృష్ట పంథా ఫలితంగా జారు కాలంలో వెనకబడిన, అణచబడిన జాతులు నేడు నూతన జీవనంతో, నూతనోత్సాహంతో, నూతన సంస్కృతితో తొణికిసలాడుతున్నాయి. సోషలిస్టు ఆర్థికాభివృద్ధిలో, సాంస్కృతికాభివృద్ధిలో, ఆ జాతులన్నీ సమానభాగస్వాములై ప్రశంసనీయంగా కృషి చేస్తున్నాయి.

"జాతులసమస్యను, వివిధ జాతుల మధ్య పరస్పరసహకార సమస్యను సోవియట్ యూనియన్ ఒక్కటే అత్యుత్తమంగా పరిష్కరించింది. అసలు సోవియట్ ప్రభుత్వ విధానమే అలాంటిది. వివిధ జాతులున్న మరే దేశంలోనూ బూర్జువా ప్రభుత్వాలు ఈవిధంగా జాతులసమస్యను పరిష్కరించలేవు."

—స్టాలిన్

సోవియట్ ప్రజాస్వామికానికి నాయకత్వంవహించి నడిపేశక్తి లెనిన్ స్టాలిన్‌ల పార్టీఅయిన కమ్యూనిస్టుపార్టీయే. సోషలిజాన్ని సాధించడానికి సాగించిన పోరాటంలో కమ్యూనిస్టుపార్టీయే తన జెండా క్రింద ప్రజలందరనూ సమీకరించింది. కార్మిక ప్రజాప్రతినిధుల సోవియట్లకు ఎన్నికలు జరిగిన సందర్భంలో కమ్యూనిస్టుపార్టీకి చెందని ప్రజలూ, కమ్యూనిస్టులూకలసి స్టాలిన్ బ్లాక్‌గా ఏర్పడడంలో కమ్యూనిస్టుపార్టీ ప్రజలతో ఎంత సన్నిహితసంబంధం కలిగిఉందో స్పష్టంగా ద్యోతక మయింది.

సోవియట్ యూనియన్‌యొక్క సుప్రీం సోవియట్‌కు చివరసారి జరిగిన ఎన్నికల్లో నూటికి 99 వోట్లు స్టాలిన్ బ్లాక్‌కే వచ్చాయి. సోవియట్ ప్రజల్లో ఎంతటి అజేయమైన నైతిక ఐక్యతే, రాజకీయైక్యత వున్నాయో సోవియట్ ప్రజాస్వామికంలో ఎంతటి విశిష్టతవుందో, సోవియట్ ప్రభుత్వం ఎంత అజేయంగా, ఎంతదృఢంగా వుందో తెలుసుకోడానికి పైజెప్పిన ఒక్క విషయమే చాలు.

"ఏ జాతిలో ఎక్కువమంది కార్మికులూ, రైతులూ తమకష్ట జీవుల ప్రభుత్వాన్ని - సోవియట్

ప్రభుత్వాన్ని - నిలబెట్టడానికి తాము కృషి చేస్తున్నాం అని తెలుసుకుంటారో, మానవజాతి శ్రమశక్తి సృష్టించిన సాంస్కృతిక లాభాలను ఉపయోగించుకోడానికి తమకూ, తమబిడ్డలకూ సంపూర్ణావకాశాలు కలిగించే విధానాన్ని రక్షించడంకోసం తాము పాటుబడుతున్నామని గ్రహిస్తారో ఆ జాతి నెవరూ జయించలేరు."

— లెనిన్

చరిత్ర అంతా సమాజ పరిణామంయొక్క విభిన్న దశల్లో దోపిడిచేసే వర్గాలకూ దోపిడిచేయబడే వర్గాలకూ అధికారంచేసే వర్గాలకూ అణచబడిన వర్గాలకూ మధ్య జరిగిన పోరాటాల చరిత్రే. (ఒక్క అదిమసమాజ చరిత్ర మినహా - ఎంగిల్స్)

— మార్క్స్

# వ్యవసాయ సమస్యపై కామ్రేడ్ లెనిన్ ::

[ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క — — — — రెండవ సమావేశంలో ప్రవేశపెట్టిన తీర్మానం ]

1. పెట్టుబడిదారీవిధానం ఉన్నంతవరకూ తప్పనిసరిగా జరిగే సామ్రాజ్యవాద యుద్ధాల నుంచి, పెట్టుబడిదారులయొక్క భూస్వాముల యొక్క దోపిడీనుంచి పల్లెప్రాంతాల్లోని శ్రామికులను విముక్తిచేయగలిగినది కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంక్రింద నడుపబడే ఒక్క పట్టణపారిశ్రామిక కార్మికవర్గమే. బూర్జువా వర్గం, భూస్వాములు కల్పించిన బానిస సంకెళ్ళను త్రెంచుకొని విముక్తిపొందాలంటే ఈ కమ్యూనిస్టు కార్మికులతో చేరి, వారి విప్లవ పోరాటానికి సంపూర్ణ సహకారం చేయడం తప్ప గ్రామపేదలకు ప్రస్తుతం మరొకమార్గం లేదు.

కాని పారిశ్రామిక కార్మికులు, ఇతర ప్రపంచంతో జోక్యం లేకుండా ఏదో తమ కున్నదానితో తృప్తిపడి, బూర్జువానిర్మిత సంఘంతో తమ ఆర్థికపరిస్థితిని నెమ్మదిగా అభివృద్ధి చేసుకుంటూ కాలం గడుపుదామను కుంటే, యుద్ధాలనుంచి, పెట్టుబడిదారుల దోపిడీనుంచి, మానవసమాజాన్ని విముక్తి గావించే తమ చారిత్రాత్మక కర్తవ్యాన్ని నెరవేర్చలేరు.

పారిశ్రామికంగా అభివృద్ధిఅయిన అనేక దేశాల్లోని కార్మికనాయకుల విషయంలో నిజంగా జరుగుతున్నది ఇదే. 2 వ అంతర్జాతీయ సంస్థకు చెందిన 'సోషలిస్టు' పార్టీలకు నాయకులైన వీరు ఈవిధంగా ప్రవర్తించుటవల్ల నిజంగా సోషలిజం యొక్క శత్రువులుగా తయారై కార్మికోద్యమంలో బూర్జువా ఏజెంట్లుగా ఉన్నారు. కార్మికవర్గమే నిజమైన విప్లవవర్గం. దోపిడీగాండ్రను కూలద్రోయుటకు కష్టజీవులైన పీడిత ప్రజలందరూ సాగించే పోరాటంలో కార్మికవర్గం ముందుండి నాయకత్వము వహించగలిగినప్పుడే నిజమైన సోషలిస్టు పంథాలో నడుచుకొనగలదు. కాని, ఈ కృషి పూర్తిగా విజయవంతం కావాలంటే, వర్గ

పోరాట సిద్ధాంతాన్ని పల్లె ప్రాంతాల్లోకి కూడా తీసుకొనిపోయి, పల్లెప్రాంతాల్లోని వ్యవసాయ శ్రామికులనందరిని పట్టణ కార్మికుల కమ్యూనిస్టు పార్టీచుట్టూ సమీకరించి, వారికి సరియైన శిక్షణ యివ్వాలి.

2. పట్టణకార్మికుల నాయకత్వం క్రింద పోరాటంలోకి తీసుకొని రాబడవలసిన - ఎట్టి పరిస్థితిలోనైనా కార్మికవర్గ పక్షం వైపు త్రిప్పుకొనవలసిన - గ్రామపీడిత ప్రజలందరూ పెట్టుబడిదారీ దేశాలన్నిటిలో ఈ క్రింది తరగతులలో ఉన్నారు.

మొదటిరకం:- కూలిచేస్తూ పొట్ట పోసుకునే వ్యవసాయకూలీలు, రోజు కూలిగాని, సాలువారీగాకాని, లేక నియమిత కాలాలలో గాని, పెట్టుబడిదారీ భూఖామందులవద్ద పాలేర్లుగా ఉండి కాలం గడిపేవారు వీరు. గ్రామాల్లోని ఇతర జనాభాతో సంబంధం లేకుండా వేరుగా వీరిని రాజకీయంగానూ, మిలిటరీ యూనిట్లలోనూ, కార్మిక సంఘాలలోనూ, సహకార సంఘాల్లోనూ, వైజ్ఞానికంగానూ ఆర్గనైజ్ చేయుట, తీవ్రమైన ప్రచారంద్వారా వీరిని సోవియట్ ప్రభుత్వం వైపుకు, కార్మిక నియంతృత్వము వైపుకు, త్రిప్పుకొనుటయే అన్ని దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలయొక్క ప్రధాన కర్తవ్యం.

రెండవరకం:- కూలిచేస్తూ బ్రతికే చిన్న రైతులు, తమకున్న కొద్దిపాటి భూములమీద గాని, మక్తాకు భూములు తీసుకొనిగాని, పని చేస్తూ దానివల్ల తమకుటుంబ పోషణకు సరిపోయేటంత ఆదాయం రాకపోవుటవల్ల ఇతర కమతాలలో కూలిచేసుకొని బ్రతికేవారు వీరు. ఇటువంటి గ్రామశ్రామికులు అన్ని పెట్టుబడిదారీ దేశాల్లోను ఎక్కువగా ఉన్నారు. ఇటువంటి అసంఖ్యాకమైన గ్రామశ్రామికులు ఉన్నారనే విషయాన్ని 2వ అంతర్జాతీయ సంస్థకు చెందిన సోషలిస్టుపార్టీలు కప్పిపుచ్చి, మొత్తం రైతాంగముతో వీరినిగూడా కలిపేసి లెక్క వేస్తున్నాయి. ఇటువంటి బూర్జువా దగాపద్ధతి ఎక్కువగా జర్మనీ, అమెరికా, ఫ్రాన్సు మొదలైన దేశాలలో కనిపిస్తుంది. కమ్యూనిస్టుపార్టీ సరిగా నిర్మించబడి యున్న యెడల ఈ గ్రూపుకు చెందిన రైతులందరూ కమ్యూనిస్టుపార్టీ పక్షంవైపు తప్పకవస్తారు. ఎందుకంటే దుర్భరమైన పరిస్థితులలో కుమిలి పోతున్న వీరందరికీ సోవియట్ ప్రభుత్వంవల్ల, కార్మిక నియంతృత్వంవల్ల ఎక్కువలాభం సమకూరగలదు.

మూడవరకం:- చిన్నచిన్న రైతులు. వీరు కూలీలనెవరిని పెట్టుకోకుండా, తమకున్న కొద్దిపాటి భూములలో వ్యవసాయంచేస్తూ వచ్చే ఆదాయంతో సంసారం గడుపుకునే వారు. కార్మికవర్గ విజయంవల్ల ఈ చిన్న రైతులందరూ ఎక్కువలాభాన్ని పొందగలరు. 1. పంటలో కొంత భాగాన్ని భూస్వాములకిచ్చే పద్ధతులు (ఇవి ఫ్రాన్సు, ఇటలీ మొదలైన దేశాల్లోగూడా ఉన్నాయి. రద్దు అవుతాయి.) 2. తనఖాలు రద్దుచేయబడుతాయి. 3. పెద్ద పెద్ద భూస్వాములపై ఆధారపడుటవల్ల (అడవులను ఉపయోగించుకొనుట మొదలైన సౌకర్యాలకు) రైతులమీద కలిగే అన్ని రకాల ఒత్తిడి నిర్మూలించబడుతుంది. 4. వారి పొలాలకు, వ్యవసాయానికీ వెంటనే అవసరమైన సహాయసౌకర్యాలన్నీ కార్మిక వర్గ ప్రభుత్వం కలుగజేస్తుంది. (భూస్వాముల నుంచి, పెద్ద పెద్ద ఎస్టేటుదార్లనుంచి, స్వాధీనంచేసుకొనబడిన వ్యవసాయపు పనిముట్లను ఇండ్లను చిన్న రైతులపరం చేస్తుంది. పూర్వం పెట్టుబడిదారీ విధానంక్రింద ధనికరైతుల మధ్యతరగతి రైతుల ప్రయోజనమునకు ఉపయోగపడుతున్న సహకార సంఘాలను అసంఖ్యాకులైన పేదరైతులకు, వ్యవసాయ కూ

లకు ఉపయోగపడే సంఘాలుగా మార్చివేయ బడతాయి.)

మరొక ముఖ్య విషయాన్ని కమ్యూనిస్టు పార్టీ గుర్తించవలసి యున్నది. పెట్టుబడిదారీ విధానంనుంచి కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించే మధ్యకాలంలో, అనగా కార్మికవర్గ నియంతృత్వదశలో, ఈ చిన్నరైతులు సొంత ఆస్తిహక్కును, ప్రైవేటు వ్యాపారాన్ని సాగించుకునే హక్కును, అనుభవించుటకు ప్రయత్నిస్తారు. పూర్వంనుంచి లాభంకొరకు కొద్దిపాటి వ్యాపారాన్ని సాగించే అలవాట్లు, భూస్వాముల సాంప్రదాయాలు బాగా వీరిలో జీర్ణించుటయే దీనికి కారణం. అయినప్పటికీ దృఢనిశ్చయంతో కార్మికవర్గ పంథాను అనుసరించి, పెద్ద పెద్ద భూస్వాములతోనూ, ధనిక రైతులతోనూ కార్మికవర్గం నిర్దాక్షిణ్యంగా, నిర్మొగమాటంగా శ్రామికవర్గం వ్యవహరించే పక్షంలో, ఈ చిన్న రైతుల యొక్క ఊగులాట చాలావరకు తగ్గి కార్మిక వర్గ విప్లవంవైపుకు మొగ్గుతారు.

3. మొత్తంమీద, పైన చెప్పబడిన మూడురకాల పల్లెప్రజలుకలసి అన్ని పెట్టుబడిదారీ దేశాల్లోని జనాభాలో అధిక సంఖ్యాకులుగా ఉన్నారని చెప్పవచ్చును. అందువల్ల పట్టణాల్లోనేగాక, పల్లెలలోగూడా కార్మిక విప్లవం తప్పకుండా విజయవంతమై తీరుతుంది. కాని దీనికి వ్యతిరేకమైన దృక్పథం గూడా బాగా వ్యాపించి ఉన్నది. భూస్వాములు, పెట్టుబడిదార్లు మొదలైన దోపిడిగాండ్రకు, పల్లెప్రాంతాల్లోని పైన చెప్పబడిన కష్టజీవులకు మధ్యగల అగాధాన్ని కప్పిపెట్టి బూర్జువావర్గం తయారుచేసే మోసపు లెక్కలవల్ల ఇటువంటి అభిప్రాయం ఏర్పడుతున్నది. ఈ దొంగలెక్కల ప్రకారం పెద్దరైతులకు, చిన్న రైతులకు భేదం కల్పించబడుతున్నది. ఇంతే కాదు. బాగా అభివృద్ధి అయిన దేశాల్లోని 2వ అంతర్జాతీయ సంస్థయొక్క కార్మిక పెత్తందారులు, సామ్రాజ్యవాదుల వలల' పడిపోయిన అవినీతిపరులు, పల్లెప్రాంతాల్లో నిజమైన విప్లవప్రచారాన్ని, ఆందోళనను, నిర్మాణాన్ని సాగించుటకు ఇష్టపడక, అశక్తతను వెలిబుచ్చుటవల్ల గూడా ఇటువంటి అభిప్రాయం ఏర్పడుతుంది. ఈ అవకాశవాదులైన ద్రోహుల ప్రయత్నాలన్నీ బూర్జువావర్గంతోనూ పెద్ద రైతులతోనూ, మధ్యతరగతి రైతులతోనూ రాజీపడుటకేగాని కార్మిక వర్గాన్ని ఐక్యంచేసి బూర్జువా వర్గాన్ని, బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోయుటయందు వీరి దృష్టిలేదు ఈదృక్పథం అలాగే ఉండటానికి మరొక కారణం బూర్జువా డెమాక్రాటిక్ పార్లమెంటరీ దురభిమానులతో సంబంధం కల్గియుండడం. వీరివైఖరి చివరకు ఎంతమూర్ఖంగా పరిణమించిందంటే, మార్క్సిస్టు సిద్ధాంతాల, రష్యన్ విప్లవ అనుభవంవల్ల పూర్తిగా రుజువు చేయబడిన సత్యాన్నిగూడా - అనగా అణగద్రొక్కబడి, ఐక్యత లేకుండా అడివి మనుష్యులవలె జీవిస్తున్న పై మూడురకాల పల్లెప్రజలకు రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా సోషలిస్టు విజయంలో ఉత్సాహమున్నప్పటికి కార్మికవర్గం రాజకీయ అధికారాన్ని పూర్తిగా సంపాదించి, పెద్ద భూస్వాములతోనూ, పెట్టుబడిదార్లతోనూ వ్యవహారాన్ని ఖచ్చితంగా పైసలాచేసుకున్న తరువాతనే, ప్రత్యక్షంగా తమకొక స్పష్టమైన మార్గాన్ని చూపించి, అన్నివిధాల సహాయం చేస్తూ తమ హక్కులనన్నిటినీ రక్షించగల

కార్మికవర్గ నాయకత్వాన్ని రైతులు ఆమోదిస్తారనే వాస్తవిక విషయాన్ని గూడా ఈ ద్రోహులు గుర్తించక పోవుటవల్ల ఇటువంటి అభిప్రాయం కల్గుతున్నది.

4. ఆర్థికరీత్యా మధ్యతరగతి రైతులంటే ఎవరు? సొంతభూములుగాని, కవులుభూములుగాని కలిగి, వ్యవసాయంవల్ల వారికుటుంబాలకు సరిపోయే ఆదాయమే గాకుండా బాగా పండిన సంవత్సరాల్లో అదనంగా కొంతమిగిలి పెట్టుబడిగా మార్చుకొనుటకు అవకాశంకల్గి, సర్వసాధారణంగా కూలీలను పెట్టుకొని వ్యవసాయం చేసేవారని చెప్పవచ్చును. బాగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశమైన జర్మనీలో 6 నుంచి 10 హెక్టార్లవరకు పొలాన్ని కలిగిన రైతులను మధ్యతరగతి రైతులుగా పరిగణించవచ్చును. వీరి సంఖ్యలో 3 వ వంతుకు సమానమైన వ్యవసాయకూలీలు వీరి క్రింద పనిచేస్తున్నారని జర్మనీలో 1907 లో తీసుకొనబడిన జనాభా లెక్కలు తెలియజేస్తున్నాయి. ద్రాక్షతోటలు మొదలైన ప్రత్యేక పంటలు పండించే ఫ్రాన్సు మొదలైన దేశాల్లో ఈ వ్యవసాయ కూలీలసంఖ్య ఇంకా ఎక్కువగా ఉంటుంది.

ప్రారంభదశలో అనగా కార్మిక నియంతృత్వకాలంలో ఈ మధ్యతరగతి రైతులను తమవైపుకు (కార్మికపక్షం వైపుకు) త్రిప్పుకొనుట అసాధ్యమైనపని. అందువల్ల వారిని వ్యతిరేకం గాకుండా చేసుకొనుటకు కార్మిక వర్గానికి జరిగే పోరాటంలో మధ్యతరగతి రైతులు తటస్థంగా ఉండునట్లు చేయుటయే కార్మికవర్గ కర్తవ్యం. కార్మికవర్గ, బూర్జువా వర్గాలమధ్య ఊగులాడుతూ, ప్రథమదశలో బూర్జువావర్గంవైపుకు మొగ్గుటగూడా ఈ మధ్యతరగతి రైతుల లక్షణమే. వీరి దృక్పథంలో, ప్రవర్తనలో 'ఆస్తిపరుల సాంప్రదాయాలే ఆధిక్యత వహిస్తాయి. లాభాలను సంపాదించుట, యథేచ్ఛగా వ్యాపారం సాగించుట, సొంతఆస్తి కలిగివుండుట-ఇవన్నీ వీరి ప్రధానలక్షణాలు. కూలిపని చేసేవారంటే వీరికి గిట్టదు. విజయవంతమైన కార్మికవర్గం-శిస్తులను, తనఖాలను రద్దుచేసి వీరి పరిస్థితిని అభివృద్ధి చేస్తుంది. పెట్టుబడి దేశాల్లో చాలా వరకూ వెంటనే సొంత ఆస్తినంతనూ కార్మిక ప్రభుత్వం నిషేధించవలసిన అవసరంలేదు. ఇంతేగాదు; చిన్న రైతులకు మధ్యతరగతి రైతులకు వారి పొలాలను గ్యారంటీ చేయుటయేగాక, వారు పూర్వం మక్తాకు తీసుకొన్న భూములను ఇంకా కొంతభూమిని కలిపి కార్మిక ప్రభుత్వం వారి రక్షణకు తగిన హామీనిస్తుంది.

రైతులకు సహాయపడే ఇటువంటి కార్యాలు చేస్తూ బూర్జువావర్గంతో నిర్దాక్షిణ్యంగా పోరాడినయెడల, మధ్యతరగతి రైతులందరూ తాటస్థ్య వైఖరిని తప్పనిసరిగా అవలంబిస్తారు. మధ్యతరగతి రైతులను ఏమాత్రం బలవంత పెట్టకుండా, ఆదర్శప్రాయమైన ఉదాహరణలద్వారా కార్మికవర్గం నెమ్మదిగా క్రమేణా మెలకువతో సమిష్టి వ్యవసాయ విధానాన్ని ప్రవేశపెట్టాలి.

5. ఇక పెద్దరైతులంటే ఎవరు? ఎక్కువమంది కూలీలనుపెట్టి పెట్టుబడితో వ్యవసాయం సాగించేవారు. వీరికిగల సాంప్రదాయిక రైతు అలవాట్లవల్ల, రైతులకుండే విజ్ఞానహీనత వీరిలోగూడా వుండుటవల్ల, శరీరకష్టంకూడా చేసే అలవాట్లు ఉండుటవల్ల వీరుగూడా రైతాంగంలో ఒక భాగంగా ఉన్నారే కాని వేరు కాదు. బూర్జువావర్గంలో ఎక్కువభాగం ఇటువంటి పెద్దరైతులే. విప్లవకరమైన కార్మిక వర్గానికి వీరు బద్ధశత్రువులు. పల్లె ప్రాంతాల్లో పనిచేసే కమ్యూనిస్టుపార్టీలు తమ దృష్టినంతా వీరితో తీవ్రమైన పోరాటం సాగించి వారి

ప్రభావంనుంచి పల్లె ప్రజలనందరిని విముక్తి గావించడంలో కేంద్రీకరింప చేయాలి.

పట్టణాల్లో కార్మికవర్గం విజయం సాధించిన తరువాత, పెద్దరైతులందరూ విప్లవ వ్యతిరేకులుగా తయారై సాయుధ తిరుగుబాట్లు, విధ్వంసక కార్యాలు తప్పక చేస్తారు. అందువల్ల వీరిని నిరాయుధులుగా చేయుటకై అవసరమైన సిద్ధాంత నిర్మాణ కార్యక్రమాన్ని కట్టుబాటుతో ఇప్పటినుంచే కార్మికవర్గం సాగించాలి. పారిశ్రామిక పెట్టుబడిదారులను కూలద్రోయుటతోపాటు, మొదటిలోనే ఈవర్గాన్నిగూడా నిర్దాక్షిణ్యంగా కూలద్రోసితీరాలి. ఇందులకై గ్రామీణ శ్రామికులందరికీ ఆయుధముల నిచ్చి, పీడిత ప్రజల చేతుల్లో అధికారం ఉండేటట్లు, దోపిడిగాండ్రకు స్థానంలేకుండా గ్రామ సోవియట్లను నిర్మించాలి.

ఏమైనప్పటికి పెద్దపెద్ద రైతుల్లయొక్క ఎస్టేట్లనుకూడా మొదటిలోనే కార్మికవర్గం స్వాధీనం చేసుకొనగూడదు. ఎందుకంటే అంత పెద్ద ఎస్టేట్లలో సోషలిస్టుపంథాలో వ్యవసాయాన్ని సాగించుటకు అవసరమైన యంత్రపరికరాలు, సామాజిక పరిస్థితులు ఇంకా ఏర్పడలేదు. కాని ప్రత్యేకంగా కొన్ని భూములను – కొద్ది చిన్నచిన్న పొలాలుగా కౌలుకు ఇవ్వబడినవిగాని లేక చుట్టూవున్న చిన్న రైతులకు ఎక్కువ లాభదాయకంగా ఉండేవాటిని – మాత్రం వెంటనే స్వాధీనం చేసుకొనవచ్చును. పెద్ద రైతులకు చెందిన వ్యవసాయిక యంత్రాలను మాత్రం కొన్ని షరతులమీద వుచితంగా చిన్నరైతులు వాడుకొనుటకై హామీ యివ్వాలి. పోతే పెద్ద ఎస్టేట్లను పెద్ద రైతులచేతుల్లోనే వుంచి, కష్టజీవుల ప్రభుత్వానికి వారు విరుద్ధంగా ప్రవర్తించి నిరోధించే పక్షంలో ఎస్టేట్లను స్వాధీనం చేసుకోవలసివుంటుంది. రష్యాలోని ప్రత్యేక పరిస్థితులవల్ల పెద్దరైతులకు వ్యతిరేకంగా క్లిష్టమైన దీర్ఘపోరాటం సాగించవలసి వచ్చినప్పటికి, ఏమాత్రం ప్రతిఘటన సూచనలు వారిలో కనిపించినా వారికి కఠిన శిక్షలు విధించుటవల్ల, పెద్దరైతు లందరూ కార్మిక ప్రభుత్వంయెడల విశ్వాసంతో ప్రవర్తిస్తూ నెమ్మదిగా ప్రభుత్వ ఆజ్ఞలను అతిక్రమించకుండానే గౌరవంగా కట్టుబడి ఉన్నారని రష్యన్ విప్లవ అనుభవంవల్ల స్పష్టపడుతున్నది.

బూర్జువా వర్గాన్ని కూలద్రోసిన కార్మిక వర్గం, రష్యాలోని పెద్దరైతులకు వ్యతిరేకంగా చేసిన పోరాటం నెమ్మదిగానూ, సూటిగా గాకుండా క్లిష్టంగా జరుగుటకు కారణమైన ప్రత్యేక పరిస్థితులు ఇవి:- 1917 నవంబరు 7వ తేదీన రష్యావిప్లవం జరిగినతరువాత, విప్లవం ప్రధానంగా భూస్వాములకు వ్యతిరేకంగా రైతాంగమంతా చేసే పోరాటంగా అనగా బూర్జువాప్రజాస్వామ్య విప్లవదశలోనే నడిచింది; సంఖ్యలోనూ వైజ్ఞానికంగానూ పట్టణ కార్మికులయొక్క బలహీనత; రహదారీ మార్గములు రష్యాలో సరిగా లేకపోవుట, అభివృద్ధి అయిన దేశాలలో ఈలోటుబాట్లు లేనంతవరకూ, యూరపు అమెరికాలలోని విప్లవకర కార్మికవర్గం ఇంకా త్వరగానూ, శక్తివంతంగానూ, ముందుగానే సన్నాహమై పెద్ద రైతుల ప్రతిఘటనకు అవకాశము లేకుండా చేయాలి. ఒకవేళ వారు నిరోధించే పక్షంలో తీవ్రంగా ఎదుర్కోవాలి. ఇలా చేయడం అత్యవసరం. ఎందుకంటే పెద్ద రైతులమీద సంపూర్ణవిజయం సాధించనంతవరకూ కార్మిక వర్గ ప్రభుత్వం స్థిరపడిందని వ్యవసాయకూలీలు చిన్నరైతులు అనుకోటానికి వీలులేదు.

6. భూస్వాములకు చెందిన భూములను, పెద్దపెద్ద జమీందార్లకు చెందిన ఎస్టేట్లనుఅనగా పెట్టుబడి దేశాలలో సొంతంగా కాయకష్టం

చేయకుండా చుట్టుప్రక్కల పేదరైతులను, వ్యవసాయకూలీలను పనిలో పెట్టుకొని దోపిడి చేసే జమీందారులయొక్క; భూములను (రష్యా, జర్మనీ, హంగేరీ దేశాల్లోని జమీందార్లు, ఫ్రాంసులో తిరిగి అధికారంలోకి వచ్చిన ప్రభువులు, ఇంగ్లండులోని ప్రభువులు, అమెరికాలో పూర్వం బానిస యజమానులుగా ఉన్నవారు ఇటువంటివారు.) గొప్పధనికులైన పెట్టుబడిదారులయొక్క భూములను ఇతర సోమరిపోతులయొక్క దోపిడిగాండ్రకు చెందిన భూములన్నిటిని కార్మికవర్గం వెంటనే ఏ మినహాయింపులు లేకుండా స్వాధీనం చేసుకోవాలి.

కాని ఎట్టి పరిస్థితులలో కూడా స్వాధీనం చేసుకొనబడిన భూములకు బదులుగా భూస్వాములకు నష్టపరిహారాన్ని చెల్లించే ప్రచారానికి కమ్యూనిస్టు పార్టీలో అవకాశం లేకుండా చేయాలి. ఎందుకంటే ఈ విధంగా చేయుట యూరపు అమెరికాలలో గత యుద్ధంవల్ల దుర్భర పరిస్థితుల లోకి వచ్చిన ప్రజలమీద కొత్త పన్నులనువేసి సోషలిజానికి ద్రోహము చేసినట్లే అవుతుంది.

అయితే పెద్ద పెద్ద భూస్వాములనుంచి స్వాధీనం చేసుకొనబడిన భూములలో ఎటువంటి వ్యవసాయ విధానాన్ని ప్రవేశపెట్టాలి? అనే ప్రశ్న ఉంది. ఆర్థికంగా వెనుకబడియున్న రష్యా పరిస్థితులనుబట్టి, ప్రధానంగా ఈ భూములను సాగుచేసుకోడానికి రైతులకు పంపకం చేయవలసియుంటుంది. ప్రభుత్వం సోవియట్ వ్యవసాయ క్షేత్రాలను అరుదుగా ఆర్గనైజ్ చేసి వాటిలో పనిచేయుటకు వచ్చే పూర్వపు వ్యవసాయ కూలీలనందరిని ప్రభుత్వ ఉద్యోగులుగా నార్కి రాజ్యాంగ వ్యవహారాలను నిర్వహించే సోవియట్లలో సభ్యులుగా చేర్చాలి. కాని అభివృద్ధిచెందిన పెట్టుబడి దేశాల్లో ఈ విధంగా చేయనక్కరలేదని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అభిప్రాయపడుతున్నది. రష్యా పద్ధతులను ఆ దేశాల్లో అనుసరించుట పొరపాటనిగూడా భావిస్తున్నది.

కాని ఈనియమాన్ని ఆదేశంగా ఉంచి ఎట్టి పరిస్థితులలోనైనాసరే, స్వాధీనంచేసుకొన్న భూములను పేద రైతులకు, కొన్ని సమయాల్లో మధ్యతరగతి రైతులకు ఉచితంగా పంపకం చేయగూడదని చెప్పుట పొరపాటు.

( ) సాధారణంగా పై అభిప్రాయమునకు వ్యతిరేకంగా చేయబడే వాదన ఏమిటంటే - కొద్దిపాటి వ్యవసాయ విధానంకంటె, బాహుళ్యంగా వ్యవసాయం సాగిస్తే ఉత్పత్తి పెరిగి లాభదాయంగా ఉంటుందని వాదిస్తారు. ఈ విషయం నిజమైనప్పటికీ ఇలా వాదించుట విప్లవానికి ద్రోహముచేయుటేగాని వేరు కాదు. ఎందుకంటే విప్లవ విజయంకొరకై తాత్కాలికంగా ఉత్పత్తి పడిపోయి తగ్గు స్థాయిలో ఉండుటకైనా కార్మికవర్గం అంగీకరించుటకు వెనుతీయగూడదు. బానిసవిధానానికి వ్యతిరేకులైన ఉత్తర అమెరికా బూర్జువావర్గ 1863_65 లో తాత్కాలికంగా ప్రత్తిపంట వుత్పత్తి తగ్గిపోవుటకు అంగీకరించినట్లే ఇదిగూడా, బూర్జువా వర్గంయొక్క దృష్టిలో ఉత్పత్తి ఉత్పత్తికొరకే. దోపిడిగాండ్రను కూలద్రోసి, పెట్టుబడిదారులకు గాకుండా తమ స్వప్రయోజనములకై ఉత్పత్తి సాగించుటకు తగిన అనుకూల పరిస్థితులను కలుగజేయుటయే పీడిత ప్రజల దృష్టిలో ప్రధానమైన విషయం. కార్మికవర్గంయొక్క ప్రధాన కర్తవ్యం మధ్యతరగతి రైతులను తటస్థంగా ఉండేటట్లు చేయకుండా, చిన్న రైతుల మద్దతు లేకుండా

కార్మికవర్గ అధికారానికి స్థిరత్వం కల్గించుట అసంభవం.

(b) ఉత్పత్తిని అధికంచేసే విషయం అలా ఉంచి, ప్రస్తుతం అమలులోవున్న పెద్దస్కేల్లో సాగించే వ్యవసాయాన్ని నిలబెట్టుటకే వ్యవసాయకూలీలలో గొప్ప ట్రేడ్‌యూనియన్ చైతన్యం, రాజకీయ నిర్మాణ చైతన్యం, శిక్షణ అభివృద్ధి కావలసియున్నది. అటువంటి పరిస్థితులు లేనప్పుడు, తొందరపడి పెద్ద మొత్తంలో ఉత్పత్తిచేసే వ్యవసాయాన్ని ఎక్కువకేసి సామర్థ్యం నైపుణ్యాలు లేనివారి చేతుల్లో పెట్టినయెడల కార్మికవర్గ ప్రభుత్వానికి అపకీర్తిగూడా వస్తుంది. అట్టి పరిస్థితులలో చాలా జాగ్రత్తతీసుకొని, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను స్థాపించబోయేముందు అవసరమైన సన్నాహమంతా ముందే చేయవలసిఉంటుంది.

(c) బాగా అభివృద్ధి అయిన అన్ని పెట్టుబడిదేశాల్లో యింకా మధ్యయుగంనాటి జమీందారీ బానిసపద్ధతులు అమలులో ఉన్నాయి. జర్మనీలో, ఫ్రాన్సులో, అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో చిన్నచిన్న రైతులను పెద్ద భూస్వాములు అనేకవిధములైన అన్యాయాలకు గురిచేస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ముఖ్యంగా దక్షిణ రాష్ట్రాల్లో నీగ్రోలనేగాక తెల్లవారినిగూడా భూస్వాములు ఇదేవిధంగా దోపిడిచేస్తున్నారు. అటువంటి పరిస్థితులలో పూర్వం చిన్నరైతులు మక్తాకు తీసుకొన్న భూములను వారికి ఉచితంగా కార్మిక ప్రభుత్వం ఇచ్చివేయవలసియుంటుంది. ఇంతకన్న మరొక ఆర్థికసదుపాయాన్ని అకస్మాత్తుగా కలుగచేయుటకు సాధ్యపడదు.

పోతే పెద్ద భూస్వాములకుచెందిన వ్యవసాయపు యంత్రాలను, పనిముట్లను ఏమినష్టపరిహారం లేకుండా పూర్తిగా స్వాధీనంచేసుకొని ప్రభుత్వ ఆస్తిగా మార్చాలి. వీటిలో ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకు సరిపోగా మిగిలినవి ఉచితంగా కార్మిక ప్రభుత్వం నిర్ణయించే నియమాల ననుసరించి చిన్నరైతులకు ఇవ్వవలసియుంటుంది.

విప్లవం అయిన మొదటిరోజుల్లో పెద్ద భూస్వాముల ఎస్టేట్లను స్వాధీనపరచుకొనుటయేగాక వారికందరికి విప్లవవ్యతిరేక నాయకులుగా ప్రవాసశిక్ష విధించుటయో, లేక నిర్ణీత ప్రదేశాల్లో నిర్బంధించుటయో చేయుటగూడా అవసరం. ఎందుకంటే వారందరు పల్లెప్రజలనందరిని నిర్దాక్షిణ్యముగా దోపిడిచేసేవారు గనుక. కార్మికవర్గ అధికారం స్థిరపడినంతవరకూ, క్రమేణా గట్టినమ్మకస్థులైన కమ్యూనిస్టుపార్టీవర్కర్ల ప్రత్యేక కంట్రోల్ క్రింద వీరిలో నుంచి గొప్ప అనుభవం, నిర్మాణ సామర్థ్యం, జ్ఞానం కలవారినందరిని, పెద్దపెద్ద సమిష్టి వ్యవసాయక్షేత్రాలను నిర్మించుటకై వీరి ఉపయోగించుకొనుటగూడా అవసరం.

7. దోపిడిగాండ్రయొక్క ప్రతిఘటన ప్రయత్నాల నన్నిటినీ పూర్తిగా నిర్మూలించి వారి నందరిని కార్మికవర్గ ప్రభుత్వం క్రింద అణిగిపడివుండేట్లు చేసినతరువాత, పరిశ్రమలన్నిటినీ పెద్దస్కేలు ఉత్పత్తి విధానంక్రిందికి తీసుకొనివచ్చి ఆధునిక టెక్నిక్‌తో నడపనప్పుడే (జాతీయ ఆర్థిక ఉత్పత్తిఅంతా విద్యుచ్ఛక్తి సహాయంతో నడుపబడినప్పుడే) కార్మికవర్గ అధికారం స్థిరపడి, సోషలిస్టు విజయం చేకూరినదని చెప్పవచ్చును. ఇలా చేసినప్పుడే పట్టణ కార్మికులు చిందరవందరగా దేశమంతటా వెదజల్లబడి వెనుకబడియున్న పల్లె ప్రజలకు అవసరమైన సాంఘిక పారిశ్రామిక సహకారం చేసి వ్యవసాయ కూలీలయొక్క ఉత్పత్తిని వృద్ధిచేసి, ప్రత్యక్ష కార్యాచరణద్వారా చిన్న రైతులను ఉత్సాహపరచి పెద్దమొత్తంమీద సాగించే సమిష్టి వ్యవసాయపద్ధతి తమ మేలు కొరకే అవసరమనే సంగతిని గ్రహింపచేయ

కలుగుతారు. ఈ యథార్థ సత్యాన్ని అన్ని దేశాల్లోని సోషలిస్టులు 2 వ అంతర్జాతీయ సంస్థకు చెందిన జర్మన్, బ్రిటిష్, ఫ్రెంచి నాయకులందరూ పేరుకుమాత్రం అంగీకరించి ఆచరణలో పెడత్రోవ పట్టిన అవకాశవాదులుగా తయారైనారు. ఎప్పుడో భవిష్యత్తులో నిర్మింపబడబోయే స్వర్గరాజ్యంమీదనే దృష్టి పెట్టుకొని, అటువంటి భవిష్యత్తును సాధించుటకై మధ్యవున్న క్లిష్టకాలంలో వెంటనే నెరవేర్చవలసిన కర్తవ్యాల మీద దృష్టిని కేంద్రీకరించకపోవడంవల్ల ఇటువంటి సంకుచిత అభిప్రాయం కలుగుతున్నది. ఆచరణలో ఈ అభిప్రాయం బూర్జువావర్గంతో 'సమాజశాంతి' కొరకు రాజీపడే మార్గాలకు దారితీస్తుంది. యుద్ధ ఫలితంగా కొద్దిమంది కోటీశ్వరులు ఇంకా ఎక్కువగా బలిసి, మదించి ఉన్నప్పుడు ఎప్పుడూ కనివిని ఎరుగని దరిద్రమునకులోనయి ప్రజలందరూ క్రుంగిపోతున్న పరిస్థితులలో బూర్జువావర్గంతో రాజీకి దారితీసేపంథా కార్మికవర్గానికి ద్రోహంచేసే మార్గమే అవుతుంది.

సోషలిస్టు విజయంకోసం జయప్రదమైన పోరాటం సాగించుటకు ముఖ్యంగా ఈ పల్లెప్రాంతాల్లోనే కమ్యూనిస్టుపార్టీలు కృషిచేసి, బూర్జువావర్గాన్ని కూలద్రోయుటకై కార్మికవర్గం బ్రహ్మాండమైన త్యాగమునకు తయారగునట్లు కార్మికవర్గానికి గొప్ప చైతన్యాన్ని కలుగజేయవలసి యున్నది. ఈ త్యాగములవల్లనే కార్మికవర్గం అధికారానికి స్థిరత్వం రాగలదు. ఎందుకంటే, పీడిత ప్రజలనందరిని సంఘటిత పరచి నడుపగల సామర్థ్యం కార్మికవర్గానికి కలిగినప్పుడే, నాయకత్వం వహించవలసిన కార్మికవర్గం అద్భుతమైన ధైర్యసాహసములను, త్యాగదీక్షను ప్రదర్శించ గలిగినప్పుడే కార్మికవర్గ నియంతృత్వం సాధ్యపడుతుంది. రెండవ విషయం - విజయం రావాలంటే, దోపిడిగాండ్రకు దెబ్బతగిలి, పీడిత ప్రజలైన పల్లెలలోని కష్టజీవుల పరిస్థితులు కొంతవరకైనా అభివృద్ధి చేయవలసివుంటుంది. అప్పుడే పల్లె ప్రజలందరూ పారిశ్రామిక కార్మికులను బలపరచి, పట్టణాలకు అవసరమైన ఆహార పదార్థములను సప్లయి చేస్తారు.

8. ఎంతో కాలంనుంచి పెట్టుబడి విధానం క్రింద దుర్భర పరిస్థితులలో ఉంచబడి అనైక్యత బానిసత్వములలో క్రుంగిపోయిన వ్యవసాయ కూలీలను సంఘటితపరచి విప్లవ పోరాటమునకు తయారుచేయాలంటే, పల్లెప్రాంతాల్లో అన్నివైపులనుంచి బయలుదేరే సమ్మె పోరాటములను బలపరచుటకు ప్రత్యేక శ్రద్ధవహించవలసియుంటుంది. రష్యాలో జరిగిన 1905, 1917 విప్లవాలు ఈ విషయాన్ని స్పష్టపరుస్తున్నవి. జర్మనీలోని ఇతర పెట్టుబడిదారీ దేశాల్లోని అనుభవంగూడా ఈ విషయాన్నే ధ్రువపరుస్తుంది. పల్లెప్రాంతాల్లో వచ్చే సమ్మె పోరాటాలద్వారానే కొన్ని పరిస్థితులలో చిన్నరైతులు తప్పనిసరిగా ఈ పోరాటాలను సాగించవలసియుంటుంది గూడా. పల్లెజనంలోని సోమరితనాన్నుంచి నిద్రమేల్కొల్పి వారికి వర్గచైతన్యం కలిగించి వర్గ సంఘటన ఎందుకు అవసరమో గ్రహించునట్లుచేసి, పట్టణ కార్మికులతో వారు ఎందుకు ఐక్యంకావాలో కూడా స్పష్టపరచగలను.

ఈ విషయాన్ని అంగీకరించని 2 వ అంతర్జాతీయ సంస్థలోని సోషలిస్టులను కమ్యూనిస్టుఇంటర్నేషనల్ తీవ్రంగా ఖండిస్తుంది. వీరినేకాదు. ఈ అంతర్జాతీయ సంస్థనుంచి ఉపసంహరించుకున్న 3 యూరపియన్ పార్టీలలోని సోషలిస్టులనుగూడా ఖండిస్తుంది. ఎందుకంటే వీరు పల్లె

ప్రాంతాల్లోవచ్చే వ్యవసాయకూలీల పోరాటములయందు తటస్థవైఖరీ, ఉపేక్ష వహించుటమే గాక, కాట్స్కీవలె ఈ పోరాటములను, ఉత్పత్తి ధ్వంస మవుతుందనే పేరుతో, వ్యతిరేకిస్తారుగూడా. కాని ఎన్ని కార్యక్రమాలైనాసరే, పవిత్ర వాగ్దానాలైనాసరే, ప్రత్యక్ష కార్యాచరణ లేనప్పుడు, ఎందుకూ పనికిరాకుండాపోతాయి. అందువల్ల కమ్యూనిస్టు నాయకులు, కార్మిక నాయకులు ప్రపంచంలో అన్నిటికంటె కార్మికవిప్లవమును వృద్ధిచేయుటయే అన్నిటికంటె ప్రధానవిధిగా భావించి మహత్తర త్యాగాలకు పూనుకొని కృషిచేయడంవల్లనే ఈవిషయం రుజువు కాగలదు. వినాశనంనుంచి, సామ్రాజ్యవాదయుద్ధంనుంచి, దరిద్రంనుంచి, ఆకలినుంచి తప్పించుకొనుటకు ఇంతకంటె మరొక విముక్తిమార్గంలేదు.

మరొక ముఖ్యవిషయం. పాత సోషలిస్టు నాయకులు, కార్మిక 'ప్రభువులైనవారు' ప్రజలలో వడివడిగా అభివృద్ధిపొందుతున్న విప్లవ చైతన్యాన్నిచూచి వారుగూడా కమ్యూనిజమును అంగీకరించుట, కమ్యూనిస్టు పక్షంవైపుకు వచ్చుటగూడా జరుగుతుంది. కార్మికవర్గ ప్రభుత్వంయందు వీరికిగల భక్తినీ, విప్లవ చైతన్యమూ, విప్లవపోరాటం త్వరగా అభివృద్ధి పొందుతున్న రంగాలలో బాధ్యతగల స్థానాలను ఆక్రమించుటకు వీరికిగల శక్తి సామర్థ్యములనూ, భూస్వాములు, బూర్జువావర్గం పెద్ద రైతులు చేసే నిరోధకచర్యలు భయంకర రూపందాల్చి, రాజీమార్గాన్ని అనుసరించే సోషలిస్టుకు విప్లవమార్గంలో నడిచే కమ్యూనిస్టుకు గల వ్యత్యాసం వడివడిగా బట్టబయలు అవుతున్న రంగాల్లో స్థానాలు ఆక్రమించుటకు గల అర్హతనూ గట్టిగా నిరీక్షించవలసియున్నది.

9. పల్లెప్రాంతాల్లో వీలైనంత త్వరగా వ్యవసాయకూలీలయొక్క, బీదరైతులయొక్క ప్రతినిధులతోగూడిన సోవియట్లను నిర్మించుటకు కమ్యూనిస్టుపార్టీ పూనుకోవాలి; పీడిత ప్రజలతో సంబంధంపెట్టుకొని వ్యవసాయకూలీల సమ్మెలను బలపరచుటవల్లనే సోవియట్లు స్థిరపడి చిన్నరైతుల పోరాటాలు వృద్ధికాని పరిస్థితులలో, భూస్వాములయొక్క పెద్దరైతులయొక్క దోపిడిభారం ఎక్కువగుటవల్ల వ్యవసాయకూలీలకు తగినంత చైతన్యంలేక నిర్మాణరహితంగా ఉన్నప్పుడు, పట్టణ కార్మికులయొక్క వారి సంఘాలయొక్క దోహదం లేనప్పుడు గ్రామాల్లో సోవియట్లను నిర్మించుట కష్టతరమవుతుంది. అటువంటి ప్రాంతాల్లో చిన్నచిన్న కమ్యూనిస్టు సెల్లులను ఏర్పాటుచేసి, తీవ్రమైన ఆందోళనద్వారానూ కండ్లకు కట్టినట్లుండే చక్కటి ఉదాహరణలతో కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారంచేసి పట్టణ కార్మికులు విరివిగా పల్లెప్రాంతాలకు వచ్చునట్లు ఏర్పాట్లుగావించి దీర్ఘకాలసన్నాహంపై సోవియట్లను నిర్మించవలసియుంటుంది.



# బర్మా బానిసత్వానికి లేబర్ సామ్రాజ్యవాదుల వ్యూహం

— ఎ. లియోనిడోవ్

## I

బ్రిటిష్ సామ్రాజ్యంలో వున్న వివిధ దేశాలకూ తాము స్వాతంత్ర్యాన్ని ప్రసాదించామని బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకులు గొప్పలు చెప్పుకోవడం పరిపాటయింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం అంటూ యింకా లేనేలేదని దానిని తాము "రద్దు" చేశామనీ చెప్పుకొంటున్నారు. ఈ విషయాన్ని గురించే ప్రస్తుత బ్రిటిష్ మంత్రులూ, రాయబారవర్గ ప్రతినిధులూ, యితర ప్రచార శాఖకు చెందిన ఉద్యోగులూ మాటిమాటికి చెప్పుకొంటూ తమయొక్క ఉదార స్వభావాన్ని గురించి డబ్బా వాయించుకొంటున్నారు. ఇండియా పాకిస్తాన్‌లకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించామనీ, సామ్రాజ్యంనుండి బర్మా బయటకు వెళ్ళేందుకు అనుమతి నిచ్చామనీ, పాలస్తీనాపై తమకున్న మాండేటరీ అధికారాన్ని వదులుకున్నామనీ, ఈజిప్టు, ఇరాక్‌ల స్వాతంత్ర్య ప్రతిపత్తిని ధృవపరచామని, యింకా ఆఫ్రికాలోనూ, సెంట్రల్ అమెరికాలో వున్న ప్రాంతాలను మాత్రమే తమకు ఉంచుకొన్నామనీ - ఈవిధంగా పాత వలస సామ్రాజ్యాన్ని తుదముట్టించి, శతాబ్దాలు తరబడిగా బ్రిటన్ అనుసరిస్తున్న ఒక ప్రధాన పాలసీలో ఒక తీవ్రమైన మార్పును తెచ్చామని లేబరునాయకులు గట్టిగా చెప్పుకొంటున్నారు.

బ్రిటిషు సామ్రాజ్యచరిత్రలో యింతవరకన్నడు చేయనంతటి ఘోరమైన మోసాన్ని యిప్పుడు లేబరు నాయకులు చేస్తూ దాన్ని కప్పిపుచ్చుకొనేందుకే వలసదేశాలను బానిస సంకెళ్ళనుండి విడిపించామని చెప్పుకోవడంలోని అంతరార్థం. అసలు జరుగుతున్న విషయం.

మిది: తమకు ముందు పరిపాలిస్తున్న కన్సర్వేటివ్‌లనుండి ప్రపంచంలోకెల్లా పెద్ద వలస సామ్రాజ్య పరిపాలనను లేబరు నాయకులు తమ హస్తగతం చేసుకొన్నారు. ఆ సామ్రాజ్యాన్ని బ్రిటిషు గుత్తపెట్టుబడిదారుల క్రిందనే ఏవిధంగానైనా అట్టేపెట్టడానికి ఆజ్ఞలను తీసుకొన్నారు. అందుకోసం ఆదేశాలన్నింటినీ తమ క్రిందనే వుంచుకొనేందుకు నూతన పద్ధతులను నూతన పన్నాగాలను పన్ని, వాటిని ఖచ్చితంగా లేబరు నాయకులు అమలు జరుపుతున్నారు. విషాదచ్ఛాయలతో తూట్లుపడిఉన్న బ్రిటిష్ సామ్రాజ్యానికి మెరుపురంగు పూశారు. నూతన సామ్రాజ్యవాద టెక్నిక్‌తో నూతన పరిస్థితులకు అనుగుణంగా దానికి తేనెపూతపూశారు. అంతేకాని వలసదేశాలలోని ప్రజానీకాన్ని ఆర్థికంగా దారుణంగా దోపిడి చేసే విధానాన్ని వారు ఎంతమాత్రమూ త్యజించలేదు. ఈ దేశాలను తన ప్రపంచవ్యూహానికి వినియోగించుకొనే ఉద్దేశ్యాన్ని వారు ఎంతమాత్రమూ మానుకోలేదు. ఆ దేశాలలో ప్రజలను "విభజించి పరిపాలించే" విధానానికి వారు స్వస్తి చెప్పనూ లేదు. వారు చేస్తున్నదల్లా తమకు ముందున్న కన్సర్వేటివ్‌లు అనుసరించిన పద్ధతులనే కొంతమార్చి దానిని ఆధునిక పరిస్థితులకు తగినట్లు సవరణ చేయడం మాత్రమే. సామ్రాజ్యవాద దోపిడికి నూతనరూపాలను కల్పించారు. వలసదేశాలను దోపిడీచేసేందుకు కొత్తలేబరువిధానాన్ని తయారుచేశారు.

వలస దేశాలలో జాతీయ విముక్తి ఉద్యమాలు ఉవ్వెత్తుగా వెల్లివిరుస్తున్న యీ పరిస్థితులలో వీరు అనుసరిస్తున్న పద్ధతులకు బర్మాలో లేబరు ప్రభుత్వం ప్రస్తుతం అనుసరిస్తున్న విధానం ఒక చక్కటి ఉదాహరణ.

## II

1947 అక్టోబరు 17 వ తేదీన జరిగిన ఆంగ్లో బర్మా ఒడంబడిక ప్రకారం బర్మాయొక్క స్వాతంత్ర్యాన్ని బ్రిటన్ గుర్తించి, ఆదేశాన్నుండి తనసైన్యాలను ఉపసంహరించుకొన్నది. బర్మా భూభాగంపై తన కెలాంటి హక్కూ ఇంకెన్నడూ ఉండదనికూడా ప్రకటించింది. ఇండియా పాకిస్తాన్‌లవలెగాక బర్మా అధినివేశ ప్రతిపత్తితోనే సంతృప్తిపడక బ్రిటిష్ కామన్‌వెల్తుతో వున్న సంబంధాలనన్నింటినీ సూత్రప్రాయంగా పూర్తిగా తెగతెంపులు చేసుకొన్నది. బర్మా తన స్వాతంత్ర్యాన్ని సంఘటిత పరచుకొనేందుకు తాము అన్నివిధాలా సాయపడతామనికూడా బెవిన్‌మంత్రి బ్రిటిష్‌ప్రభుత్వం తరఫున నమ్మకంగా వాగ్దానంకూడా చేశాడు. ఇందుకు బదులుగా బర్మా యీ క్రింది "కొద్దిపాటి" పనులు చేయడానికి అంగీకరించేటట్లు చేశారు

వెనకటికాలంలో బర్మా బ్రిటన్‌కూ, ఇండియాకు యివ్వవలసిన అప్పుతాలూకూ పది కోట్ల పౌన్లను చెల్లించడానికి ఒప్పుదల కావడం; బర్మాలోవున్న బ్రిటిష్ పరిశ్రమలనూ, ఆస్తులను జాతిపరం చేసే పక్షంలో "న్యాయమైన పరి

హారం" చెల్లించేందుకూ; బర్మా నూతన సైన్యాన్ని తర్ఫీదు చేసేందుకు బ్రిటన్ సాయంతప్ప తదితర విదేశాల సాయం తీసుకోకుండా వుండేటట్లూ బర్మా ప్రభుత్వాన్ని ఒప్పుదల అయింది.

బర్మా రాజధానినగరమైన రంగూన్‌లో "టెక్నికల్ సలహా" కోసమని బ్రిటిషు మిలిటరీ రాయబారవర్గ మొకటి ఉంచబడింది. బర్మాకూ బ్రిటన్‌కూ మధ్య జరిగిన ఒడంబడికలో కొన్ని పరిస్థితులలో బర్మాకుగాని యితర బ్రిటిషు కామన్‌వెల్తు రాజ్యాలకూ గాని సహాయం చేసేందుకు బ్రిటిషుసైన్యాలు అవసరమైన సహాయాన్ని బర్మానుండి పొంద వచ్చునని ఉంది. అంతే కాదు. ఆసందర్భాలలో బ్రిటిషు సైన్యాలు బర్మాలో నిరాటంకంగా ప్రవేశించేందుకూ, బర్మా ఓడరేవులనూ, విమానాశ్రయాలనూ ఉపయోగించుకొనేందుకూ హక్కును కలిగిస్తూ గ్యారంటీ యివ్వబడింది.

బర్మా, బర్మాప్రజలకు అప్పజెప్పబడిందని లేబరుప్రభుత్వం ప్రకటించింది. సర్ స్టాఫర్డు క్రిప్సు యీసందర్భంలో యిలా అన్నాడు:

"కల్లోల ప్రపంచానికి ఆదర్శంగా వుండేటట్లు శాంతియుతంగా అధికారాన్ని హస్తగతంచేసిన యీ ఘనకార్యానికి మేము న్యాయంగా గర్వపడుతున్నాం."

## బ్రిటన్ యుద్ధానంతర వ్యూహంలో బర్మాకున్న స్థానం

కాని యిదిజరిగిన వెంటనే బర్మాను "బయటకు కనపడకుండా" బానిస రథచక్రాలకు తగిలించడానికి రహస్య కార్యకలాపాలు ప్రారంభమయ్యాయి.

బ్రిటనూ ఫ్రాన్సూ రెండూ కలిస్తే ఎంతో అంత పెద్దవైశాల్యంగలదేశమో అంత పెద్ద బర్మాది. బర్మా చాల సారవంతమైనప్రదేశం. ఇంతపెద్ద సారవంతమైన వంగదేశం క్షేత్రం వనులకు నేదృష్టి బ్రిటిష్ పాలకవర్గాలకు ఎన్నడూ లేదు. అట్లీ - బెవిన్ ప్రభుత్వ విదేశాంగ విధానానికి కీలకమైన ఇంపీరియల్ జనరల్ స్టాఫ్ యుద్ధానంతర రహస్యప్లానులో బర్మాకు ముఖ్యస్థానం యివ్వబడింది. "హిందూమహాసముద్రంలో గొప్ప త్రికోణ వ్యూహంలో" బర్మా ఒక అంతర్భాగం. ఈ త్రికోణానికి ఒకవైపున దక్షిణాఫ్రికా యూనియన్, ఆఫ్రికాలోని బ్రిటిష్ వలసప్రాంతాలూ, సూడాన్, ఈజిప్టు, అరేబియా ద్వీపకల్పమూ, ఇండియావరకూవున్న మధ్యప్రాచ్యం యావత్తూ ఉన్నాయి. మరొకవైపున - తూర్పుపక్కన - బర్మా, సయాం, మలయా, ఇండోనీషియా, ఆస్ట్రేలియా ఉన్నాయి. 1948 జూన్ 16 వ తేదీన బ్రిటనులో కరుడుగట్టిన టోరీవర్గాలకూ, బ్రిటిష్ మిలటరీ వర్గాలకూ ప్రాతినిధ్యం వహించే "డైలీ మెయిల్" పత్రిక బర్మాలో జరుగుతున్న సంఘటనలనుగురించి ప్రస్తావించుతూ "హిందూ మహాసముద్రంయొక్క త్రికోణలూ" దానిచుట్టూవున్న దేశాలూ బ్రిటన్‌కు ఎంత అవసరమో తెలుపుతూ యిలా వ్రాసింది:

"ఒక స్థానం మరొకస్థానంపై ఆధారపడిఉంది. ఒకటి పోయిన పక్షంలో యావత్తు విధానానికీ ముప్పు వాటిల్లుతుంది."

అయితే బర్మా బ్రిటిష్ సామ్రాజ్యానికి మరొకవిధంగా - యింకా ముఖ్యంగా విని

యోగపడే అవకాశం ఉంది. బ్రహ్మాండమైన ప్రకృతిసంపదలు గలిగిన బర్మా గత మూడు దశాబ్దాలనుండి సామ్రాజ్యవాదుల పెట్టుబడు లకు బహుచక్కటి ప్రదేశంగా వినియోగ పడుతోంది. బ్రిటన్ ఇండియాలోనూ, మలయాలోనూ పెట్టిన పెట్టుబడులకంటె బర్మాలో పెట్టినది చాలతక్కువ అయినప్పటికీ బర్మాలో గడించే లాభాలే ఎక్కువ.

## బర్మా బ్రిటిష్ పెట్టుబడిదారుల సొంత ఆస్తి

బర్మాలోవున్న పెద్ద పెట్టుబడిదారీ కంపెనీలు తాము మొదటగా పెట్టిన పెట్టుబడు లను కొద్ది సంవత్సరాలలోనే – కొన్ని సంవత్సరాలలో కొన్ని మాసాలలోనే తిరిగి రాబట్టుకోవడం సర్వసాధారణమైపోయింది. ఉదాహరణకు స్టీల్ బ్రదర్స్ అండ్ కంపెనీ ఆరు సంవత్సరాలలో తాను పెట్టిన పెట్టు బడిలో నూటికి 231 చొప్పున డివిడెండ్లను పంచిపెట్టింది. ఇదికాక అదనంగా నూటికి 212 చొప్పున పెట్టుబడివాటాలను కొత్తగా జారీ చేసింది. అంటే మొత్తంమీద యీకంపెనీ ఆరుసంవత్సరాలలో నూటికి 447 చొప్పున లాభాలు గడించింది. ఆంగ్లో బర్మా టిన్‌కంపెనీ తనవ్యాపారాన్ని ప్రారంభించిన 5 సంవత్సరాలకు నూటికి 150 చొప్పున డివిడెండ్లను వాటాదార్లకు పంచిపెట్టింది. 1931—35 లోనే బర్మా ఆయిల్ కంపెనీ తన వాటాదార్లకు డివిడెండ్ల రూపంలోనూ పెట్టుబడి వాటాల రూపం లోనూ నూటికి 113 చొప్పున చెల్లించింది. 1947 లో దాని ఆదాయం మూడురెట్లు పెరిగింది. దక్షిణ బర్మాలో లోహపుగను లలో పనిచేసే మాచీమైన్స్ లిమిటెడ్ కంపెనీ అయిదు సంవత్సరాలలో (1936-40)లో నూటికి 472.5 చొప్పున డివిడెండ్లను వాటా దార్లకు పంచిపెట్టింది. అంటే ప్రతిసంవత్స రంలోనూ వాటాదారులకు తాము మొట్ట మొదట పెట్టిన పెట్టుబడితో సమానంగా ప్రతిసంవత్సరం లాభం వచ్చిందన్నమాట.

ఇల్లాంటి లాభాలు మరే వలసదేశంలోనూ రాలేదు. బర్మా ఇంగ్లండుకు ఒక బంగారపు గనిలాంటిది. ప్రపంచంలో బ్రిటన్‌కుతప్ప మరెవ్వరికీ బర్మాలో యీవిధంగా లాభాలు గడించడానికి అవకాశం లేదు. బర్మాలో టెక్నికల్‌గానూ మరోవిధంగానూ ఏమాత్రం పెట్టుబడిని వినియోగించకుండా బ్రిటన్ ఆదేశాన్నుండి విపరీతంగా లాభాలు గడించు కొంది. ఈ కారణంవల్లనే బ్రిటిషు గుత్త పెట్టుబడిదారులలోవున్న చిన్న అగ్రకూటమికి బర్మా దోపిడిచేయడానికి ఒక బంగారపుగని అయింది. బర్మా పెట్టుబడులలో బ్రిటన్‌లో చాల పలుకుబడిగలిగిన కొద్దిమంది గుత్తపెట్టు బడిదారులకూ, వారి రాజకీయ అనుయాయు లకు మాత్రమే భాగాలు కల్పించబడ్డాయి.

నిజం చెప్పాలంటే, యీ రోజున బర్మా అంతా బ్రిటన్‌లో 5 పెద్దకంపెనీల స్వాంతసొమ్ము అని చెప్పొచ్చు. బర్మాలోని సహజసంపద, రవాణా, వాణిజ్య వ్యాపారాలూ, ఆర్థికం–మొదలు గల వాటిలో అత్యధికభాగం యీ అయిదు కంపెనీలే తమ మధ్య పంచుకొంటాయి. బర్మాలోవున్న బ్రిటిష్ పెట్టు బడులూ, ఆస్తులూ–దాదాపు అంతా యీ అయిదు కంపెనీల స్వాధీనంలోనే ఉన్నాయి. యీ పెట్టుబడుల మొత్తం షుమారు

50, 000, 000 పౌన్లు ఉంటుంది. ఈ కంపెనీలు ప్రతి పరిశ్రమ లోనూ ప్రతి ఫ్యాక్టరీని కంట్రోలు చేస్తాయి. బర్మాయొక్క పెట్టుబడిదారీ ఆర్థిక విధానమంతా దాదాపు యీ అయిదు కంపెనీల సొంత ఆస్తిగానే పరిగణించవచ్చు. బర్మాలోవున్న ఒక కోటీ 70 లక్షల తాడిత పీడిత ప్రజానీకానికి వీరే నిజమైన దొరలు.

## III

స్టీల్ బ్రదర్సు అండ్ కంపెనీ అనే లండన్ ఫరమ్‌కు ఆసియా ఖండమంతటా శాఖలున్నాయి. బర్మాలో రెవిన్యూకు మూలాధారమైన బియ్యం వ్యాపారాన్నంతటినీ యీ కంపెనీయే కంట్రోలు చేస్తుంది. బర్మాలోని అత్యధిక సంఖ్యాక ప్రజలకు బియ్యమే ప్రధాన ఆహారం. ప్రపంచంలోకెల్ల బియ్యం ఎగుమతి దేశాలలో బర్మాదే పైచేయి. బర్మాలోని వరిపంటపండే పొలాలు ఇండియా పొలాలు కంటె $1\frac{1}{3}$ రెట్లు ఎక్కువ సారవంతమైనవి. బర్మాచేసే మొత్తం ఎగుమతులలో దాదాపు సగభాగం బియ్యందే ఉంటుంది. భారతదేశంలోని బీదప్రజలు చాలమంది తమ ఆహారం కొరకు బర్మా బియ్యంపైనే ఆధారపడతారు.

## విదేశీ కంపెనీల పెత్తనం

బర్మాలోని రైతాంగాన్నీ, ఇండియాలోని కష్టజీవులనూ దారుణంగా దోచుకోవడంలో స్టీల్ బ్రదర్సు అండ్ కంపెనీ ప్రధానపాత్ర వహిస్తుంది. బ్రిటన్‌లో అమితంగా లాభాలు గడించే కంపెనీలలో యిదొకటి. 1943 లో బియ్యం వ్యాపారంలో వచ్చిన విపరీతలాభాలు గడించినవాటిల్లో యీకంపెనీ ఒకటి. ఆ సంవత్సరంలోనే అనేక లక్షలప్రజల ప్రాణాలను బలిగొన్న ఘోరమైన బెంగాల్ కరువు రావడానికి యీ కంపెనీ దురాశతోకూడిన లాభదృష్టి ఒక ముఖ్యకారణంగా పరిగణించవచ్చు. ఈ కంపెనీకి బర్మాలో అనేక బట్టల మిల్లులు, పిండి మిల్లులూ, టేకువ్యాపారం రబ్బరుతోటలూ ఉన్నాయి. ఈ కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ అయిన సర్. జాన్ రైట్ బర్మా ఛాంబర్ ఆఫ్ కామర్సుకు (వాణిజ్య సంస్థ) అధ్యక్షుడు. ఇతను బర్మా సెనేట్‌లో సభ్యుడు. ఇతడికి ప్రస్తుత బర్మా ప్రభుత్వంలో పెద్ద పలుకుబడివుంది.

లండన్‌లోని వాలెస్ బ్రదర్సు అండ్ కంపెనీకి ఉపశాఖఅయిన బాంబే - బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్ బర్మా టింబరు పరిశ్రమనంతటినీ కంట్రోలు చేస్తుంది. టేకు కర్ర ఉత్పత్తిలో బర్మాకు ప్రపంచంలోనే అగ్రస్థానం వుంది. బర్మా టేకుకర్ర ఎగుమతులలో మూడింటరెండువంతులు బొంబాయి-బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్, స్టీల్ బ్రదర్స్‌ల స్వాధీనంలోనే ఉంటుంది. దేశంలోని ప్రాంతాలకు ప్రాంతాలే యీ కార్పొరేషన్ ఏజెంట్ల ప్రత్యక్ష పెత్తనం క్రింద ఉన్నాయి.

ఐరావతీనది బర్మాకు ప్రాణనాడిలాంటిది. ఈనది బర్మాలో ఉత్తరాన్నుండి దక్షిణానికి ప్రవహిస్తూ దేశాన్ని రెండుగా చీలుస్తుంది. షుమారు వెయ్యిమైళ్ళ పొడవున నౌకాయానమునకు చక్కగా వినియోగపడుతుంది. దాదాపు బర్మాలోని బియ్యమూ, టేకు కర్రా అంతా యీనదిగుండానే ఎగుమతి అవుతాయి. చివరకు యీ నదిగూడా బ్రిటిష్ కంపెనీఅయిన ఐరావతీ ఫ్లోటిల్లా కంపెనీ

కొక్క సొంతఆస్తి అయిపోయింది. యుద్ధానికి ముందు యీ కంపెనీకి యీనదిలో తిరిగేందుకు 600 పొగఓడలున్నాయి. వాటిలో సంవత్సరానికి 70 లక్షలమంది ప్రయాణం చేస్తారు. గత శతాబ్దంలో బర్మాను విదేశాలు ఆక్రమించుకోడానికి యీ ఐరావతీ - ఫ్లోటిల్లా కంపెనీ ముఖ్య కారణమైంది. ఈ కంపెనీకి సంబంధించిన ఓడలే ప్రజలను హింసించి బానిసత్వంలో ముంచడానికి బ్రిటిష్ సైన్యాలను రవాణాచేశాయి. సముద్రంలోని ఓడమార్గాలూ, ఆకాశాన విమాన మార్గాలుకూడా యీ కంపెనీ స్వాధీనంలోనే ఉన్నాయి. 1865 నుండి ఐరావతీ-ఫ్లోటిల్లా కంపెనీ తన క్రిందనున్న రవాణా గుత్తవ్యాపారాన్నంతా ఖచ్చితంగా బర్మా ఆర్థిక విధానాన్ని సామ్రాజ్యవాదుల లాభాలు నిమిత్తం ఉపయోగపడటానికి వినియోగించింది.

## బర్మా లోహపు సంపదంతా ఇంగ్లీషువారి ఆధీనమే

బర్మాకు కావలసినంత తగరం, వెండి, సీసం, జింకూ, టంగ్‌స్టాన్, రాగి, యింకా యితరలోహాలు ఉత్పత్తిఅయ్యే గనులున్నాయి. దాదాపు యీ అమూల్యమైన లోహసంపదంతా నాలుగో బ్రిటిష్ కంపెనీ అయిన బర్మా కార్పొరేషన్ లిమిటెడ్ స్వాధీనంలో ఉంది. దేశంయొక్క పశ్చిమభాగంలోవున్న బాడ్విన్ గనులలో పనిచేస్తున్న 13 వేల కార్మికులూ అర్థ బానిసలనే చెప్పాలి. బర్మాలోఉన్న లోహసంపదపై బర్మా కార్పొరేషన్‌కున్న గుత్తాధికారం, పొరుగు దేశాలైన మలయాలోని బ్రిటిష్ కంపెనీలను కలుపుకుంటే అంతర్జాతీయంగా అనేక లోహాలలో బ్రిటన్‌కు పెద్ద గుత్తాధికార స్థానం ఉంది.

బర్మా ఆయిల్ సంపదంతా బ్రిటిష్ కలోనియల్ కంపెనీలన్నింటికంటే బలవత్తరమైన బర్మా ఆయిల్ కంపెనీ స్వాధీనంలో ఉంది. బర్మాలోని ఆయిల్ పరిశ్రమతో యీకంపెనీకి 60 యేండ్లనుంచీ సంబంధం ఉంది. అప్పటినుండి యిప్పటికి బర్మాలోని ఆయిల్ ఉత్పత్తి 130 రెట్లు పెరిగింది. వాటాదార్ల లాభాలుకూడా అదేరేటున పెరిగింది. బర్మా ఆయిల్ కంపెనీ దేశంలోవున్న కంపెనీలలోకెల్లా పెద్దది. ఈ కంపెనీలో ఇండియా బర్మాలలో 45000 మంది ఆపరేటివ్‌లూ, ఆఫీసు వర్కర్లూ, వ్యాపార ఏజెంట్లూ పని జేస్తారు. ఇండియాలో బర్మా ఆయిల్ కంపెనీకి గుత్తవ్యాపారులైన తాతా కుటుంబంతో సంబంధంఉంది. తాతాకంపెనీ ఇండియాలో బ్రిటిషు పరిపాలనకు మూలస్తంభంగాఉండేది. ఇప్పుడేమో నెహ్రూ ప్రభుత్వానికి బాసటగా నిలబడి పనిచేస్తోంది.

**బర్మాలోని బ్రిటిష్ అధికారులు బర్మా ఆయిల్ కంపెనీ అనుమతి లేనిదే రాజకీయంగా గానీ, ఆర్థిక, మిలిటరీ రీత్యాగాని యేఒక్క శాసనం యింతవరకు చేయలేదు. బ్రిటిష్ పరిపాలన యంత్రంలోని అన్ని శాఖలలోనూ యీ కంపెనీకి నమ్మకమైన ఏజెంట్లున్నారు.**

**ఈ అయిదు పెద్ద బ్రిటిష్ కంపెనీలూ (యింకా చిన్నవిగాక) షుమారు ఒక శతాబ్ద కాలం నుండి బర్మాప్రజల పెత్తనం చెలాయిస్తూ, వారిని విపరీతంగా దోపిడీచేసి పీడించుకొని తింటున్నాయి. ఈ అయిదు పెద్ద కంపె**

నీల వేశ బ్రిటిష్ పాలకవర్గం ఉంది ఈ పాలకవర్గంయొక్క పలుకే ప్రతి బ్రిటిష్ ప్రభుత్వానికీ ఒక శాసనం.

## ఈ కంపెనీలకు పాలకవర్గాలతో వున్న సంబంధాలు

బొంబే - బర్మా ట్రేడింగు కార్పొరేషన్‌ను కంట్రోలుచేసే వాలేస్ బ్రదర్స్ కంపెనీకి బ్రిటిష్ భారీపరిశ్రమలకు యజమానులైన గెస్ట్స్‌తో చాల సన్నిహితసంబంధం ఉంది. ఈ గెస్ట్స్ కంపెనీయే కన్సర్వేటివ్ పార్టీని పోషించేది. చర్చిల్‌కు ముందు ప్రధానిగా ఉండిన నెవిలీ ఛాంబర్లిన్ యీ ముఠాలో సభ్యుడు. ఈ కంపెనీకికూడా ఇండియాలోని బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనా యంత్రంలో గొప్ప పలుకుబడి ఉంది. 1916_21 లో ఇండియా వైస్రాయిగావున్న లార్డు చెమ్స్‌ఫర్డ్ యీకంపెనీకి నమ్మకమైన మనిషి.

బర్మా ఆయిల్ కంపెనీ షెల్‌గ్రూప్ ఆధ్వర్యాన నడిచే బ్రిటిష్ ఆయిల్ గుత్త వ్యాపారంలో ఒకభాగం మాత్రమే. ఈరెండు కంపెనీలు కలసి ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీని, ఇరాక్ పెట్రోలియం కంపెనీని యింకా అనేక యితర కంపెనీలను కంట్రోలుచేస్తాయి. మధ్యప్రాచ్యాన్ని తమ గుప్పెట్లోవుంచుకొని ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో బ్రిటిష్ రాజకీయ విధానాన్ని నిర్ణయించే పెట్టుబడిదారీవర్గాల చేతులలోనే బర్మా ఆయిల్ కంపెనీకూడా ఉంది. బర్మా ఆయిల్ కంపెనీకి డైరెక్టరూ, ఆంగ్లో-ఇరానియన్ కంపెనీకి చైర్మన్ అయిన సర్ విలియమ్ ఫ్రాసర్ బ్రిటిషు యుద్ధ కార్యాలయానికి పెట్రోలియమ్ అడ్వయిజరుగా కూడా పనిచేస్తాడు.

ఇరావతీ ఫ్లోటిల్లా కంపెనీకి గెస్ట్ కుటుంబంతోనూ యింకా యితర ప్రముఖ బ్రిటిష్ షిప్ బిల్డింగ్ కంపెనీలతోనూ నేరుగా సంబంధాలున్నాయి. ఈ కంపెనీ డైరెక్టరు సర్ జోసఫ్ మాక్లే పార్లమెంటులో లిబరల్ పార్టీ సభ్యుడు. ఇతడు చాంబర్ ఆఫ్ షిప్పింగ్ ఆఫ్ యునైటెడ్ కింగ్‌డమ్‌కు అధ్యక్షుడు కూడా. ఇతని తండ్రి ప్రభుత్వంలో నౌకాశాఖా మంత్రి. స్టీల్ బ్రదర్స్ పలుకుబడి గలిగిన ఆంగ్లో-ఇండియన్ ధనిక వర్గాలకు ప్రాతినిధ్యంవహిస్తాడు. ఇండియాకు బూటకపు స్వాతంత్ర్యం మాత్రమే వచ్చింది గాబట్టి యిప్పటికీ వారి ప్రాబల్యం ఇండియాలో ఏమీ తగ్గలేదు. ఈకంపెనీ చైర్మన్ జేమ్స్ కె. మిచీ నేషనల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు అధిపతికూడా.

దేశంలోని యావత్తు లోహసంపత్తిపైనా గుత్తాధికారంగల బర్మా కార్పొరేషన్ వెనక ప్రముఖ బ్రిటిష్ పరిశ్రామాధిపతులూ, రాజకీయవేత్తలూ అనేకమంది ఉన్నారు. వీరికి ఆఫ్రికాలోనూ, ఆసియాలోనూ, ఆస్ట్రేలియాలోనూ, లేటిన్ అమెరికాలోను వున్న విలువగల లోహపు గనులతో ఎన్నోవిధాల సంబంధాలున్నాయి. బర్మా కార్పొరేషన్‌తో సంబంధమున్న కంపెనీలలో యూనియన్ కార్పొరేషన్ లిమిటెడ్ ఒకటి. దీనికి అధ్యక్షుడు బ్రెండన్ బ్రాకెన్. ఇతడు ఇదివరకు చర్చిల్‌కు కార్యదర్శిగా పనిచేశాడు. బ్రిటిష్ రాజకీయవేత్తలందరికంటె యితడు చర్చిల్‌కు సన్నిహితుడు. యుద్ధకాలంలో చర్చిల్ మంత్రివర్గంలో యితడు సమాచారశాఖామంత్రిగా ఉన్నాడు. ఈ కంపెనీ డైరెక్టర్లలో లార్డు లీదర్స్ ఒకడు. ఇతడు చర్చిల్ ప్రభుత్వంలో యుద్ధరవాణామంత్రిగా పనిచేశాడు. ఈ కంపెనీలోని మరొక డైరెక్టర్ లార్డు హోర్ బీచ్. ఇతడు మంత్రివర్గంలో వలసదేశాల

శాఖకు యిదివరకు కార్యదర్శిగా పనిచేశాడు. దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ హైకమీషనరుగా కూడా పనిచేశాడు. కన్సర్వేటివ్ పార్టీ ప్రభుత్వంలో మంత్రిగా పనిచేసిన ఆలివర్ లిట్టిల్‌టన్‌కూడా యీ కోటీశ్వర్ల ముఠాకు చెందినవాడే. ఇతడు బ్రిటిష్ అభివృద్ధి నిరోధకముఠాలో చురుకుగా పనిచేసే వ్యక్తి. యుద్ధకాలంలో మధ్యప్రాచ్యంలో చర్చిల్ ఏజెంటుగా పనిచేశాడు. ఇతడు వలసదేశాలలోని సహజ సంపత్తిని దోచుకోవడంలో ఆరితేరినవాడు.

బ్రిటన్‌ను పాలించే పాలక కుటుంబాలన్నింటికీ బర్మా విపరీతంగా లాభాలు తెచ్చిపెట్టే శాశ్వతగని. ఈ దేశమే వారి స్వాధీనాలనుండి తప్పిపోతే కోటీశ్వర్ల కుటుంబాలకు తీరని దెబ్బ.

బర్మానుండి జపాను దురాక్రమణ దారులను వెళ్ళగొట్టిన తరువాత బర్మాలో ఒక బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమం ఉత్పన్నమైంది. వానిసత్వ సంకెళ్ళనుండి సంపూర్ణ స్వేచ్ఛను పొందాలని బర్మాప్రజలు గాఢంగా వాంఛించారు. ఈ ప్రబలమైన కోర్కెతో బర్మా ప్రజలంతా ఒక్కుమ్మడిగా జాతీయ ప్రజాఉద్యమం వెనుక సమీకరించబడ్డారు. ఈ బ్రహ్మాండమైన ఉద్యమాన్ని బ్రిటిష్ ఎదుర్కోవలసి వచ్చింది. అందువల్ల బ్రిటిష్ గుత్తపెట్టుబడిదారులు ఒక పెద్దకుట్రను పన్నడానికి సిద్ధమయ్యారు. దాని కనుగుణ్యంగా వారు బర్మాకు "స్వాతంత్ర్యాన్ని" ప్రసాదించవలసిందిగా లేబరు ప్రభుత్వానికి సూచన లిచ్చారు. స్వాతంత్ర్యాన్ని హక్కుగా ముందు వారికిచ్చి — ఆ తరువాత "ప్రజాతంత్ర సోషలిజం" అనే నూతన వలసదేశ విధానం సాయంతో బర్మా ప్రజలను తమ బానిసత్వంలో ఉంచుకో దలచారు.

ఈ కార్యాన్ని సాధించడానికి లేబరు పరిపాలకులు ఎలాంటి పన్నుగడలు పన్నారు?

# IV

ఇందుకోసం లేబరుప్రభుత్వం బర్మా ఆర్థిక విధానాన్ని కావాలని ఖచ్చితంగా విచ్ఛిన్నం చేయడానికి తలపెట్టింది. దేశమంతా ఛిన్నాభిన్నమైన తరువాత తమకు లొంగిపోయేటట్లు చేయడానికి లేబరు సామ్రాజ్యవాదులు అన్ని ప్రయత్నాలూ చేశారు. ఆవిధంగా థాకిన్-నూ మితవాద సోషలిస్టు ప్రభుత్వం తప్పనిసరిగా బ్రిటిషు సామ్రాజ్యవాదుల సాయాన్ని కోరడానికి సావును కల్పించారు.

1947 అక్టోబరులో జరిగిన ఆంగ్లో-బర్మా ఒడంబడిక ప్రకారం బర్మాలోని బ్రిటిష్ పరిశ్రమలను బర్మా ప్రభుత్వం జాతిపరం చేసేందుకు గల హక్కును బ్రిటన్ గుర్తించింది. అయితే యీ ఉదార స్వభావంగల క్లాజుకు ఒక షరతును జేర్చారు. బ్రిటిష్ పరిశ్రమలను జాతిపరం చేసే పక్షంలో బర్మా ప్రభుత్వం అందుకు తగిన పరిహారాన్ని నగదురూపంలో బ్రిటిష్ పెట్టుబడిదారులకు చెల్లించేటట్లు షరతును విధించారు.

## బర్మాప్రభుత్వ బలహీనస్థితి

బర్మా ప్రభుత్వ బొక్కసంలో దమ్మిడీ లేదు. దేశంయొక్క యావత్తు పరిశ్రమలూ

విదేశవ్యాపారమూ విదేశ పెట్టుబడదారుల చేతులలో ఉన్నాయి. అలాంటి పరిస్థితులలో ప్రభుత్వంవద్ద ఏమి ఉంటుంది? యుద్ధానికి పూర్వంకూడా బర్మా జాతీయ ఆదాయం ఒకకోటీ 70 లక్షల పౌన్లకు పైగా ఎన్నడూ మించలేదు. ఈరోజున ప్రభుత్వ బడ్జెట్టులో 75 లక్షల పౌన్లలోటు కనపడుతోంది. అత్యవసరమైన ఖర్చులకుకూడా డబ్బును వినియోగించే స్థితిలో ప్రభుత్వంలేదు. బర్మా జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన రైతాంగం శతాబ్దాలతరబడిగా దుర్భర దారిద్ర్యస్థితిలో మునిగిఉన్నారు. బర్మారైతులు యిప్పటికే భరించలేని బరువుతో క్రుంగిపోతున్నారు. బర్మా రైతాంగంయొక్క ఋణభారం 4 కోట్ల 70 లక్షల పౌన్లగా అంచనావేయబడింది. ఆదేశంయొక్క స్థితినిబట్టిచూస్తే యిది చాలా భయంకరమైన మొత్తం. యుద్ధంవల్ల జపాన్ ఆక్రమణవలన కలిగిన దారుణ నష్టాన్నుండి బర్మా యింకా కోలుకోనలేదు. బర్మా విముక్తిపొందిన తరువాతకూడా జపాన్ చెలామణిలోపెట్టిన డబ్బును సంవత్సరంవరకూ బ్రిటిషువారు అలాగే ఉంచి బర్మాప్రజలు దాచుకొన్న ఆఖరు దమ్మిడీతోసహా దోచుకొన్నారు.

బర్మా ప్రభుత్వం ఎంతటి దీన స్థితిలో ఉన్నదంటే అది యీ నాడు తన ఉద్యోగులకు జీతాలను సహితం చెల్లించే స్థితిలో లేదు.

వీటన్నింటికీ పైగా లేబరుప్రభుత్వం బ్రిటిషు కంపెనీల పేరుతో బర్మాపై మరింత భారాన్నివేస్తోంది.

తమ పరిశ్రమలను జాతిపరంచేసే పక్షంలో తమకు రావలసిన పరిహారాన్ని బర్మా రూపాయలలో గాక స్టర్లింగ్ పౌన్లలో చెల్లించి తీరాలని బ్రిటిష్ కంపెనీలు పట్టుబడు తున్నాయి. కంపెనీల యీ కోర్కెలను బ్రిటిష్ లేబరుప్రభుత్వం గట్టిగా బలపరచడమేగాక ఆ విధంగా చెల్లించని పక్షంలో ప్రతీకార చర్యలకు దిగుతాననికూడా బెదిరించుతోంది.

వీటన్నింటికీ తోడు ఆంగ్లో-బర్మా ఒడంబడిక ప్రకారం బర్మా బ్రిటన్‌కు 7 కోట్ల పౌన్లూ, ఇండియాకు 14కోట్ల 50లక్షల పౌన్లనూ పాతబాకీని చెల్లించడానికి ఒప్పుదల అయింది. కొన్ని దశాబ్దాల కాలం వరకూ బర్మాప్రజలు దుర్భర దాస్యాన్ని అనుభవించి నప్పటికీ యీ మొత్తాలను చెల్లించడం చాల అసంభవమైన పనే.

యుద్ధంవల్ల సర్వనాశనం అయినతరువాత సామ్రాజ్యవాద ఖూనీకోరులు తమ ఇష్టం వచ్చినట్లు బర్మాప్రజల రక్తాన్ని పీల్చుకొని తాగిన తరువాత — నేడు బర్మా తిరిగి తన ఆర్థిక విధానాన్ని పునరుద్ధరించుకోడానికి తన సహజ సంపత్తినంతటినీసమీకరించుకోవలసి ఉంది. దేశంలో పరిశ్రమలను అభివృద్ధి చేసుకోవలసిఉంది. తిరిగి తన ప్రభుత్వ బొక్కసాన్ని నింపుకొనేందుకు బర్మా తన ఎగుమతి వ్యాపారాన్ని పూర్తిగా పెంచుకోవలసి ఉంది. కాని బ్రిటన్‌తోచేసుకొన్న ఒడంబడికలో ఒకషరతేమంటే బర్మా

స్ప్రింగ్ బ్లాక్‌లో (బ్రిటన్ జబ్బు పెలామణి) నే తప్పనిసరిగా ఉండి తీరాలి. ఈ విధంగా లేబరు ప్రభుత్వం బర్మాయొక్క విదేశవ్యాపారాన్ని తనఇష్ట మొచ్చినట్లు దిద్దడానికి పూర్తి అవకాశాలను కల్పించుకొన్నది. దానితో బర్మా ఆర్థికాన్నికూడా బ్రిటన్ కంట్రోలు చేయగలగడానికి అవకాశం కల్పించుకున్నది.

## భారతీయ భూస్వాముల దారుణ దోపిడీ

అంతేకాదు; బ్రిటిష్ లేబరు ప్రభుత్వం తాను చేసుకొన్న ఒడంబడికలో మరొక దొంగ క్లాజునుకూడా దూర్చింది. అదేమంటే భారతీయ భూస్వాములతోనూ, వడ్డి వ్యాపారులతో కలసి ఒక రాజకీయ, ఆర్థిక సంధి చేసుకొన్నది.

భారతీయ భూస్వాములూ, వడ్డీ వ్యాపారులూ బ్రిటిష్ పెట్టుబడిదారులతో చేతులుకలిపి, అనేక దశాబ్దాలుగా బర్మాప్రజలను విపరీతంగా దోపిడీచేసి, లాభాలు గడించారు. బర్మాలో సాగుకు లాయికీ అయిన భూమిలో నూటికి 70 వంతులు 6 వేల భారతీయ భూస్వాముల స్వాధీనంలోఉంది.

వీరంతా బ్రిటిష్‌వారు పరిపాలన చేసే కాలంలో బర్మాకు చేరి భూములను ఆక్రమించుకో గలిగారు. వీరు లక్షలాది బర్మా రైతులను కౌలుదారులుగానూ, మక్తా రైతులుగానూ, వ్యవసాయ కూలీలుగాను మార్చారు. భారతీయ వర్తకులు ఆంగ్లో - ఇండియన్ బ్యాంకుల మద్దతుతో బర్మారైతుల వద్ద నూటికి యేడాదికి 50% చొప్పున వడ్డీలను గుంజారు. రైతులు తమ పొలాలను తాకట్టు పెట్టేటట్లు చేశారు. ఆ తరువాత ఆ తాకట్టులను అసలు అప్పులకంటె మూడు నాలుగురెట్లు అధికధరలకు అమ్మారు. ఈ విధంగా బస్తీలనుండివచ్చి అప్పులుపెట్టిన యీ వడ్డీ వ్యాపారులు భూమికి యజమానులయ్యారు.

దేశంలోకెల్లా ముఖ్య వ్యవసాయిక ప్రదేశమైన దక్షిణ బర్మాలోనే ధాన్యమంతా పండిడుతుంది. ఇక్కడున్న భూములలో అయిదింట నాలుగు వంతులు భారతీయ వడ్డీ వ్యాపారులకు చెందిఉంది.

## బర్మారైతాంగానికి నెహ్రూప్రభుత్వం తలపెట్టిన ద్రోహం

50 యకరాలకు పైగాఉన్న భూఖండాలన్నింటినీ జాతిపరం చేయడానికి నిర్ణయిస్తూ ఒక బిల్లును 1948 అక్టోబరులో బర్మా పార్లమెంటు ఆమోదించింది. కాని భారత భూస్వాములూ, వడ్డీవ్యాపారులూ, బ్రిటిషు గుత్తపెట్టుబడిదారుల వెంటనే అనుకరించడానికి వేగిరపడి "న్యాయమైన పరిహారం" తమకు చెల్లించాలని డిమాండుచేస్తున్నారు. బర్మాలో భూములుగల యీ భూస్వాములంతా బ్రిటిషు బ్యాంకులపై ప్రత్యక్షంగా ఆధారపడినవారు. వీరు కోరినట్లుగా నష్టపరిహారం చెల్లించితే 40 కోట్ల రూపాయలకు తక్కువేమాత్రమూ కాదు.

నె హ్రూ ప్రభుత్వం యీ భారతీయ దోపిడీగాండ్రకు మద్దతుగా నిలిచి వారి కోర్కెలను మన్నించాలని పట్టుబడుతోంది. ఇండియాతో ప్రస్తుతం పేచీపెట్టుకోడానికి బర్మా పాలకవర్గాలు భయపడుతున్నాయి. ఎందువల్లనంటే బర్మాచేసే ఎగుమతులలో దాదాపు సగం ఇండియాకే. బ్రిటిష్ లేబరుప్రభుత్వం తన భారత మిత్రుల (పెట్టుబడిదారీ వర్గాలు) తో కలిసి యీ విధంగా బర్మాప్రజలను బెదిరించుతోంది.

## పరిశ్రమలను జాతిపరంచేయడం వాయిదా పడింది

పరిశ్రమలన్నింటినీ జాతిపరం చేస్తామని బర్మాప్రభుత్వం ప్రజలకు వాగ్దానంచేసింది. అయితే బర్మాను తిరిగి తమ అధీనంక్రిందకు తెచ్చుకోవడానికి కుట్రలు పన్నుతున్న లేబరు సామ్రాజ్యవాదులు యీవిధంగా ఒక క్రమపద్ధతిని ఆర్థికపుటొత్తిడిని బర్మాపై తెచ్చిపెట్టి బర్మా ప్రభుత్వ పరిశ్రమలను జాతిపరంచేసే కార్యక్రమాన్ని భగ్నపరచ గలిగారు. ఆంగ్లో - బర్మా ఒడంబడిక జరిగి యిప్పటికి ఒక సంవత్సరానికి పైగా అయినప్పటికీ బర్మాప్రభుత్వం ఐరావతీ - ఫ్లోటిల్లా కంపెనీకి చెందిన ఓడలనూ, కొన్ని టింబర్ కంపెనీలను మాత్రమే జాతిపరం చేయగలిగింది. ఇంకా ఉన్న బ్రిటిష పరిశ్రమల నన్నింటినీ జాతిపరంచేసే కార్యక్రమాన్ని కాలపరిమితి లేకుండా వాయిదా వేసింది.

ఇప్పటికీ బర్మాయొక్క యావత్తు ఆర్థిక విధానమూ బర్మా ఆయిల్ కంపెనీ, బర్మా కార్పొరేషన్, బాంబే-బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్, స్టీల్ బ్రదర్స్ లాంటి రైనుట్రస్టు చేతులలోనే ఉండిపోయింది. లండన్‌లోని కోటీశ్వర్ల కోసం, దోపిడీగాండ్రకోసం బర్మా కార్మిక కర్షకులు తమ శ్రమను యింకా ధారపోస్తూనే ఉన్నారు.

బర్మా ఆర్థిక, వాణిజ్య సంక్షోభం రోజు రోజుకూ తీవ్రతరమవుతోంది. ప్రస్తుత పాలకులు దేశాన్ని ఆర్థికంగా విముక్తి చేస్తామని వాగ్దానం చేసిన కార్యక్రమమంతా కట్టిబూటకం క్రింద మారింది.

బ్రిటిష్ ఋణదాతల అనుమతి లేనిదే థాకిన్ నూ ప్రభుత్వం ఒక్క అడుగు కూడా ముందుకు వేసేస్థితిలో లేదు.

లేబరు నాయకులవద్దనుండి తమ "స్వాతంత్ర్యాన్ని" బర్మా తెచ్చుకొన్నదని చెప్పబడుతోంది. ఇప్పుడా లేబరునాయకులు తయారు చేసిన నూతన బానిస బంధనాలకే అన్ని విధాలా బర్మా ఈనాడు ముడిపెట్టబడింది.

## V

ఇక బర్మాను తమ అధీనంలో ఉంచుకోడానికి లేబరు సామ్రాజ్యవాదులు పన్నిన మరొక పన్నాగం ఏమంటే బర్మా రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించడం. దేశాన్ని

క్రమక్రమంగా ముక్కలు ముక్కలుగా విభజించడం, దేశంలో రాజకీయ అరాచకాన్ని సృష్టించడం. ఈ కార్యక్రమాన్ని అమలుజరిపేందుకు అట్లీ - బెవిన్ ప్రభుత్వం బ్రిటిష్ రాజకీయ, మిలిటరీ శాఖలలో విభిన్న కుతంత్రాలలో ఆరితేరిన పక్కా నిపుణులను సమీకరించి అందుకు వినియోగిస్తోంది.

బర్మాలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పరిపాలనకు అండగా నిలబడినవారిలో భూస్వాములూ, వడ్డీవ్యాపారులూ, నిరంకుశోద్యోగులూగాక ఇంకా వెనుకబడిన కొండ జాతుల అభివృద్ధినిరోధక నాయకులుకూడా ఉన్నారు. ముఖ్యంగా దక్షిణానున్న కెరన్లూ, షాన్సు, ఉత్తరానున్న కాచిన్లూ, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ సహజంగా వలస దేశాలలో వినియోగించే ఎత్తుగడల ననుసరించి యీ అర్ధఫ్యూడల్ ముఠానాయకులకు లంచాలుపెట్టి వారిని తమ చేతికింద పెట్టుకొని యితర బహుళ ప్రజానీకంపైకి రెచ్చగొట్టారు. ఈ కొండజాతులవారిని తమ సైన్యంలోకి రిక్రూట్ చేసుకొని వారికి మిలిటరీ, పరిపాలనాయంత్రంలో పదవులిచ్చి పోషించారు. అంతేకాదు. వారికి క్రైస్తవమత మిప్పించి వేరువేరు స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడవలసిందిగా ప్రోత్సహించారు. ఇందులో కెరన్ల కొండనాయకులలో ప్రత్యేకంగా పలుకుబడిని సంపాదించగలిగారు. కెరన్లు షుమారు 20 లక్షలమంది ఉన్నారు. కెరన్ల నాయకులలో చాలమంది ఇంగ్లండులో విద్యనభ్యసించి వచ్చారు.

## బర్మా సైన్యంలో బ్రిటిష్ ఏజంట్లు

బర్మా స్వాతంత్ర్యాన్ని బ్రిటన్ గుర్తించిన వెనువెంటనే బ్రిటిషు రహస్య కార్యాలయాల సర్వీసుయొక్క దూరప్రాచ్యశాఖ బర్మాకు కొంతమందిని ప్రత్యేక ఏజంట్లుగా పంపించింది. ఇందులోని కొంతమందిని రంగూనులో ఉన్న బ్రిటిషు మిలిటరీ రాయబార వర్గంలో నియమించారు. ఈ బ్రిటిషు మిలిటరీ రాయబార వర్గంలో వందకుపైగా ఉన్నారు. ఇందులోని ఏజంట్లు బర్మాప్రభుత్వ సైన్యనాయకులతో సన్నిహిత సంబంధాలను ఏర్పాటు చేసుకొన్నారు. ఈ సైన్యంలోని చాలమంది ఆఫీసర్లు కెరన్లు, షాన్సు, కాఛిన్లలో నుండి వచ్చిన వారే. వీరంతా ప్రజా వ్యతిరేక అభిప్రాయాలకూ, అభివృద్ధి నిరోధక ఉద్దేశ్యాలకు ఆటపట్టు. బర్మీస్ యూనియన్ ఆర్మీ కమాండర్ - ఇన్ - ఛీఫ్ యీ మధ్య వరకూ లెఫ్టినెంటు జనరల్ స్మిత్ డన్ అనే కెరన్ నాయకుడే. ఇతగాడు ఇదివరకు బ్రిటిష్ ఫీల్డుమార్షల్ స్లిమ్‌తోనూ, లార్డు మౌంటు బాటన్‌తోను కలసి పనిచేసినవాడే. కెరన్ నేషనల్ యూనియన్ అధ్యక్షుడైన సా-బా-యు-గీ వలెనే జనరల్ స్మిత్ డన్ కూడా ప్రత్యేక స్వతంత్ర కెరన్ రాజ్యం కావాలని కోరే కెరన్ ప్రత్యేకవాదుల ముఠాకు చెందిన మితవాదనాయకుడు. ఇతను కూడా తన చుట్టూ కొంతమందిని సమీకరణ చేసుకొని కూర్చున్నాడు.

విధ్వంసక చర్యలలో ఆరితేరిన మరొక రహస్యసర్వీసు ఏజెంట్ల ముఠా అదే సమయంలో లండన్‌నుండి దక్షిణ బర్మాలోవున్న కెరన్ల రాష్ట్రంలో దింపారు. లెఫ్టినెంటు - కల్నల్ తుల్లోచ్ అనే అతను ఇందులో ఒకడు. ఇతను రహస్యమిలిటరీ ఏజెంట్లలో అత్యంత ప్రముఖుడు. యుద్ధ

కాలంలో యితను కొన్ని సైన్యాలను ఆర్గనైజు చేశాడు. ఈ సైన్యాలలో తుగ్లోచి క్రింద పనిచేసిన అలెగ్జాండర్ కేంప్‌బెల్ అనే పేరుగల జర్నలిస్టును లండన్ "డైలీ మెయిల్" పత్రిక ప్రత్యేకవిలేఖరి అనే ముసుగుతో రంగూన్‌కు పంపించారు. తుగ్లోచీతో సంబంధాలను ఉంచుకొనేందుకే యితడు ఉద్దేశించబడ్డాడు.

## కెరన్ల - తిరుగుబాటుకు ఆయుధ సరఫరా

1949 జూన్ 1 వ తేదీన ఐరావతీ ఫ్లోటిల్లా కంపెనీని జాతీయం చేస్తూ బర్మా ప్రభుత్వం ఒక శాసనం చేసింది. జూన్ 17 వ తేదీన బ్రిటిష్ కామన్సు సభలో విదేశాంగ మంత్రి బెవిన్ ప్రసంగిస్తూ బర్మాలో బ్రిటన్ అనుసరించే విధానంలో "మార్పు" ఉంటుందని బెదిరించాడు.

ఇది జరిగినకొద్దివారాలతరువాతనే కెరన్లు బర్మాలో సాయుధ తిరుగుబాటును ప్రారంభించారు.

కేంద్ర బర్మాప్రభుత్వంపై వెంటనే సాయుధ తిరుగుబాటు చేయవలసిందనీ, రంగూనుపై దాడిని ప్రారంభించవలసిందనీ, ఆగ్నేయ బర్మాతీరాన్నీ కలిపి స్వతంత్ర కెరన్ రాజ్యాన్ని నిర్మించవలసిందిగా డిమాండ్ చేయమనీ కెరన్ జాతినాయకులకు బ్రిటిష్ రహస్య ఏజెంట్లు మాటనందించారు. ఆయుధాలూ, మందుగుండు సామానూ, డబ్బూ లండన్‌నుండి సాయంవస్తుందని కెరన్లకు వాగ్దానంచేశారు. ఆయుధాలను సముద్రంద్వారానూ, ఆకాశంలో విమానాలద్వారానూ కలకత్తానుంచి "జర్నలిస్టు" కాంప్‌బెల్ సాయంతో అందజేయబడుతున్నాయి. జర్నలిస్టు కాంప్‌బెల్ రంగూన్‌నుంచి కలకత్తాకు రెగ్యులర్‌గా తిరుగుతూ ఉంటాడు. ఇదేసమయంలో "కొండజాతుల ప్రజల మిత్ర సమితి" అనే పేరుతో ఒక కమిటీ లండన్‌లో ఏర్పాటుచేశారు. రహస్యంగా ఆర్థిక సహాయం చేయడానికీ తిరుగుబాటుదార్లకు రాజకీయంగా సలహాలిచ్చి నడపడానికీ యీ కమిటీ పనిచేస్తుంది.

ఈసంస్థకు పార్లమెంటులో కన్సర్వేటివ్ సభ్యుడూ, బర్మాకు మాజీ గవర్నరూ అయిన సర్ రిజినాల్డు డార్మన్‌స్మిత్ అధిపతి. యుద్ధానికి ముందు ఇతను బర్మాదేశభక్తులను అతి క్రూరంగా హింసించిన 'ప్రఖ్యాతి'ని తెచ్చుకొన్నాడు. డార్మన్‌స్మిత్ బ్రిటిష్ పత్రికలలో వ్రాస్తూ "ఆసియాలో కమ్యూనిజానికి ప్రతికూలంగాపోరాడే ప్రబలశక్తిగా" కెరన్లను గురించి ప్రచారం చేస్తున్నాడు. ఈ రహస్య "కొండజాతి ప్రజల మిత్రసమితి" కమిటీలో జనరల్ సర్ థామస్ హట్టన్ కూడా వున్నాడు. ఇతడు బర్మాలోని బ్రిటిష్ సైన్యాలకు ఇదివరకు కమాండర్‌గా పనిచేశాడు. ఇండియాలో ఛీఫ్ ఆఫ్ జనరల్ స్టాఫ్‌గా కూడా ఇతడు పనిచేశాడు. ఈ కమిటీలో పచ్చి కన్సర్వేటివ్ పత్రిక "డైలీమెయిల్" సంపాదకుడు ఫ్రాంక్ ఓవెన్ కూడా ఉన్నాడు. ఇతడు యుద్ధకాలంలో బర్మాలోని బ్రిటిష్ యుద్ధ ప్రధానకార్యాలయంలో పనిచేసినవాడు. లార్డు మౌంట్‌బాటెన్‌కు మిత్రుడు. వీరందరికీ ఇంపీరియల్ జనరల్ స్టాఫ్‌తో సన్నిహిత సంబంధం ఉంది.

"మాసైన్సు లిమిటెడ్" అనే బ్రిటిష్ కంపెనీకి సంబంధించిన గను ప్రాంతం కెరన్ల తిరుగుబాటుకు ఒక కేంద్రం. "ఇమ్యూనిట

ప్రమాదాన్ని" ఎదుర్కొనేటంతటి సమర్థత రంగూన్‌లోని కేంద్రప్రభుత్వానికి లేదని బ్రిటిష్ ఏజెంట్లసలహాలతో కెరన్ల జాతినాయకులు ప్రకటిస్తున్నారు. సామ్రాజ్యవాదులూ వారి ఏజెంట్లూ ఆశేష ప్రజానీకంయొక్క జాతీయ విముక్తి ఉద్యమాన్నికూడా "కమ్యూనిస్టు ప్రమాదం" అని పేరుపెట్టి పిలిచారనే విషయాన్ని మనం మరోసారి జ్ఞప్తికి తెచ్చుకోవాలి. బ్రిటన్ మద్దతుగల బలవత్తరమైన కేంద్రప్రభుత్వం అవసరమని కెరన్ల నాయకులు ప్రకటించారు. కెరన్లు నూతనప్రభుత్వాన్ని స్థాపించినపక్షంలో లండన్ వెంటనే ఆ ప్రభుత్వాన్ని గుర్తించుతుందని కెరన్లకు వాగ్దానం చేయబడింది.

ఉత్తరానకూడా బ్రిటిష్ ఏజెంట్లు యీ విధంగానే "ప్రత్యేకంగా ఉండాలనే ఉద్యమాన్ని" (సపరేటిస్టు మువ్‌మెంటు) కాచిన్లలోనూ, షాన్లలోనూ రెచ్చగొడుతున్నారు. బ్రిటిష్ ఏజెంట్ల పలుకుబడితో కాచిన్ నాయకులు అధికారాన్ని స్వాధీనం చేసుకోవడానికి ప్రారంభించారు. కొండ ప్రాంతాలకు చెందిన మంత్రులు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశంలో "విచ్ఛిన్నతా, నైతిక పతనమూ" ఆరంభమయ్యాయని తెలుపుతూ రంగూన్‌లో కేంద్ర ప్రభుత్వాన్ని బెదిరించుతూ ప్రకటన చేశారు.

కెరన్ జాతికి చెందిన జనరల్ స్మిత్‌డన్ నాయకత్వాన బర్మా సైన్యం యీ తిరుగుబాటును అణచలేక పోతుంది. జనవరి మాసంలో కెరన్లు రంగూన్ పరిసర ప్రాంతాలకు రాగలిగారు. రాజధాని నగరాన్ని ఉత్తర తూర్పు ప్రాంతాలనుండి వేరుపరచారు. ఈ ప్రాంతంలో సంఘర్షణ యింకా కొనసాగుతూనే ఉంది.

అభివృద్ధి నిరోధకులైన యీ ప్రత్యేక వాదుల తిరుగుబాటు మూలంగా ఏర్పడిన రాజకీయ అరాచకం ఆర్థికంగా దేశాన్ని ప్రమాదంలో ముంచుతుంది. వరిపంటబాగా పండే ప్రాంతాలనే కెరన్లు ఆక్రమించుకొన్నారు. బర్మా ఎగుమతులలో ముఖ్య స్థానాన్ని ఆక్రమించుకునే రవాణా కార్యక్రమానికి యీ మిలిటరీ సంఘర్షణలు చాల ఆటంకాన్ని కలుగజేస్తున్నాయి.

యుద్ధకాలంలో 35లక్షల టన్నుల వరకు పెరిగిన బియ్యపు ఎగుమతులు 1948 లో అందులో మూడో వంతుకు తగ్గిపోయాయి. బియ్యం ఎగుమతి వ్యాపారాన్ని కెరన్లు స్వాధీనం చేసుకోగలిగితే రంగూన్ ప్రభుత్వపు దివాళాకోరుతనం పూర్తిగా బయట పడిపోతుంది. గతసంవత్సరపు బడ్జెటు లోటు ఆ క్రిందటి యేడాదికంటె రెట్టింపు పెరిగింది. దేశంలోని కొన్ని ప్రాంతాలలో రైతులు తమ పొలాలను సాగుచేసుకోలేక పోతున్నారు. దేశాన్ని ఆర్థికంగా పునరుద్ధరించాలనీ, పునర్నిర్మించాలనే ప్రభుత్వపు రెండేండ్ల ప్రణాళిక ఆచరణలో అసాధ్యమై పోయింది.

ఈ సంవత్సరం జనవరి మాసంలో బర్మా ప్రభుత్వం బ్రిటిషువారి దయాదాక్షిణ్యానికి తలొగ్గవలసి వచ్చింది. ప్రత్యేక కెరన్ల రాజ్యాన్ని - నూతన బ్రిటిషు వలసదేశాన్ని ఏర్పాటు చేయడానికి రంగూను మంత్రులు అంగీకరించారు. కెరన్లకు ప్రత్యేక రాజ్యమే ఏర్పడితే అది చీల్చబడ్డ బర్మాలో బలమైన యూనిట్‌గా తయారు కాగలదు. ఆంగ్లో - బర్మీస్ ఒడంబడిక మీద సంతకాలు పెట్టి

నాడు ఆట్లీ - క్రిప్సులు వాగ్దానం చేసిన "బర్మాయూనియన్ స్వాతంత్ర్యం" వట్టి బూటకంగా రుజువయింది.

బర్మాలోని బ్రిటిషు పెట్టుబడిదార్ల ప్రయోజనాలకు రక్షణ కల్పించబడింది. కెరన్లు విజయంపొందిన పక్షంలో దేశంలోని వివిధప్రాంతాలలో ముఖ్యంగా ఉత్తర ప్రాంతంలో ప్రత్యేకంగా ఉండాలనే ఉద్యమాలు తప్పకుండా పెరుగుతాయి. అప్పుడే ఉత్తరాన బొంబే - బర్మాట్రేడింగ్ కార్పొరేషన్, బర్మా కార్పొరేషన్ ఏజెంట్లు తమ విచ్ఛిన్న కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నారు.

నూతనబర్మా చిన్నరాజ్యాల కూటమిగా తయారయి, స్వాతంత్రంగా మనగలశక్తిని కోల్పోయి, ఇండియా, తూర్పుఅరబ్ రాజ్యాల వలె ఎల్లప్పుడూ విదేశీ యజమానుల చెప్పుచేతుల్లో వ్రుంగి పోవాలని లండన్ వర్గాల వాంఛితం. ఇతరదేశాలను విభజించి ముక్కలు ముక్కలుగా చేయడమే లేబరు సామ్రాజ్యవాదంయొక్క స్థిరసిద్ధాంతం అయిపోయింది.

## VI

లేబరు సామ్రాజ్యవాదుల యీ దాడి బర్మాను విభజించడానికే గాక అసలు బర్మా రాజ్య అస్తిత్వాన్నే ధ్వంసం చేసేందుకు ఉద్దేశించబడింది. ఈవిధమైన పద్ధతుల ద్వారానే బర్మాకేంద్ర ప్రభుత్వాన్ని సంపూర్ణంగా తమ చేతికిందికి లండన్ వర్గాలు తెచ్చుకోగలిగాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదాలతోనూ, బూటకపు మార్క్సిస్టు నినాదాలతో బాకాలూదుకుంటూ ప్రారంభమైన తాకిన్-నూ మితవాద సోషలిస్టు ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వం రక్షణక్రింద ఉండటానికి బహిరంగంగా సిద్ధపడింది యుద్ధానికి ముందున్న ఆంగ్లో - బర్మన్ కలోనియల్ ప్రభుత్వానికీ, ప్రస్తుతం రంగూన్‌లో ఉన్న ప్రభుత్వానికీ ఆచరణలో నేను ఎలాంటి భేదమూ లేదు.

తాకిన్-నూ ప్రభుత్వానికి దేశంలో నిజమైన అధికారంతే నేలేదు. బర్మా ఆర్థికవిధానమంతా బ్రిటన్ గుప్పిటలోవుంది. సైన్యమూ, పోలీసుబలగమూ కారెన్లతోనూ యితర బ్రిటిషు అనుకూల ప్రత్యేకవాదశక్తుల ఆధిపత్యంతో నిండివున్నాయి. నూతనంగా సృష్టించబడిన పరిపాలనా యంత్రంయొక్క ప్రతిష్టను కెరన్ల తిరుగుబాటు హీనపరచింది. బాగా పలుకుబడి కలిగి బ్రిటన్‌తో దగ్గరసంబంధాలు గలిగిన భూస్వాములూ, వడ్డీవ్యాపారులూ, నిరంకుశోద్యోగులూ యుద్ధానంతరం బ్రహ్మాండమైన ప్రజావెల్లువకు భయపడి అజ్ఞాతవాసానికి వెళ్లిపోయారు. వారంతా ప్రస్తుతప్రభుత్వ బలహీనతను సాకుగాతీసుకొని తిరిగి "బర్మాడెమోక్రటిక్" పార్టీ అని పేరుతో తమ శక్తులన్నింటినీ థాకిన్-బా-సేన నాయకత్వాన సమీకరించుకొంటున్నారు. ఈముఠా బ్రిటనుతో యింకా సన్నిహిత సంబంధం పెట్టుకోవాలంటోంది.

## బర్మా కార్మిక కర్షకుల విజృంభణ

కాని యింతకంటే మరొక ప్రధానమైన విషయం మరొకటుంది. అధికారాన్ని గట్టిగా పట్టుకొని ప్రాకులాడుతున్న బర్మా మితవాద సోషలిస్టు నాయకులు కమ్యూనిస్టుల నాయకత్వాన బ్రహ్మాండంగా రోజు రోజుకు వృద్ధి అవుతున్న కార్మిక, కర్షకుల ఉద్యమాన్ని చూసి భయంతో కంగారు పడుతున్నారు. కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యాన ఉన్న కార్మిక కర్షకులు దేశాన్ని రాజకీయంగా ఆర్థికంగా నిజంగా విముక్తి చేయాలని ఎలుగెత్తి డిమాండ్ చేస్తున్నారు. జపాన్ దురాక్రమణ దారులతో జరిగిన విముక్తి యుద్ధానంతరం దేశం యొక్క రాజకీయ జీవిత రంగంలో బర్మా ప్రజానీకం ఒక శక్తిగా ప్రధాన పాత్రను నిర్వహించడం ప్రారంభించింది. బ్రిటిషు సామ్రాజ్య వాదులు తమ యావత్తు దాడినీ యీశక్తి పైకి కేంద్రీకరించారు. బ్రిటన్‌లోని లేబరు పార్టీకి బర్మాలోనకలుగా తయారైన థాకిన్-నూ గ్రూప్‌తో తాము మోసగించబడిన తరువాత బర్మా కార్మిక కర్షక ప్రజానీకం విదేశీదోపిడీ గాండ్రను వెంటనే తరిమివేసి నిజమైన ప్రజాస్వామిక పంథాను అనుసరించాలని డిమాండ్ చేయడం మొదలిపెట్టింది.

1947 ఆఖరుకే రంగూన్ ప్రభుత్వం ప్రజాస్వామికశక్తులకు వ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని ప్రారంభించి, దారుణమైన దాడులనూ, వేల కొలది కార్యకర్తలను అరెస్టు చేయడం లాంటి దుర్మార్గపు పనులను చేసింది. ట్రేడ్ యూనియన్‌లను రద్దుపరచింది. కమ్యూనిస్టు పార్టీని యింకా అనేక అభ్యుదయ సంస్థలనూ నిషేధించింది. కాని దీనిఫలితంగా ఉత్తర, మధ్య బర్మా ప్రాంతాలలో ప్రధానంగావున్న జాతీయ విముక్తి ఉద్యమం యింకా తీవ్రతరమైంది. 1948 వసంత ఋతువులో బ్రిటిషు వారి యాజమాన్యాన ఉన్న అన్నిపరిశ్రమలలో సర్వవ్యాపితసమ్మె చెలరేగింది.

బర్మాలోని కార్మికులు, అభ్యుదయ కూటమికి అండగా సమీకరించబడుతున్నారు. సమ్మెవెంటసమ్మె విరామంలేకుండా జరగడం ప్రారంభమైంది. ఈ సంవత్సరం జనవరి 26 వ తేదీన అఖిల బర్మా ప్రభుత్వోద్యోగుల ఫెడరేషన్ తమ జీవితాల అలవెన్సులను తగ్గిస్తున్న ప్రభుత్వవైఖరికి అసమ్మతిగా ఫిబ్రవరి 7 వ తేదీన దేశవ్యాపిత సమ్మెను చేయడానికి నిర్ణయం తీసుకొంది. కమ్యూనిస్టులూ, యితర అభ్యుదయకర సంస్థల ప్రతినిధులతో గూడిన సంయుక్త ప్రభుత్వం ఏర్పడాలని ఈ యూనియన్ డిమాండ్ చేస్తోంది. ప్రభుత్వ ఉద్యోగుల ఫెడరేషన్‌కు తమ పూర్తిఅండను ప్రకటించుతూ అఖిలబర్మా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు వేతనాల తగ్గించడానికి ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను ప్రతిఘటించవలసిందగా కోరుతూ కార్మికులకు పిలుపు నిచ్చింది.

తాకిన్-నూ ప్రభుత్వపు ఉద్యోగులు విధిస్తున్న దారుణశిస్తులనూ, విపరీతమైన కౌలునూ రైతులు చెల్లించడానికి నిరాకరిస్తున్నారు. దేశంలోని దాదాపు అన్ని ప్రాంతాలలో గెరిల్లా దళాలు చురుకుగా పనిచేస్తున్నాయి. 1948లో కొన్ని జిల్లాలలో ప్రజా ప్రభు

త్వాలు నెలకొల్పబడ్డాయి. థాకిన్-నూ ఆంటీ ఫాసిస్టు పీపుల్స్ లీగులోని చీలిక మరింత పెద్దదవుతోంది. ఈ లీగులోనుండి మితవాద సోషలిస్టునాయకులు కమ్యూనిస్టులను వెళ్లగొట్టారు. దీనితో జపానుదురాక్రమణదారులను ప్రతిఘటించిన పీపుల్సు వాలంటీరు సంస్థలో అత్యధిక సంఖ్యాకులు అభ్యుదయ కూటమిలో చేరారు. ప్రజలను అణచడానికి పంపబడిన ప్రభుత్వసైన్యాలలోనే తిరుగుబాట్లు లేచాయి. గత సంవత్సరం ఆగస్టులో అయిదు బర్మాప్రభుత్వ బెటాలియన్లలో రెండు ఎదురుతిరిగాయి. తతిమ్మా ప్రభుత్వ మిలిటరీ యూనిట్లన్నీ వెనుకబడిన కొండజాతి ప్రజలైన కెరన్లతోనూ, కాచిన్లతోనూ, షాన్లతోనూ నిండివున్నాయి. వీటికి కమాండర్లుగా ఉన్నదికూడా అభివృద్ధి నిరోధక ఆఫీసర్లే.

## థాకిన్-నూ లొంగుబాటుధోరణి

థాకిన్-నూ ప్రభుత్వం తన ప్రజలంటేనే హడలుతో భయపడుతోంది. ఆంగ్లో-బర్మీస్ ఒడంబడికపై సంతకాలు జరిగిన 16 మాసాల అనంతరం యీ ప్రభుత్వం రంగూన్‌లో తిష్టవేసిన బ్రిటిష్ మిలిటరీ రాయబారవర్గం పలుకుబడిక్రిందకు సంపూర్తిగా దిగజారిపోయింది. ప్రజాఉద్యమాలకు వ్యతిరేకంగా మిలిటరీవాదుల ప్లానులన్నీ బ్రిటిష్ ఆఫీసర్ల ప్రత్యక్ష సారధ్యంక్రిందనే పన్నబడుతున్నాయి. బ్రిటన్‌నుండి ఎక్కువగా ఆయుధాలూ, మందుగుండు సామానూ దండిగా తెప్పించమని బ్రిటిష్ ఏజెంట్లు బర్మాప్రభుత్వాన్ని అదేపనిగా కోరతారు. బర్మాలోని విమానాశ్రయాలను సంసిద్ధతలో వుంచడానికి కూడా బ్రిటన్ ఆయుధాలనూ మందుగుండు సామానును స్వయంగా తెప్పించుకొంటుంది.

వీటన్నింటికీ ప్రస్తుత బర్మాప్రభుత్వం రాజకీయంగా తలొగ్గుతోంది.

1948 నవంబరు 25వ తేదీన ప్రధాని థాకిన్-నూ రంగూన్‌లో బహిరంగసభలో ఉపన్యసించాడు. అందులో అతను "అతివాద పంథానే అనుసరించడానికి కృతనిశ్చయులైనట్లు" నొక్కివక్కాణించాడు. అయితే దీనికే అతను యింకా యిలాకలిపాడు. అయితే "జాతీయ ప్రయోజనాలకు నష్టం వాటిల్లకుండా వుండేందుకుగాను ఇది వేగంగా జరుగరా"దన్నాడు. బ్రిటిషు పరిశ్రమలను జాతిపరంచేయడమనే సమస్య వాయిదా వేయబడింది. అంతేకాదు. ప్రభుత్వవర్గాలలో విదేశీపెట్టుబడులనూ, విదేశ నిపుణులనూ, ఆహ్వానించాలనే మాటలు ఎక్కువగా వినబడుతున్నాయి.

ఈలోపున ఆగ్నేయ ఆసియానంతటినీ మార్షల్ ప్లానుతో నింపాలని కలలు గంటున్న అమెరికా పెట్టుబడిదారులు తమ హస్తాలను బర్మావరకూ చాస్తున్నారు. బర్మాలో ఏదో విధంగా తమ పరిపాలనను సంఘటిత పరచుకోవాలనే ఆదుర్దాతో బ్రిటిష్‌వారు తాము దిగమ్రింగుతున్న లాభాలలో కొంతభాగాన్ని అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణదారులకు పంచిపెట్టేందుకు అంగీకారాన్ని చూపిస్తున్నారు. బర్మా కార్పరేషన్‌లోని కొన్ని వాటాలు అప్పుడే అమెరికావారి హస్తగత మయ్యాయి.

## సామ్రాజ్యవాదులకు బాసటగా ఆసియాకూటమి ఏర్పాటు

ఈ యేడాది జనవరిమాసం మధ్యలో రంగూన్ ప్రభుత్వం ఎలాంటి మినహాయింపులు లేకుండా సామ్రాజ్యవాదులకు లొంగిపోవడాన్ని థాకిన్-నూ మరొకసారి

దృఢపరిచాడు. దూర, మధ్యప్రాచ్యదేశాల రహస్య సమావేశంలో పాల్గొనేందుకు ఢిల్లీకి వచ్చినప్పుడు బర్మా మితవాద సోషలిస్టు నాయకుడైన తాకెన్-నూ భారతీయ పత్రికలలో బర్మాలో "కమ్యూనిస్టు ప్రమాదాన్ని" గురించి వరుసగా వ్యాసాలు ప్రకటించాడు. ఆ వ్యాసాలలో ఆంగ్లో - బర్మీసు నూతన మిత్రత్వాన్ని గురించీ బ్రిటనుకు తాము చెల్లించవలసిన బాకీయొక్క న్యాయాన్ని గురించీ వ్రాస్తూ అవి బర్మాయొక్క "జాతీయ ప్రయోజనాలకు" అనుగుణ్యంగానే ఉన్నాయని సమర్థించాడు. ఈ పోకడలనన్నింటినీ పరిశీలించి చూస్తే బర్మా ప్రభుత్వం ఆసియా కూటమిలో చేరడానికి సిద్ధపడుతున్నట్లు స్పష్టపడుతుంది.

ఈ ఆసియా కూటమి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాద వర్గాల ఆజ్ఞల ప్రకారం ఆసియా ఖండంలో జాతీయ విముక్తి ఉద్యమాలను ఎదుర్కొనేందుకు ఢిల్లీలో ఏర్పరచబడుతోంది.

ఈవిధంగా బ్రిటిషు లేబరు సామ్రాజ్యవాదులు బర్మాను తిరిగి తమ అధీనంలో వుంచుకోడానికి చేస్తున్న ప్రయత్నాలలో చరమాంకాన్ని మనం చూడగలుగుతున్నాం. ఒకేఒక సంవత్సరకాలంలో వలసదేశాల ప్రజలను బానిస సంకెళ్ళలో యిరికించడానికి నూతనంగా పన్నుగడలుపన్ని దానిని "ప్రజాస్వామికసోషలిజం" అనే సిద్ధాంతపు తేనె పూశారు. అంటే దీని ఫలితం ఆచరణలో బర్మాను బ్రిటిషు సామ్రాజ్యంలో తిరిగి కలుపుకోవడమన్నమాట. బెదిరింపులద్వారా విధ్వంస చర్యలమూలంగా, మోసాలద్వారా, ప్రత్యక్షంగా బలవంతం పెట్టడంద్వారా లేబరు సామ్రాజ్యవాదులు "స్వతంత్ర" దేశాని కిచ్చిన వన్నింటినీ తిరిగి వెనక్కు లాక్కొన్నారు. ఇండియా, పాలస్తీనా, మలయాల వలెనే బర్మాకూడా అట్లీ- బెవిన్‌ల నూతన వలసదేశవిధానాన్ని ఆచరణలో ప్రత్యక్షంగా బట్టబయలు అవుతోంది.

అయితే యీనాడు బర్మాను పరిపాలించుతున్న సైన్యాధిపతులూ, అభివృద్ధి నిరోధకులూ మితవాద సోషలిస్టులూ, సామ్రాజ్యవాదులకు దాసోహమన్నారంటే బర్మా ప్రజలు అణచబడ్డారని అర్థంచేసుకోరాదు. ఈ బెదిరింపులూ, యీ దారుణ హింసా కాండలు బర్మా కష్టజీవుల ప్రజాస్వామిక ఉద్యమ అభివృద్ధిని అరికట్టలేవు వలస దేశాలను దోపిడీ చేసే సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా వారు విప్లవ విజయపతాక నెత్తారు.

— న్యూటైమ్సు, 9-2-49



“పెట్టుబడిదారులతో రాజీధోరణి నవలంబించే సోషలిస్టు విప్లవపార్టీలకూ, తదితర మితవాద పార్టీలకూ రోజులు నిండిపోయాయి. ఆపార్టీలు ఇక అభ్యుదయ పంధాన పురోగమించజాలవు. నవంబరు విప్లవానికి పూర్వమే ఆ పార్టీలన్నీ బూర్జువా పార్టీలుగా మారిపొయ్యాయి. పెట్టుబడిదారీ విధానం పతనమైపోకుండా ఆవిధానాన్ని సురక్షితంగా, సుస్థిరంగా ఉంచడానికే ఆ పార్టీలు పోరాడాయి. ఒక్క బోల్షివిక్‌పార్టీ (కమ్యూనిస్టు పార్టీ) మాత్రమే బూర్జువా అధికారాన్ని కూలద్రోయడంలో ప్రజాపోరాటానికి నాయకత్వం వహించి నడిపింది. సోవియట్ల అధికారాన్ని స్థాపించడానికి కృషిచేసింది”.

— సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర

(మాస్కో ప్రచురణ 224 వ పేజీ)

## సమిష్టి చర్చకోసం నోట్సు

# సోవియట్ విదేశాంగనీతి

[ఈ క్రింద యివ్వబడిన నోట్సు గ్రూప్ చర్చలకు వినియోగపడేందుకు బ్రిటన్‌లోని "వరల్డు న్యూస్ అండ్ వ్యూస్" అనే పత్రిక ప్రకటించింది. సోవియట్ విదేశాంగనీతిపై యిచ్చిన యీ నోట్సు మన ఆంధ్రలోకూడా సమిష్టి చర్చలకోసం పాఠకులు వినియోగించుకొంటారనే ఉద్దేశంతో ప్రకటిస్తున్నాం. ఇందులోని నోట్సు కొంతవరకు బ్రిటన్‌ను దృష్టిలో వుంచుకొని తయారుచేయబడింది. పాఠకులు దానిని గమనించకోరతాం.

— సంపాదకుడు]

సమ్మెలనుగురించి కోటీశ్వర్ల పత్రికలు ఎప్పుడైనా నిజాన్ని ప్రకటించాయా? 1917లో రష్యాలో జరిగిన సంఘటన వెయ్యి సమ్మెల కంటే గొప్పసంఘటన: అక్కడ వారు కోటీశ్వర్లను రద్దుచేశారు.

సోవియట్ యూనియన్‌పై అబద్ధాలు ప్రచారం చేసినట్లు మరేదేశాన్నిగురించీ అన్ని అబద్ధాలు ప్రచారం చేయలేదు. ఈ సంగతి యుద్ధకాలంలో పూర్తిగా బహిర్గతమైంది. ఎందుకంటే ఆ రోజుల్లో రష్యా సాయం బ్రిటన్‌కు అవసరమైంది. యుద్ధంలో సోవియట్ సాధిస్తున్న విజయపరంపరలకూ యుద్ధానికి ముందు సోవియట్ యూనియన్‌లోని పరిస్థితులను గురించి చెప్పిన అబద్ధాలకూ అంతు లేనంత పరస్పర విరుద్ధత అందరికూ కళ్ళకుగట్టినట్లు కనపడింది.

మళ్ళీ యీనాడు సోవియట్‌నుగురించి దుష్ప్రచారం విపరీతంగా చేస్తున్నారు. ఇప్పుడు తిరిగి బ్రిటన్‌లో పత్రికలూ, రేడియో, సినిమాలూ, మంత్రులూ - అంతా సోవియట్‌పై విపరీతంగా అబద్ధాలు వల్లిస్తున్నారు. ఈ అబద్ధాలు వింటే ఎవరైనా ఆశ్చర్యచకితులవుతారు. ఒక్క చిన్న ఉదాహరణ: "సోవియట్ దురాక్రమణ" అని ప్రపంచమంతా ప్రతిధ్వనించేటట్లు ఖండిస్తున్నారు. కాని ఈనాడు సోవియట్ సైన్యాలు ఎక్కడైనా యుద్ధంచేస్తున్నాయా? ఎక్కడా లేదు.

మలయాలో, ఇండోనీషియాలో, ఇండోచైనాలో, గ్రీస్‌లో పోట్లాడుతున్నదెవరు? బ్రిటీషు, డచ్చి, ఫ్రెంచి, అమెరికన్ సైన్యాలూ, వారి తాబేదారులూనూ.

## కోటీశ్వర్లను రద్దుచేసిన ఫలితాలు

(1) సోవియట్‌లో కోటీశ్వర్లు లేకుండా రద్దు చేయడం మూలంగా స్వదేశంలోగాని విదేశాలలోగాని వ్యక్తిగత పెట్టుబడులకు, లాభాలకు యింక అవకాశం లేకుండా పోయింది. అందువలన యితర దేశాలలోని ఫ్యాక్టరీల పైనా, తేయాకు తోటలపైనా, చౌకపారు లేబరుపైనా గుత్తాధికారాన్ని సంపాదించడానికి వర్గప్రయోజనాలు లేవు. **అంటే యుద్ధానికి ప్రధానకారణమైన సామ్రాజ్యవాదం అనేది రద్దయి పోయింది.**

అందుకనే 1917 లో సోవియట్ రష్యా టర్కీ, పర్షియా, చైనాలపై రష్యా జారు చక్రవర్తులు చెలాయిస్తున్న ప్రత్యేక పెత్తనాల నన్నింటినీ రద్దుచేసింది.

(2) సోవియట్ యూనియన్ యిప్పుడు వివిధజాతులయొక్క సమ్మేళన. ఇదివరకు రష్యాజాతివారు యితరజాతుల ప్రజలను తమ బానిసత్వం క్రింద ఉంచుకొని పరిపాలన సాగిస్తూవుండేవారు. రష్యాలోని కార్మికకర్షకులు బానిసజాతుల ప్రజలైన యుక్రెయిన్ జార్జియన్, సెంట్రల్ ఏషియన్స్, మంగోలులు మొదలగువారితో కలసి తమకు సమాన శత్రువులైన రష్యా పెట్టుబడిదార్ వర్గంతో పోరాడారు. ఈ రోజున సోవియట్ యూనియన్‌లో వలసదేశాలంటూ లేవు. నల్లవారిని హీనంగా చూస్తూ వారి హక్కులను హరించడం లేదు. వెనుకబడిన జాతులన్నీ ఆర్థికంగా బ్రహ్మాండంగా అభివృద్ధి చెందాయి. ఆధునిక నాగరికతా జీవనప్రమాణాన్ని అందుకొన్నాయి.

**ఈ రోజున సోవియట్ యూనియన్ మరొక దేశాన్ని వలసదేశంగా మార్చాలంటే గుంపు తన్ను కాను విచ్ఛిన్నం చేసుకోకుండా అది సాధ్యపడదు.**

అందుచేత సోవియట్ యూనియన్ వలస దేశాల ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పోరాడుతుంది. ఉదాహరణకు: 1937-41 జపానుకు వ్యతిరేకంగా చైనాకు సాయం; 1935-36 లో అబిసీనియాకు సాయం (ఇటలీకి ఆయిల్ సరఫరాను సోవియట్ బంద్ చేసింది); మిత్రరాజ్యసమితి ధర్మకర్తృత్వ సమితిలో సోవియట్ కృషి.

(3) ఎర్రసైనికులకూ, నావికులకూ "ప్రజా సేవకులుగా" తర్ఫీదు నిస్తారు. (ప్రమాణాం) పెట్టుబడిదారీ దేశాల్లోవలెగాక సోవియట్‌లో సైనికులకూ, నావికులకు రాజకీయాలలో శిక్షణనిస్తారు. చర్చలకు అవకాశమిస్తారు. మిలిటరీ ట్రైనింగులో అదొక భాగం. ప్రజలందరూ సమానులే. మనిషిని మనిషి దోచుకోవడం అంటూ లేదు. ఇవే వారికిచ్చే విద్యయొక్క మూల ప్రాతిపదికలు. ఈ సిద్ధాంతాలకు విరుద్ధంగా మరో విధంగా ప్రవర్తించడానికి వీలులేదు. అందుకనే:

**19[illegible]3 లో చైనా యుద్ధోన్మాదులు (చైనీస్ వార్ లార్డ్సు) సోవియట్ రైల్వేలపై దురాక్రమణ జరిపినప్పుడు సోవియట్ యూనియన్ వారిని ఓడించి ఆక్రమిత ప్రాంతాలలోని ధనికుల ఆస్తులను బీదలకు పంచి పెట్టింది. అంతేకాని చైనా భూభాగంలో ఒక్క అంగుళం మేరను కూడా ఆక్రమించుకోలేదు.**

1940 ఫాసిస్టు జర్మనీకి అండగా వచ్చిన ఫిన్లండ్ సైన్యాన్ని హార మార్చినప్పుడు సయితం సోవియట్ ఫిన్లండులో సెంటు భూమికూడా ఆక్రమించుకోలేదు. కనీసం యుద్ధ నష్ట పరిహారాన్నికూడా రాబట్టుకోలేదు.

1944 లో (యుద్ధ సమయం) రుమేనియా, బల్గేరియా, హంగెరీలను ఆక్రమించుకొన్నప్పుడు ఆ దేశాల భూభాగాలను కలుపుకోలేదు సరికదా, ఆ దేశాలపై సోషలిజాన్ని సహితం బలవంతంగా రుద్దలేదు. ఆ దేశాలలో యుద్ధానికి కారకులను శిక్షించాలని మాత్రమే సోవియట్ పట్టుబట్టింది.

(4) రష్యాలో జరిగిన విప్లవానికి అన్ని దేశాలలోని సామాన్య ప్రజానీకం తోడ్పడింది. (1920 లో కార్మికుల అసమ్మతి సమ్మెలు, 1923 లో కర్జన్ అల్టిమేటంకు అసమ్మతిగా దేశవ్యాపిత ప్రదర్శనాలు; 1933 లో సోవియట్‌తో వ్యాపారం సాగించరాదని టోరీప్రభుత్వం నిషేధానికి అసమ్మతిగా కార్మికుల అసమ్మతి ప్రదర్శనాలు.) అన్ని దేశాలలోని మామూలు ప్రజానీకం యీ విధంగా సాయపడితే రష్యావిప్లవం ధనికుల వ్యతిరేకత ముఖ్యంగా బ్రిటన్‌లో తెచ్చుకొంది. ఎందువల్లనంటే విప్లవంవల్ల నష్టపడింది ధనికులే.

ఉదా:—బ్రిటిష్ ధనికవర్గం రష్యావిప్లవం మూలంగా నష్టపడిన వివరాలు:—

రష్యా జారుచక్రవర్తికి బ్రిటిష్‌కోటీశ్వర్లు అప్పుపెట్టిన 5 కోట్ల పౌన్లు, రష్యా పరిశ్రమలలో బ్రిటిష్ పెట్టుబడిదార్లు పెట్టుబడి పెట్టిన 28 కోట్ల పౌన్లు.

(1913 లో రష్యాకార్మికులు రోజుకు 11 గంటలు పని చేసేవారు. వారికి వారానికి 12 షిల్లింగుల 6 పెన్నీలు మాత్రమే జీతం వచ్చేది. ఇంత దారుణంగా రష్యాకార్మికులను దోపిడీచేసి బ్రిటిష్ ధనికవర్గాలు సంపాదించుకున్న లాభాలూ, డివిడెండ్లూ, వడ్డీలు—అన్నీ విప్లవంవల్ల నష్టమయ్యాయి.) 1924, 1929 బ్రిటన్‌లో అధికారానికి వచ్చిన లేబరుప్రభుత్వం యీ నష్టానికి సాధ్యమైనంత పరిహారం సంపాదించడానికి తంటాలు పడింది. సోవియట్ విదేశాంగనీతి యిలాంటి వన్నింటినీ దృష్టిలోవుంచుకొని పనిచేయవలసి ఉంటుంది.

# సోవియట్ విదేశాంగ విధానంయొక్క మూలసూత్రాలు

**1 పెట్టుబడిదారీ రాజ్యాలతో శాంతి యుతంగా ఉండటం:**

ఇతర దేశాలపైన కమ్యూనిజాన్ని బలవంతంగా రుద్దడం సోవియట్ ఉద్దేశ్యం ఎన్నడూ కాదు. ఎందువల్లనంటే కమ్యూనిజం బలవంతంగా రుద్దబడే విధానం కాదు. కార్మికులు కోరుకుంటేనే వారు కమ్యూనిజాన్ని నిర్మించుకోగలుగుతారు.

ఎందువల్లనంటే కమ్యూనిజం రావడంఅనేది వారి ఉత్సాహంపైన ఆధారపడి ఉంటుంది.

ఇతరదేశాలపై తమ విధానాన్ని బలవంతంగా రుద్దజూసింది సోవియట్ కాదు. చర్చిల్ నాయకత్వాన, బ్రిటన్ అధ్వర్యాన యితర దేశాలే యుద్ధంతోనూ, బ్లాకేడ్ ద్వారానూ, రష్యాలో తిరిగి జారుచక్రవర్తి పరిపాలనను పునస్థాపితం చేయడానికి ప్రయత్నాలు చేశాయి.

సోషలిజాన్ని జయప్రదం చేయడమే సోవియట్ యూనియన్ ఎల్లప్పుడూ తనయొక్క పరమోద్దేశ్యంగా పెట్టుకొన్నది. ఆ విధంగా సోషలిజంయొక్క ఆధిక్యతను, మంచిని ఆదర్శంగా, ఇతరులకు చూపెట్టాలని తన ఉద్దేశ్యం.

ఇందుకోసం మరెవరూ కోరనంతగా సోవియట్ యూనియన్ శాంతిని అమితంగా ఎల్లప్పుడూ అభిలషిస్తుంది. సోషలిజం జయప్రదం కావాలంటే శాంతి అత్యవసరం.

మరా:—1914-17 యుద్ధంలో రష్యాలో 40 లక్షలమంది మరణించారు. 1917-20లో 15లక్షలమంది మరణించారు. 1941-45 లో 70 లక్షలు చనిపోయారు. రెండో ప్రపంచ యుద్ధంలో 2500 కోట్ల పౌన్ల విలువగల ఆస్థి ధ్వంసం అయిపోయింది.

అందుకనే సోవియట్ యూనియన్ శాంతి కోసం ఎన్నో విధాలుగా ఎన్నోసార్లు ప్రయత్నం చేసింది. 1918-20 లో మిత్రరాజ్యాల ప్రభుత్వాలకు 18 సార్లు శాంతి ప్రతిపాదనలను పంపించింది. 1922 లో జినోవాలో జరిగిన ప్రపంచ ఆర్థిక మహాసభలో పెద్ద ఎత్తునఆర్థిక సహకారాన్ని ప్రతిపాదించింది; 1924 లో బ్రిటన్‌లోని మొదటి లేబరు ప్రభుత్వంతో సంధి చేసుకొంది. దీని వలన లేబరు ప్రభుత్వం రష్యాలో బ్రిటన్‌కున్న ఆస్తుల లావాదేవీలు పరిష్కరించుకొని, పెద్దగా వర్తక సంబంధాలను పెట్టుకొని ఉండవలసింది; 1927 లో జినీవాలో జరిగిన అంతర్జాతీయ ఆర్థిక సమావేశంలో "శాంతి యుతంగా కలసి పోండవచ్చు" అన్న ప్రధాన సూత్రాన్ని ప్రతిపాదించి ఆమోదింప జేసింది. 1927-32 లో జినివాలో ఆయుధ విసర్జన విషయంలో చాల పెద్ద ఎత్తున ప్రతిపాదనలను చాలసార్లుచేసింది; 1933 లో లండలో జరిగిన ఆర్థిక సమావేశంలో రెండు ముఖ్యమైన ప్రతిపాదనలను చేసింది. (1) ఆర్థిక రంగంలో నిరాక్రమణ సంధి (అంటే విదేశీ సరకులను పూర్తిగా దింపడాన్ని నిషేధించడం, వ్యాపార విషయాలలో అక్రమఆధిక్యతను నిషేధించడం) (2) ప్రపంచ వ్యాపార సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు ఎక్కువగా దిగుమతులు పెంచడం.

యుద్ధానంతరం స్టాలిన్ అనేకసార్లు శాంతి కోసం ప్రతిపాదనలను చేశాడు. (అలెగ్జాండరు రీత్, హెరాల్డు స్టాస్సిన్ వగైరాలతో ఇంటర్వ్యూలు).

## II దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా పెట్టుబడిదారీ రాజ్యాలతో సహకారం:

1918 లో జర్మనీని ప్రతిఘటించే పక్షంలో మిలిటరీ సంధులు చేసుకొంటానని సోవియట్ యూనియన్ మిత్రరాజ్యాలకు ప్రతిపాదనలను పంపింది; 1925-32 లో యుద్ధం మూలంగా దేశాలన్నీ నష్టపడి తిరిగి కోలుకొన్న తరువాత పొరుగు దేశాలతో నిరాక్రమణ సంధులను చేసుకొంది. (మరా:-బ్రిటన్ మాత్రం సోవియట్ నిరాక్రమణ సంధికి నిరాకరించింది.) 1934 లో "యుద్ధానికి నైతికంగా వ్యతిరేకంగా పని చేసేందుకు" నానాజాతిసమితిలో చేరింది. 1935-39 లో ఫ్రాన్సుతోనూ, జెకో

స్లోవకియాతోనూ దురాక్రమణకు వ్యతిరేకంగా పరస్పర సహాయక సంధులు చేసుకొన్నది. అలాంటి సంధినే బ్రిటనుతో కూడా చేసుకొంటానని తన ప్రతిపాదనలను పంపింది. అబిసీనియా రక్షణకు నానాజాతి సమితి కోరినట్లు 'శాంక్షన్సును ఖచ్చితంగా అమలు జరిపింది. (1935–36) 1936–38 లో జర్మనీ ఇటలీలకు వ్యతిరేకంగా స్పెయిన్ రిపబ్లిక్‌కు సాయపడింది. 1937–41లో జపానుకు వ్యతిరేకంగా చైనాకు సాయపడింది. 1938 లో జర్మనీకి వ్యతిరేకంగా ఒంటరిగా ఒక్కటే జెకోస్లోవకియాకు సాయపడటానికి సిద్ధపడింది; 1945 లో మిత్రరాజ్య సమితి ఏర్పడటానికి కృషి చేసింది. జర్మనీలో నాజీజాన్ని, మిలిటరీ తత్వాన్ని సమూలంగా తుద ముట్టించేందుకు ఉద్దేశించబడిన పోట్సుడం ఒడంబడికపై సంతకం పెట్టింది.

వరా ;—జర్మనీలో నాజీజం, మిలిటరీ తత్వమూ తలెత్తడానికి ప్రధాన కారణాలు.

(1) పెద్ద ఎత్తునవున్న భూస్వామిక వర్గాలు. ప్రష్యన్ జుంకర్ల యొక్క దురాక్రమణ మిలిటరీ తత్వం వీరిలో ప్రకోపించి ఉంది. 1871 నుండి జర్మనీపాలకముఠాకు యీ వర్గమే పునాది.

(2) పరిశ్రమలలోనూ, ఫైనాన్సులోనూ, వాణిజ్య వ్యాపారంలోనూ, బ్రహ్మాండంగా గుత్తపెట్టుబడిదారుల కంట్రోలు అధికారం ఉండటం. ఈ గుత్తాధికారాన్ని విచ్ఛిన్నం చేయవలసిన అవసరం అందరూ 1944 లోనే గుర్తించారు. ఈవిషయమై 1944 డిసెంబరులో జరిగిన లేబరుపార్టీ మహాసభ కూడా తీర్మానం చేసింది.

## III వెనుకబడిన దేశాల స్వాతంత్ర్యంకోసం సోవియట్ కృషి

1919 లో బ్రిటన్ స్వాధీనంలో వున్న ఆఫ్ఘనిస్తాన్ తన స్వతంత్ర్యం కోసం చేసిన ప్రయత్నానికి సోవియట్ యూనియన్ సాయపడింది. 1921–22 లో టర్కీ రిపబ్లిక్ తన స్వతంత్ర్యంకోసం పోరాడుతున్న సమయంలో "వైట్" తిరుగుబాటుదార్ల వద్ద స్వాధీనం చేసుకొన్న బ్రిటిషు ఆయుధాలను టర్కీ ప్రజలకిచ్చి ఆ విధంగా వారికి సోవియట్ సాయపడింది.

1924–27లో చైనా జాతీయ మహానాయకుడు, చైనా ప్రజాస్వామిక రిపబ్లిక్ అధ్యక్షుడూ అయిన సన్‌యట్ సేన్ కోరినవెంటనే కాంటన్‌కు తన రాజకీయ, మిలిటరీ సలహాదార్లను పంపి, చైనా జాతీయ ఐక్యతకు సోవియట్ సాయపడింది.

1925 లో మంగోలియా ప్రజా రిపబ్లిక్‌కు ఆర్థికంగా, వైజ్ఞానికంగా సాయం చేసి, ఆ దేశంలో ఫ్యూడలిజాన్ని తుదముట్టించి పరిశ్రమలను అభివృద్ధి చేసుకొనేందుకు సోవియట్ సహాయ పడింది.

1934 లో టర్కీతో పారిశ్రామిక ఋణ ఒడంబడిక చేసుకొన్నది. ఈ ఒడంబడిక ద్వారా టర్కీలో ఆధునిక బట్టల ఫ్యాక్టరీలు నిర్మించడానికి వడ్డీలేకుండా పెట్టుబడిని సోవియట్ అప్పుపెట్టి సాయపడింది.

1936, 38 లో స్పెయిన్ రిపబ్లిక్‌కు ఆర్థికంగానూ, మిలిటరీ రీత్యా సాయపడింది. దీనికి బదులుగా సోవియట్ ఎలాంటి ఆర్థిక సౌకర్యాలనూ కోరి నిరాకరించింది.

1945 నుండి తూర్పు యూరోప్‌లోని ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలకు ఆర్థికంగా ఎంతో సాయం చేసింది. అయితే యీ సందర్భంలో ఆదేశాలను తన ఫ్యాక్టరీలలో తయారైన వస్తువులతో నింపడానికిగాని, ఆదేశాల లోని ముడి పదార్థాలనూ, ఆహారపదార్థాలను పదార్థాలను చౌకగా తాను తెచ్చుకోడానికి గాని ఎంత మాత్రం వినియోగించుకోలేదు. సామ్రాజ్యవాదరాజ్యా లయితే వాటిని వలస దేశాలుగా వినియోగించుకొని ఉండేవి. పైపెచ్చు సోవియట్ యూనియన్ ఆదేశాలకు అవసరమైనప్పుడు, పరిశ్రమలను నిర్మించుకొనేందుకూ పారిశ్రామిక సంపత్తిని, ఆహార పదార్థాలను పంపి సాయపడింది. ఈ విధంగా సోవియట్ యూనియన్ చిన్న రాజ్యాలను ఆర్థికంగా, రాజకీయంగా తన బానిసత్వంక్రింద వుంచుకోడానికి పూర్తిగా వ్యతిరేకించింది.

# ప్రస్తుత ప్రపంచ ప్రధాన సమస్యలను పరిష్కరించడానికి సోవియట్ ప్రతిపాదనలు

## జర్మనీ

అగ్రరాజ్యాలు నాలుగూ కలసి జర్మనీలో వున్న ఆయుధకర్మాగారాలను రద్దు పరచడానికి ఒప్పందలఅయి ఆచరణలో అమలు జరపడం, జర్మనీ నుండి యుద్ధ నష్ట పరిహారాన్ని వసూలు చేసేందుకు అవసరమైన కార్య కలాపాలను నిర్ణయించడం.

జర్మనీ కేంద్ర ప్రభుత్వ నిర్మాణంపై అగ్రరాజ్యాలు నాలుగూ ఒక అంగీకారానికి రావడం.

నాలుగు అగ్రరాజ్యాలూ జర్మనీతో శాంతి ఒడంబడికలు చేసుకోవడం.

ఒడంబడిక జరిగిన 12 మాసాల లోపున జర్మనీనుండి తమతమ సైన్యాలను ఉపసంహరించుకోవడం.

(వార్సాలో జరిగిన 8 రాజ్యాల తీర్మానం. 24-6-48)

## కొరియా

ఉత్తర, దక్షిణ కొరియాల నుండి సోవియట్ యూనియన్, అమెరికాలు తమ తమ సైన్యాలను ఉపసంహరించుకోవడం.

వరా:—తన స్వాధీనంలో వున్న ఉత్తర కొరియానుండి సోవియట్ సైన్యాలు అప్పుడే వెళ్లి పోయాయి. (26-9-47, 18-9-48 ప్రకటనలు)

## జపాన్

యుద్ధ పరిశ్రమలను తిరిగి పునరుద్ధరించకుండా నిషేధించడం. (ఇది

ఎన్నో సంవత్సరాలుగా జపాన్‌దురా క్రమణ భయంతో వున్న దేశాల అధ్వర్యాన జరగాలి.) జపాన్ ప్రజల శాంతికాల అవసరాలకు వినియోగ పడే పరిశ్రమలను పునరుద్ధరించాలి.

## పరమాణుశక్తి

ఆటంబాంబుల నిర్మాణాన్ని నిషే ధించాలి. ఇప్పటికే వున్న స్టాక్‌ను నాశనం చేయాలి. ఆపని సక్రమంగా నెరవేరేందుకు అన్ని దశలలోనూ తనిఖీ చేసేందుకు ఒక అంతర్జాతీయ తనిఖీ సంఘాన్ని నియమించాలి. పైన ఉదహరించిన రెండూ ఒకే సారి జరగాలి.

## ఆయుధశక్తి

అగ్రరాజ్యాలు అయినా తమ తమ ఆయుధ బలంలో మూడోవం తును తగ్గించుకోవాలి. (ఏదైనా ప్రత్యేక రాజ్యానికి ప్రత్యేక కార ణాలవలన ఏదైనా సర్దుబాటు అవ సరమైతే పరస్పర అంగీకారంతో అలా చేసుకోవచ్చు)

పరస్పరం చేసుకొన్న సంధులను భగ్నం చేయకుండా గ్యారంటీకొరకు ఒక అంతర్జాతీయ తనిఖీ సంఘాన్ని ఏర్పాటు చేయాలి. (మిత్ర రాజ్య సమితి సమావేశంలో విషిన్స్కీ ప్రతి పాదన 25–9–48)

## బెర్లిన్

సోవియట్ విధించిన రవాణా అభ్యంతరాలనూ, బెర్లిన్‌లోకి "పశ్చిమ" మార్కు నాణెంనూ ఒకే సారిగా ఉపసంహరించుకోవడం. బెర్లిన్‌లో తూర్పుభాగం మార్కు-నాణెం మాత్రం చెలామణి అయ్యే టట్లు చూడటం; బెర్లిన్‌లో దాని చెలామణి 4 రాజ్యాల కంట్రోలు క్రింద వుండాలి.

ఈపై ప్రతిపాదనలు "సోవియట్ దురాక్రమణ" అనే నిందలను పటా పంచలు చేస్తాయి. ఈ ప్రతి పాదన లను నిరాకరించే ప్రభుత్వాలే దురా క్రమణకు సిద్ధపడుతూన్నాయని రుజు వవుతుంది.

"శ్రామికవర్గంకొరకు పాటుపడాలని కోరేవా రెవరైనాసరే "తనయొక్క" యితరులయొక్క బూర్జువా జాతీయతను ఖచ్చితంగా ఎదుర్కొంటూ అన్ని దేశాల కార్మికుల ఐకమత్యంకోసం కృషిచేసితీరాలి.

— లెనిన్

73

# వార్తలూ - విశేషాలు

## జనరల్ మార్కోస్ రాజీనామా

గ్రీకు ప్రజలకూ, గ్రీకు ప్రజాసైన్యానికీ జనరల్ మార్కోస్ వ్రాసిన బహిరంగ లేఖను 8-2-49 వ తేదీన 'ఫ్రీగ్రీస్ రేడియో స్టేషన్, ప్రసారం చేసింది.

గ్రీకు ప్రజాసైన్యానికి సైన్యాధిపతీ, గ్రీకు ప్రజాప్రభుత్వానికి అధ్యక్షుడూ అయిన కామ్రేడ్ మార్కోస్ అనారోగ్యకారణంచే తన పదవులకు రాజీనామా ఇచ్చాడు. గ్రీకు ప్రజాప్రభుత్వానికి ప్రస్తుతం ఉపాధ్యక్షుడుగా ఉన్న జేనిస్ అయోన్నిడెస్ తాత్కాలికాధ్యక్షుడుగా వ్యవహరిస్తూ ఉంటాడు.

కామ్రేడ్ మార్కోస్ తన లేఖలో ఇలా తెలియజేశాడు.

"అంతిమ విజయం మనదే అనే అచంచల విశ్వాసంతోనే నేనీ రాజీనామా ఇస్తున్నాను. నా రాజీనామాను అవకాశంగా తీసుకొని మన శత్రువులు మనకు వ్యతిరేకంగా ప్రచారంచేస్తారు. కాని మనం సాధించే విజయాలే వాళ్లను నోరు మూసేటట్లు చేస్తాయి."

## బ్రిటిష్ మిలటరీకోర్టులో జర్మనీ కార్మిక నాయకునకు శిక్ష

పశ్చిమ జర్మనీలో కమ్యూనిస్టు నాయకుడైన మేక్స్‌రీమన్‌కు బ్రిటిష్ మిలటరీకోర్టు శిక్ష విధించింది.

జర్మన్ ప్రభుత్వాన్ని పడగొట్టేందుకు ప్రయత్నిస్తున్నాడని ఇప్పటికి పదిసంవత్సరాల పూర్వం నాజీకోర్టు రీమన్‌పై నేరం ఆరోపించింది. హిట్లరు అనుగుజాడల్లో నడుస్తోన్న ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు కూడా సరిగా నేడు అదేపని చేస్తున్నారు

ఇంతకూ కామ్రేడ్ రీమన్ చేసిన నేరమేమిటి?

అమెరికా సామ్రాజ్యవాదులు తమ దురాక్రమణ ప్లానులను కొనసాగించుకునేందుకు రూర్ ప్రాంతాన్నీ పశ్చిమ జర్మనీని ఒక వలస దేశంగా మార్చివేస్తున్నారని కామ్రేడ్ రీమన్ విమర్శించాడు. ఇది బ్రిటిష్ మిలటరీ అధికారుల దృష్టిలో ఒక మహానేరం అయిపోయింది.

కామ్రేడ్ రీమన్‌ను అరెస్టుచేసిన ఫలితంగా జర్మన్ ప్రజల్లో ఎంతగా క్రోధావేశాలు మిన్నుముట్టాయో ఫిబ్రవరి 4వ తేదీన 'ప్రెస్ ఆఫ్ ఇండియా' విలేఖరి పంపిన ఈ క్రింది వార్తనుచూస్తే తెలుస్తుంది.

"రీమన్‌ను అరెస్టుచేసిన ఫలితంగా ప్రభుత్వానికి జర్మన్ ప్రజల సహకారం లభించడం దుస్తరమైపోయింది.

"రీమన్‌ను అరెస్టుచేయడంవల్ల బ్రిటిష్ అమెరికా ప్రభుత్వాలపై ఆరోపింపబడిన నేరాలు యథార్థమైనవే అని జర్మనీ ప్రజలు ధ్రువపరుచుకున్నారు, అని డ్యూచేపార్టీ అధ్యక్షుడు హీన్‌రీచ్ తన అభిప్రాయాన్ని వెల్లడించాడు."

కామ్రేడ్ రీమన్ అరెస్టుపై 'ప్రవద' ఇలా వ్యాఖ్యానించింది.

"కామ్రేడ్ రీమన్‌ను నిర్బంధించి జర్మన్ ప్రజలను భయపెట్టి నోరుమూయించాలని సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు. కాని జర్మన్ ప్రజల్లో ఈ చర్య తీవ్రమైన క్రోధావేశాలను రగుల్కొలిపింది. కుట్రదారులువేసిన ప్లానులు తల్లక్రిందయ్యాయి. జర్మన్ కార్మిక వర్గ నాయకుడైన రీమన్‌కోసం, ప్రజాస్వామిక హక్కులకోసం, జర్మన్ కార్మిక ప్రజలు ఇంకా తీవ్రంగా పోరాడతారు.

# ఫ్రెంచి సోషలిస్టు పార్టీనుంచి కమ్యూనిస్టు పార్టీలోకి...

ఫ్రెంచి గని కార్మికులు ఇటీవల సాగించిన వీరోచిత సమ్మెపోరాటం ఫ్రెంచికార్మిక ప్రజల్లో ఒక నూతనోత్సాహాన్ని రేకెత్తించింది. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం ముఖ్యంగా గని ప్రదేశాల్లో విరివిగా అభివృద్ధి చెందుతూవుంది. ఎస్కాడియక్ అనే ప్రదేశంలో 39 మంది కొత్తగా కమ్యూనిస్టుపార్టీలో చేరారు. కార్మికవర్గ విద్రోహపంథా నవలంబించే సోషలిస్టుపార్టీపట్ల తమ అసమ్మతిని తెలియచేస్తూ కొందరు సోషలిస్టులు కూడా కమ్యూనిస్టు పార్టీలో చేరుతున్నారు. అబ్‌స్కాన్ అనే పట్టణంలో అయిదు రోజుల్లో 78 మంది ఆ పట్టణం యొక్క మేయరుతో సహా - కమ్యూనిస్టు పార్టీలో చేరారు. గని కార్మికులసమ్మె తదనంతరం 'లిబర్టీ' అనే లిలీ కమ్యూనిస్టు పత్రిక యొక్క సర్క్యులేషన్ 6000కు పెరిగితే, నార్డ్‌మటిన్ అనే సోషలిస్టు పత్రిక యొక్క సర్క్యులేషన్‌లో పదివేలు తగ్గిపోయింది.

కార్మికవర్గ విద్రోహపంథా ననుసరించి పెట్టుబడిదారి వర్గానికి ప్రక్కతాళం వేసే సోషలిస్టులు మేకతోలు కప్పుకున్న తోడేళ్లు అని ఫ్రెంచి కార్మిక ప్రజలు స్పష్టంగా గ్రహిస్తున్నారు.

# సోవియట్ యూనియన్‌లో ప్రజాకోర్టుల ఎన్నిక

సోవియట్ యూనియన్‌లో ప్రజాకోర్టుల ఎన్నికలు 1948 డిసెంబరులో ప్రారంభమై 1949 ఫిబ్రవరి చివరకు పూర్తి అవుతాయి.

ప్రజాకోర్టుల ఎన్నికల్లో లక్షోపలక్షల ప్రజలు అమితోత్సాహంతో పాల్గొంటారు. తులా, స్మోలెన్‌స్క్, ఆస్ట్రిఖాన్ వగైరా

ప్రాంతాల్లోను, టాటార్, బష్కిర్ వగైరా స్వతంత్ర రిపబ్లిక్కుల్లోనూ జరిగిన ఎన్నికల్లో నూటికి 95 మంది నుంచి నూటికి నూరువరకు పాల్గొన్నారు.

కమ్యూనిస్టులూ, తదితర ప్రజలూ కలిసి ఏర్పడిన సంఘటనకు ప్రజాకోర్టుల ఎన్నికల్లో సంపూర్ణ విజయం కలిగింది. న్యాయాధిపతులూ అసెసర్లూ, ప్రతినిధులూ ఈ సంఘటననుంచే ఎన్నుకోబడ్డారు.

సోవియట్ ప్రభుత్వ నిర్వహణలో ఈ ప్రజాకోర్టులు కూడా ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నాయి.

పీడిత ప్రజాసామాన్యాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికీ, పెట్టుబడిదారీ విధానాన్ని సురక్షితంగా కాపాడడానికీ ఉపయోగపడే సాధనాలైన బూర్జువాకోర్టులను సోవియట్ ప్రభుత్వం తొలిరోజుల్లోనే తుదముట్టించింది. ప్రజలందరిచే ఎన్నుకోబడిన ప్రజాకోర్టులను స్థాపించింది.

ప్రజలతో ఎప్పుడూ సన్నిహిత సంబంధం ఉండే ఈ ప్రజాకోర్టులే సివిల్, క్రిమినల్ కేసులను విచారించి నేరస్థులకు శిక్షవిధిస్తాయి.

రహస్యబ్యాలెట్ ద్వారా జడ్జీలను కూడా ప్రజలే ఎన్నుకొంటారు. ఈవిధంగా ఎన్నుకోబడిన జడ్జీలు (మూడు సంవత్సరాల గడువుకు పూర్వమే) ప్రజల విశ్వాసం కోల్పోయినచో మళ్లీ కొత్తగా ఎన్నికలుజరిపి వాళ్లను దింపివేసి ఆస్థానంలో కొత్త జడ్జీలను ఎన్నుకొంటారు. జడ్జీలను తొలగించే అధికారం అతను ఎన్నుకోబడిన నియోజకవర్గంలోని ప్రజలకు మాత్రమే ఉంటుంది. అంతేకాని జిల్లా అధికారులూ, రాష్ట్రాధికారులూ వాళ్లపై పెత్తనం చలాయించడానికీ, పైనుంచి ఉత్తరువులు జారీచేయడానికీ వీలులేదు.

తమను ఎన్నుకొన్న నియోజకవర్గంలోని ప్రజలందరూ ప్రజాన్యాయాధిపతులు, తాము చేసిన పనినిగురించీ, చేస్తున్న పనినిగురించీ ఆయానిర్ణీత తేదీల ప్రకారం రిపోర్టులిస్తూ ఉంటారు.

ప్రజాకోర్టులు నేరస్థులను బహిరంగంగానే విచారణజరుపుతాయి. ఆవిచారణకు ఎవరైనా హాజరుకావచ్చు.

నేరస్థుని కేవలం శిక్షించడమే సోవియట్ ప్రజాకోర్టుల ఆశయం కాదు. వారిని సంస్కరించడమే వాటి ప్రధానాశయం. ఆ యా నేరాలుజరగడానికి కారణాలేమిటో, పరిస్థితులేమిటో ప్రజాకోర్టులు విచారిస్తాయి. నేరస్థుడు తన అవసరమైన శిక్షణ గరపబడుతుంది. గౌరవనీయంగా కష్టంచేసుకొని బ్రతికేందుకు నేరస్థునికి అన్ని సదవకాశాలూ, కల్పించబడతాయి.

సోవియట్ యూనియన్‌లో ఉరిశిక్ష పూర్తిగా రద్దుచేసి వేయబడింది. నిజమైన మానవత్వానికీ సోషలిస్టు సమాజాయొక్క మహోన్నతన్యాయశాస్త్రానికీ ఇది మరొక నిదర్శనం.

---

<u>గమనిక</u>: 'ప్రజాస్వామికవిధానంపై కామ్రేడ్ లెనిన్' అనే వ్యాసం న్యూస్ అండ్ వ్యూస్ ఫ్రం ది సోవియట్ యూనియన్ (22-1-48) నుంచి అనువదించబడింది.

# మార్క్సిస్టు పరిభాష

## ప్రజాతంత్రం (డెమాక్రసీ)

వర్గాలు బలపడడానికీ, ఆయావర్గాలు తమ ఆర్థిక ప్రయోజనాలను సాధించుకోడానికీ, ప్రజాస్వామికం ఒక రాజకీయ సాధనంగా ఉపయోగపడుతుంది. కాబట్టి ప్రజాస్వామికంలో వివిధవర్గాలూ, వర్గపోరాటాలూ తప్పనిసరి అవుతాయి. ప్రజాస్వామికం అంటే ఇదమిత్థమని సర్వకాల సర్వావస్థలకు సమానంగా వర్తింపజేయడం సాధ్యంకాదు. ఆయా సమయాల్లో ఆయా సామాజికాభివృద్ధి దశలనుబట్టి వేరువేరు అర్థాల్లో ఆశబ్దం వాడబడింది. పురాతన గ్రీకు ప్రజాస్వామికంలో రాజరికవర్గాలూ, మరికొందరు స్వతంత్రపౌరులుమాత్రమే పాల్గొంటూ ఉండేవారు.

'బూర్జువా ప్రజాస్వామికంలో న్యాయశాస్త్రరీత్యా పౌరులందరూ సమానులే' అని పేరుకుమాత్రం అంగీకరించబడుతుంది. కాని నిజానికి ఆర్థికంగా ఉండే హెచ్చుతగ్గులపైనా వర్గాలపైన మాత్రమే బూర్జువా ప్రజాతంత్ర విధానం ఆధారపడుతుంది. ఆ హెచ్చుతగ్గులను అలాగే అట్టిపెడుతుంది. ప్రధానోత్పత్తి సాధనాలపై పెట్టుబడిదారీ, భూస్వామి వర్గాలకుండే గుత్తాధికారానికి ఎట్టిభంగం వాటిల్లకుండా దాన్ని సురక్షితంగా కాపాడుతుంది. ఇంకా బలపరుస్తుంది. బూర్జువా ప్రజాతంత్ర విధానంలో న్యాయశాస్త్రరీత్యా నామమాత్రంగా అంగీకరించబడే సమానత్వం, స్వాతంత్ర్యం తదితర ప్రజాస్వామిక హక్కులన్నీ, దోపిడిచేయబడే వర్గాలకు, అందులోనూ ముఖ్యంగా శ్రామికవర్గానికి సంబంధించినంతవరకు వట్టి బూటకంగానే ఉంటాయి ప్రజలను బానిసలుగా చేయడానికీ, మోసగించడానికీ సాధనాలుగా మాత్రమే అవి ఉపయోగపడతాయి."

—(ప్రోగ్రాం ఆఫ్ ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్)

పెట్టుబడిదారీ సమాజంలో ప్రజాతంత్రం అంటే ధనికులకు మాత్రమే ప్రజాతంత్రం. ధనికవర్గ నియంతృత్వానికి వేసిన మేలిముసుగే బూర్జువా ప్రజాస్వామికం. పెట్టుబడిదారీ వ్యవస్థలో బాగా ఆస్తిపాస్తులున్న బహుకొద్దిమందికి మాత్రమే మొదట వోట్లు లభిస్తాయి. ఆతర్వాత పెట్టుబడిదారీ విధానంలో 'లిబరలిజం' అభివృద్ధిచెందినకొలదీ ప్రజలకు నామమాత్రంగా వోట్లు లభించినా ఉత్పత్తి సాధనాలూ ప్రచారసాధనాలూ, అన్నీ పెట్టుబడిదారీవర్గం చేతిలోనే ఉండడంవల్ల రాజ్యాంగయంత్రం అంతా ఆ వర్గంచేతిలోనే ఉంటుంది. ప్రజాసామాన్యాన్ని దోపిడీ చేయడానికీ, అణచివేయడానికీ ఉపయోగిస్తుంది.

"సంపూర్ణ ప్రజాతంత్రవిధానాన్ని ప్రవేశపెట్టకుండా సోషలిజం జయప్రదం కానట్టే ప్రజాస్వామికంకోసం బహుముఖంగా నిరంతర విప్లవపోరాటం సాగించనిదే శ్రామికవర్గం

పెట్టుబడిదారీవర్గంపై విజయాన్ని సాధించడానికి తగిన సన్నాహం చేయజాలదు."

— లెనిన్

నోటు:—పూర్తికాలం పనిచేసే అధికారి బృందాన్నీ, ప్రతినిధి సంస్థలనూ, ప్రజల యాజమాన్యంలో ఉంచడం, (లెనిన్) అనే ఈ సిద్ధాంతంమీదనే సాధారణంగా ప్రజాతంత్ర విధానం ఆధారపడుతుంది.

"పౌరులవిషయంలో అధికారరీత్యా తాముచేసే చర్యలన్నిటికీ ప్రభుత్వోద్యోగులు సాధారణ కోర్టుల్లో న్యాయశాస్త్రప్రకారం బాధ్యతవహించవలసి ఉంటుంది. ఈ సూత్రమే అన్ని స్వాతంత్ర్యాలకు మొట్టమొదటి ప్రాతిపదిక." — ఎంగిల్స్

కష్టజీవుల చేతుల్లోనే సంపూర్ణ పరిపాలనాధికారం ఉన్న సోవియట్ యూనియన్‌లోని సామాజిక పరిస్థితులతో పెట్టుబడిదారీ దేశాల్లోఉండే సంకుచిత ప్రజాస్వామికాన్ని పోల్చిచూస్తే "పెట్టుబడిదారీవిధానం బాగా అభివృద్ధిచెందిన దేశాల్లోని ప్రజాస్వామికం కంటె సోవియట్ ప్రజాస్వామికం లక్షరెట్లు ఉత్తమోత్తమమైనది." (లెనిన్) అని స్పష్టంగా బోధపడుతుంది.

(వివరాలకు ఈ సంచికలోనేఉన్న "ప్రజాస్వామిక విధానంపై కామ్రేడ్ లెనిన్" అనే వ్యాసం చదవండి.)

* * *

## విప్లవం

నూతన పురోగామివర్గం రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీనంచేసుకోవడమే విప్లవం. 1789 లో ఫ్రాన్సులో జరిగిన బూర్జువా విప్లవం, 1917 నవంబరులో రష్యాలోజరిగిన శ్రామికవర్గ విప్లవం—ఇందుకు ఉదాహరణలు.

సూచన:—హిట్లరు రాజ్యాంగ యంత్రాన్ని వశపరచుకోవడం విప్లవంగా పరిగణించబడదు. ఎందువల్లనంటే అధికారం ఒకే వర్గం — పెట్టుబడిదారీవర్గం — చేతుల్లోనే ఉండిపోయింది. జరిగిన మార్పల్లా పెట్టుబడిదారీ ప్రజాతంత్రానికి బదులుగా పెట్టుబడిదారీ దారుణ నిరంకుశ పాలన ఏర్పడడమే.

### జాతీయ విప్లవం:

తన జాతీయ స్వాతంత్ర్యం కోసం ఒక బానిసదేశం విదేశ సామ్రాజ్య వాదులపై సాగించేపోరాటాన్ని సామాన్యంగా జాతీయ విప్లవం అని పిలుస్తారు. ఇండియా, చైనా లాంటి వలస, అర్ధవలసదేశాలలో జరిగే జాతీయ విప్లవాల్లో దాదాపు బూర్జువా విప్లవానికి గల లక్షణాలన్నీ సామాన్యంగా ఇమిడి వుంటాయి.

### బూర్జువా విప్లవం:

అదివరకున్న ఫ్యూడల్ రాచరిక విధానాన్ని నూతనంగా ఉత్పన్నమైన పెట్టుబడిదారీ వర్గం కూలద్రోసి అధికారాన్ని స్వాధీనం చేసుకోవడాన్ని బూర్జువా విప్లవం అంటారు. ఉదాహరణ: 1789 జరిగిన ఫ్రెంచి విప్లవం; ఇంగ్లాండులో క్రామ్‌వెల్ విప్లవం; 1917 ఫిబ్రవరిలో రష్యాలో జరిగిన విప్లవం (కెరెన్‌స్కీ ప్రభుత్వం) ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం టర్కీలో ముస్తఫాకెమిల్ పాషా నాయకత్వాన జరిగిన విప్లవం.

బూర్జువా విప్లవం పెట్టుబడిదారీవిధానం పూర్తిగా అభివృద్ధి కావడానికి అవకాశం కలుగజేస్తుంది. స్వదేశీ మార్కెట్టును ఏర్పాటు చేసేందుకు బానిస విధానాన్ని నిర్మూలిస్తుంది. రైతాంగంలోకొంతభాగాన్ని శ్రామికవర్గంగా మార్చి, ఆధునిక పరిశ్రమలను అభివృద్ధి చేస్తుంది. ఫ్యూడల్ విధానంపై పోరాటం సాగించడానికి పార్లమెంటరీ విధా

ఎం లేక బూర్జువా ప్రజాతంత్ర విధానాన్ని ప్రవేశ పెడుతుంది. తద్వారా కార్మికవర్గం సోషలిజంకోసం జయప్రదంగా పోరాటం సాగించడానికి అవసరమైన పరిస్థితు లేర్పడేందుకు కారణభూత మవుతుంది. అందువలన కమ్యూనిస్టులు చరిత్రరీత్యా అవసరమైన అభ్యుదయకర బూర్జువా విప్లవాలను బలపరుస్తారు.

శ్రామికవర్గ విప్లవం:

రాజ్యాధికారాన్ని శ్రామికవర్గం వశపరచుకొని సోవియట్ ప్రభుత్వాన్ని ఏర్పరచడమే శ్రామికవర్గ విప్లవం; కార్మికులు హస్తగతం చేసుకొన్న ప్రభుత్వాన్ని వర్గ శత్రువులనుండి కాపాడుకోడానికి శ్రామికవర్గ నియంతృత్వంతో కూడిన ప్రభుత్వం నిర్మించబడుతుంది. దీని తరువాత కార్మికులు సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి ప్రయత్నిస్తారు. సోషలిస్టు సమాజాన్నుండి క్రమేణా కమ్యూనిస్టు సమాజానికి పురోగమిస్తారు.

“పెట్టుబడిదారీవిధానం తాను స్వయంగా సృష్టించి తయారుచేసిన శ్రామికవర్గమే పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి సోషలిజం సాధించడానికి బౌద్ధికంగా, నైతికంగా, సంచాలక శక్తిగా పనిచేస్తుంది.”

— లెనిన్

* * *

# నియంతృత్వము

(డిక్టేటర్‌షిప్)

ఒకవర్గం మరొక వర్గంపైగాని, వర్గాలపైగాని బలప్రయోగంతో పరిపాలన సాగించడం నియంతృత్వం అనబడుతుంది. పెట్టుబడిదారీ ప్రజాతంత్ర రాజ్యాలలో పెట్టుబడిదారుల యొక్క (మరుగుపడిన) నియంతృత్వం పరోక్షంగా సాగించబడుతుంది. ఫాసిస్టు రాజ్యాలలో బడాపెట్టుబడిదారుల భయంకరనియంతృత్వం ప్రత్యక్షంగానే - నగ్నంగానే - సాగించబడుతుంది. శ్రామికవర్గ నియతృత్వం అంటే ప్రజలలో అత్యధిక సంఖ్యాకులైన పీడిత వర్గాల అండతో శ్రామికవర్గం ప్రజలందరి ప్రయోజనాల కోసం, కొద్దిమైనారిటీ అయిన పెట్టుబడిదారీ, జమీందారీ వర్గాలకు వ్యతిరేకంగా బహిరంగంగా సాగించే పరిపాలన.

షరా:—ఒక వ్యక్తిగాని, లేక ఒకముఠా గానీ సాగించే పాలనకు పైన చెప్పబడిన నిర్వచనంతో ఎలాంటి సంబంధమూ లేదు.

* * *

# మేధావులు

పెట్టుబడిదారీ సమాజంలో సామాన్యంగా మధ్య తరగతినుండి వచ్చే డాక్టర్లు, సాంకేతిక నిపుణులు (టెక్నిషియన్‌లు,) పత్రికా రచయితలు, కవులు, కళాకారులు వగైరా విద్యావంతులు మేధావులుగా పరిగణించబడతారు. వీరు ఆర్థికంగా పెట్టుబడిదారీ వర్గంపై ఆధారపడి ఉంటారు. మార్క్సిస్టు సారస్వతంలో శ్రామికవర్గానికి చెందని విద్యావంతులు వర్గ పోరాటం విషయంలో శ్రామికవర్గ దృక్పథాన్ని అనుసరించే వారిని మేధావంతులని వాడతారు. ఆర్థికంగా పెట్టుబడిదారీవర్గంతో వీరికి ఎక్కువ సంబంధం వుంటుంది. కాబట్టి మేధావులు సిద్ధాంతరీత్యా కార్మికవర్గంకంటె పెట్టుబడిదారీవర్గం వైపుకే ఎక్కువ మొగ్గుతూ ఉంటారు. కార్మికులకూ, పెట్టుబడిదారులకూ మధ్య ఊగిసలాడతారు. సోవియట్ మేధావులను గురించి కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు:— ‘పెట్టుబడిదారీ సమాజంలో మేధావులు వర్గాలకు అతీతులుగా వున్నట్లు

వర్తించుతూ, ఆచరణలో ఎక్కువ భాగం పెట్టుబడి దారులకూ, జమీందార్లకూ ఉపయోగ పడతారు. కాని సోషలిస్టు సమాజమైన సోవియటులో మేధావులు కార్మిక కర్షకులతో ఎక్కువ సన్నిహితసంబంధాన్ని కలిగి ఉంటారు. ఇది వరకు వారికి ధనిక వర్గాలకు సేవచేయడం తప్ప మరోగత్యంతరం ఉండేది కాదు. కాని సోవియట్ సమాజంలో మేధావులు కూడా కార్మిక కర్షకులతోపాటు సమానంగా వర్గరాహిత్యమైన నూతన సమాజాన్ని నిర్మించడానికి కృషి చేస్తారు. తమ మేధస్సునంతనూ ధనిక వర్గాల ప్రయోజనాలకు గాక మొత్తం సమాజ శ్రేయస్సుకు వినియోగించి నూతన సమాజ నిర్మాణంలో భాగస్థులవుతారు.

***

# అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ

## (కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్)

### ప్రథమ ఇంటర్ నేషనల్ :

దీనిని 1864 శాస్త్రీయ సోషలిజానికి మూలపురుషులయిన మార్క్సు, ఎంగెల్సులు "అంతర్జాతీయ కార్మికసంఘం" అనే పేరుతో స్థాపించారు. ఇందులో సోషలిస్టు ఆశయాన్ని అంగీకరించే వివిధదేశాలలోని కార్మిక సంఘాలు సభ్యులుగా చేరవచ్చు. పారిస్ కమ్యూన్ ఓటమి అనంతరం 1872 లో ఇది రద్దుచేయబడింది.

### రెండో ఇంటర్ నేషనల్ :

1889 లో స్థాపించబడింది "ప్రథమ ప్రపంచయుద్ధానికి పూర్వం - పెట్టుబడిదారీ విధానం కొంత శాంతియుతంగా అభివృద్ధి అయ్యే కాలంలో అంటే పెట్టుబడిదారీ విధానంలో ఉన్న పరస్పరవైరుధ్యాలు ఇంకా తీవ్రంగా బైటబడక పూర్వం పనిచేసింది." (స్టాలిన్) తరువాత అవకాశతత్వంతో పెట్టుబడిదారీ విధానానికి లొంగిపోయి 1914-18లో జరిగిన సామ్రాజ్యవాదయుద్ధంలో కార్మికవర్గానికీ, యుద్ధానంతరం వచ్చిన విప్లవాలకూ ద్రోహం చేసింది. పెట్టుబడిదారులతో పోరాడటానికి నిరాకరించి, ఆర్థిక సంక్షోభకాలంలో పెట్టుబడిదారీ విధానానికి సాయపడింది. జర్మనీ, ఫ్రాన్సు, బెల్జియం లాంటి దేశాలలో యీ సంస్థకు చెందిన ప్రముఖ నాయకులు ప్రత్యక్షంగా ఫాసిజానికి సాయపడ్డారు.

### మూడో ఇంటర్ నేషనల్ :

ఇది 1919 లో లెనిన్ నాయకత్వాన స్థాపించబడింది. ప్రపంచంలోని అన్నిదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలూ యిందులో సభ్యులుగా చేరవచ్చు. ప్రధాన మార్క్సిస్టు సూత్రాలయిన వర్గపోరాటం, శ్రామిక వర్గ నియంతృత్వం అనే ఈ రెండింటి పైన ఆధారపడి యీ సంస్థ పనిచేసింది. ఈ సంస్థయొక్క ఏడో కాంగ్రెసు (ఆఖరిది) 1935 లో జరిగింది. దీనికి కామ్రేడ్ డిమిట్రాఫ్ ప్రధాన కార్యదర్శిగా చాల కాలం పనిచేశాడు. ఈ సంస్థయొక్క ప్రధాన ఆశయం వివిధదేశాలలో కమ్యూనిస్టు పార్టీలను బలంగా నిర్మించడం పూర్తి అయింది కాబట్టి 1943 లో యీ సంస్థ రద్దు చేయబడింది.

***

# సంస్కరణ తత్వం

తమ ప్రధాన హక్కుల కోసం, తమ వర్గంయొక్క అంతిమ లక్ష్యమైన సోషలిజం

కోసం కార్మికులు జరిపే పోరాటాన్ని పెడ ద్రోవ పట్టించడమే సంస్కరణ తత్వం. సంస్కరణ వాదం. కార్మికోద్యమంలో పని చేసే సంస్కరణ వాదులు పెట్టుబడిదారుల పరిపాలనను తుదముట్టించడం ద్వారాగాక, సంస్కరణల ద్వారా కార్మిక సమస్యలను, పరిష్కరించడానికి ప్రయత్నిస్తారు. పెట్టుబడిదారీ విధానంలో కార్మికుల స్థితిగతులను బాగుపరచడానికవకాశాలుంటాయని సంస్కరణవాదులు భ్రమలు కల్పిస్తారు. సంస్కరణల ద్వారానే "క్రమేణా" సోషలిజం సాధించగలమని కార్మికులను మోసపుచ్చుతారు.

మరా: కమ్యూనిస్టులుకూడా సంస్కరణలకోసం కార్మిక పోరాటాలను నడుపుతారు. కాని వాటిని సాధించడమే కార్మికవర్గ అంతిమ లక్ష్యంగా చిత్రించరు. జీతాల పెంపుదలకోసం, యింకా యితర సౌకర్యాలకోసం, కార్మికులను సంఘటితపరుస్తూ వారిలో సోషలిస్టు చైతన్యాన్ని అభివృద్ధి చేయడానికి కృషిచేస్తారు. ఆవిధంగా కార్మికులు రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీనం చేసుకోవడానికి తర్ఫీదునిస్తారు. మితవాద కార్మిక నాయకులలోవుండే అర్థికతత్వాన్ని చీల్చి చెండాడి, రాజకీయాధికారం హస్తగతం చేసుకోననిదే కార్మికసమస్యలు సంపూర్ణంగా పరిష్కరించబడవనే సత్యాన్ని ప్రబోధిస్తారు. సంస్కరణ తత్వానికి మూలమైన ఆర్థిక పునాదులు సామ్రాజ్యవాదంలో గోచరిస్తాయి.

# మార్క్సిజం - ఇండియా

## —: ప్రజాస్వామిక ప్రజాతంత్రం :—

మనం ప్రజాతంత్ర విప్లవదశలో ఉన్నామా? లేక సోషలిస్టు విప్లవదశలో ఉన్నామా? ఈరోజున మన నినాదం ఏది? శ్రామికవర్గ నియంతృత్వమా? లేక కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమా? భారతదేశంలోని ప్రజాతంత్రం సంఘటనలో ఏయే వర్గాలువుంటాయి? ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం ఏయే వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది? ప్రస్తుత భారతపరిస్థితుల్లో పెటీబూర్జువాకు ఏమైనా విప్లవకరపాత్ర ఉందా? ఇవన్నీ—ఈ వ్యాసంలో క్షుణ్ణంగా చర్చించబడ్డాయి.

## —: భారత వ్యవసాయ సమస్య :—

పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ చాల వెనుకబడివున్న వలస, అర్ధవలసదేశాలు రాజకీయంగా, అర్థికంగా, సాంఘికంగా ముందుకు పురోగమించాలంటే వ్యవసాయక విప్లవం తప్పనిసరి అవుతుంది. ఈ వ్యాసం భారత వ్యవసాయ సమస్యను కూలంకషంగా చర్చించి రైతాంగంలోని ఏ యే వర్గం వ్యావసాయిక విప్లవంలో ఏ యే పాత్ర నిర్వహిస్తుందో వివరిస్తుంది. ప్రస్తుతదశలో వ్యవసాయరంగంలో మన ప్రధాన బాధ్యతలనుగురించి విస్పష్టంగా తెలియజేస్తుంది.

మార్క్సిజాన్ని మన దేశపరిస్థితులకు అన్వయించి వ్రాయబడిన ఈ రెండువ్యాసాలనూ ప్రతివారూ తప్పనిసరిగా అధ్యయనం చెయవలసివుంటుంది. ఈ రెండు ప్రధాన సిద్ధాంతవ్యాసాలూ ప్రకటించబడిన **జనత ౮వ సంచిక** ఇక కొద్దికాపీలు మాత్రమే ఉన్నాయి. త్వరపడండి.

# ఏజంట్లకు హెచ్చరిక

మావద్ద మీ డిపాజిట్లు లేనిదే పత్రికలు పంపబడవు. మీకు పంపే పత్రికలకు సరిపడే డబ్బైనా కనీసం లేనిదే పత్రికలు పంపబడవు. ఈ రూలును మా కార్యాలయం ఖచ్చితంగా అమలు పరుస్తుంది.

ఏజెంట్లందరికీ వారిడబ్బు యిక్కడ ఎంత వుందో, యింకెంత పంపించవలసి ఉందో, తెలియపరుస్తూ ప్రతిపక్షం జాబులు వ్రాస్తాం. ఏజెంట్లు మాకు పంపించవలసిన డబ్బు ప్రతినెలా 13, 28 తేదీలలోపల అందేటట్లు పంపితేనే మేము సకాలంలో పత్రికలను అందజేయడం సాధ్యమౌతుంది. అదనపుకాపీలు కావలసివస్తే ముందుగానే తెలియపరచాలి.

మీరు డబ్బు పంపేటప్పుడు అడ్రసును, సాధ్యమైనంతవరకు తెలుగులో విడివిడి అక్షరాలతో వ్రాయకోరతాం. ఇంగ్లీషులో అయితే అచ్చు అక్షరాలు వాడాలి. ఈ విషయంలో ఏమాత్రం అశ్రద్ధచేసినా అడ్రసులలో తప్పులుపడి ఇబ్బందులకు కారణమవుతుంది.

మావద్ద డబ్బులేనిదే ఎన్నిఉత్తరాలు వ్రాసినా పత్రికలు పంపబడవనే విషయాన్ని ప్రతి ఏజెంటూ గుర్తించకోరతాం.

మేనేజరు, జనత

---

## ఏజంటుకు

మీ ఎవరివద్దనైనా జనత 1వ సంచిక 4వ సంచిక ఉన్నచో మా ఆఫీసుకు పంపండి. ఆసంచికలకొరకు మా ఆఫీసుకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. ఆ సంచికలు ఉంటే వెంటనే మాకు పంపండి.

Regd. No. 5296 JANATA 1st March '49-As. 8

BC





జ్యూలిస్ ఫ్యూజిక్

# ఉత్తమ రచన - ఉత్తమ రచయిత

ఫాసిస్టు రాక్షసుల చేతుల్లో బందీగా చిక్కి అనేక చిత్రహింసలకు గురై, ఉరికంబం ఎక్కబోతూన్న ఒక జెక్ దేశభక్తుడు, ఒక ఉత్తమ సాహిత్యపరుడు, ఒక కమ్యూనిస్టు నాయకుడు తాను ప్రత్యక్షంగా తన శరీరంలోనూ, మనస్సులోనూ, అణువణువునా అనుభవించిన యమబాధలనూ, అవమానాలనూ, ఇంకా జీవితంమీద, మానవత్వంమీద తనలో అచంచలంగావున్న ప్రేమనూ, విశ్వాసాన్నీ, భవిష్యత్తుమీది ఆశనూ ఇందులో స్వయంగా చిత్రించాడు.

ఈ మహత్తరమైన రచన అన్ని కాలాల్లోనీ, అన్ని దేశాలలోనీ నిరంకుశ పరిపాలకులకు మానవజాతి పిడికిలి బిగించి చేసే సవాలు. నేటి ప్రపంచంలో స్వేచ్ఛా ప్రజాస్వామికాల కోసం జరుగుతున్న మహాసంగ్రామంలో పాల్గొంటున్న యోధులందరికీ ఈ రచనొక దివ్యజ్యోతి.

విశ్వసాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెందిన ఈ గ్రంథరాజాన్ని ప్రతిఒక్కరూ తప్పక పఠించితీరాలి. వెల: ఒక రూపాయి

ప్రాప్తిస్థానం:
అభ్యుదయ కార్యాలయం
విజయవాడ




Edited, Printed and Published by Gangineni Venkateswara Rao Guntur
Printed at Rasatarangini Press, Vijayawada



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M110 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |